# జయంతి ప్రథమ సంపుటము

## రచనల అకారాది సూచిక

అను—అనువాదము  చ. వే—చర్చావేదిక  పు. స—పుస్తక సమీక్ష  పా. ఉ - పాఠకుల ఉత్తరాలు

## రచయితల అకారాది సూచిక

# జయంతి

౧

జయంతి తే సుకృతినో
రససిద్ధాః కవీశ్వరాః.

సంపాదకమండలి :
విశ్వనాథ సత్యనారాయణ (అధ్యక్షులు)
మల్లంపల్లి సోమశేఖరశర్మ
దివాకర్ల వేంకటావధాని
కేతవరపు రామకోటిశాస్త్రి
జువ్వాడి గౌతమరావు

సంవత్సర చందా ౮-౦౦
విడిప్రతి ౭౫ న. పై.

సంపుటి. 1 నవంబరు 1958

# వి ష య సూ చి క

# సంపాదకీయము

ఇది మఱల నింకొక సాహిత్య పత్రికను మే మారంభించుచున్నాము. ఆరంభించవలసిన యవసర మేమి? ఇదివఱకున్నవి చాలవా? యను ప్రశ్న యున్నది. చాలవని మా యభిప్రాయము కనుకనే దీని నారంభించుట.

ఈనా డాంధ్ర సాహిత్యము బహుమార్గములుగా పోవుచున్నది. ఇది సువ్యవస్థితమైన మార్గమని చెప్పుటకు వీలు లేకుండ నున్నది. ప్రాత మార్గము, క్రొత్తమార్గము. ప్రాత మార్గము పూర్వచ్ఛందోబద్ధమై నడచుచున్నది. క్రొత్తది నడక నాశ్రయించి సాగుచున్నది. ప్రాతమార్గము కవిత్వమునకు సంకెలలు వేయుట వంటిదని క్రొత్తవారి యభిప్రాయము. క్రొత్తవారిది విశృంఖల మార్గమని పూర్వుల యభిప్రాయము. క్రొత్త మార్గములో పూర్వచ్ఛందస్సు యొక్క పరిత్యాగ మొక్కటియే కాదు, వాడుకభాషయొక్క యధేచ్ఛా స్వీకారము కలదు. క్రొత్తమార్గములోని యెక్కువ శోభ రెంటి నాశ్రయించి యధికముగా కనిపించుచున్నది. మొదటిది వృత్త్యనుప్రాసము. రెండవది అంత్యప్రాసము. ఈ యంత్యప్రాసము యమకముతో జోడింపబడియుండును. దీనిని హిందీభాషలో తుక్‌బందీ అందురు. హిందీలో ఆధునిక సారస్వత పితామహు లిద్దరిలో ఒకాయన పేరు మహావీర్ ప్రసాద్ ద్వివేదీ. ఆయన ఈ తుక్‌బందీని యెక్కువగా ప్రశంసించలేదు. దీనిచేత పాఠకుని మనస్సులో ఒకవిధమైన చక్కిలిగింత కలుగునని పైగా రసాస్వాదమునకు భంజకమని కూడ ద్వివేదిగారి యభిప్రాయము. అరువుతెచ్చుకొన్న చోటనే దాని వెల తక్కువ గదా!

ఈ క్రొత్త కవిత్వములోని వస్తువు ఆధునికములైన కొన్ని పరిస్థితుల చుట్టు ప్రదక్షిణము చేయుచుండును. ఆకలి పేదవాళ్లు, ధనవంతుని దురాగతములు, మతనిరాసము. ఇవి ప్రధాన విషయములు. వారికొక ప్రత్యేక శబ్దజాలము కలదు. పూర్వ సంప్రదాయపు కవులకు కోకిల వసంతము సెలయేఱు కృతకాద్రులు తామరపూలు వెన్నెల విరహము ఈ మొదలైన సరుకు కలదు. ఆధునికులకు ఫిరంగులు, ఉక్కుతెఱ, ఇనుప బూట్ల కాళ్లు చీకటి, అస్థిపంజరములు మొదలైన సామగ్రి కలదు. ఉభయత్ర గాఢమైన కవితాభావనలేనివారు ఈ సామగ్రి చుట్టును ప్రదక్షిణము చేయుచుందురు. కొద్దిలో ఆధునికమైన ఉభయ సాహిత్యముల దోష మిది.

కవి తానే ఛందస్సును స్వీకరించినను, ఇట్టి సామగ్రీ బాహుళ్యము చేత, దీని ప్రాధాన్యము చేత, అతని రచన నీరసమగును. ఈ సామగ్రి నాశ్రయించిన భావములు సర్వదా పిష్టపేషణములు, చర్విత చర్వణములు. కాని ఈ సామగ్రినే తీసుకొని ఒకానొక మంచి వాక్సైపుణ్యములు గల కవి చెప్పిన తరహాలోని సొగసుచేత ఒక రమ్యత తేవచ్చును. అది మాట నాశ్రయించిన సౌందర్యము. దానికి లోతుండదు. ఆమె యెఱ్ఱనిది. కనుముక్కు తీరు బాగుగా లేనిది. ఆ కవిత యట్టిది.

మఱియు ఈరెండు ఛందోమార్గముల గుణాగుణములను విమర్శించినచో అనగా భిన్నచ్ఛందస్సుల యందు అంతర్నిహితమైన శక్తులను విచారించినచో పూర్వఛందస్సునందున్న పుష్టి ఆధునిక ఛందస్సునందు లేదు. ఇది గాలిలో లేచిపోవు దూదివలె నుండును. అది స్థిరమైనదిగా కనిపించును.

వృత్తములు కొన్నివందలు కలవు. వేలుకలవు. నన్నయ్యగారి సంప్రదాయమును బట్టి చంపకమాల, ఉత్పలమాల, మత్తేభ శార్దూలములు, కందము, సీసము, గీతము, ఇవి ప్రధానముగా ఆంధ్రభాషా కావ్యోపయోగి ఛందములుగా స్వీకరింపబడినవి. ఆ మార్గమున వ్రాయబడిన కావ్యములు వందలయేండ్లు నిలచినవి. ఈ నిలుచుటయే ఆ ఛందస్సుల యొక్క పౌష్కల్యమునకు సాక్ష్యము. ఈ వృత్తములు సంస్కృత భాషాకావ్యములలో లేవు. శార్దూలమొక్కటియే సమానమైనది. సంస్కృత కావ్యములలో నే వృత్తములు కలవో ఆ వృత్తములు ప్రధానముగా నాంధ్రభాషకేల పనికి రాలేదు? ఆ సంస్కృత కావ్యములు వ్రాయబడిన వృత్తములలో వ్రాయబడిన తెలుగు కావ్యములు రెండు మూడుకలవు. వానికి స్థితిలేదు. ఎందుచేతననగా ఒకభాష కొకశక్తి యుండును. ఒకఛందస్సున కొక శక్తి యుండును. ఈ రెండుశక్తులు కలిసికొన్నచోట ఆ ఛందస్సులో ఆభాష రాణించును, ఇది భాషాస్వత్వము. ఛందస్వత్వము. ఈ భాషా ఛందస్సులయొక్క పరస్పర సంయోజనానుకూల సముచిత

త్వమును చూచిన పూర్వకవులు మహర్షులు. నన్నయ్యయట్టి ఋషి.

ఆధునికుల యొక్క ఛందస్సులుకూడ భాషాస్వభావము నాశ్రయించియే యున్నవనవచ్చును. భాష యెచ్చటనైనను రెండువిధములు. వాడుకభాష. రెండవది గ్రాంధికభాష. గ్రాంధిక భాషయనినంతనే కొందఱు మొగము ముడుచుకొందురు. గ్రాంధిక భాషయనగా నియమితమైన భాష. నియమము నాగరకత. యథేచ్ఛావృత్తి గ్రామీణత. అసంయమిత. రాజ్యవ్యవహార పరిషత్తులలో కాని, భాషా పరిషత్తులలో కాని పదిమంది సముదాచారవంతుల సమావేశములో కాని, వీధిలో మాట్లాడు భాష మాట్లాడరుకదా? ఇతర సభలలో మాట్లాడినచో పరిహసింతురు. రాజ్యాంగ పరిషత్తులలో మాటాడినచో శిక్షాపాత్రులగుదురు. అందుచేత భాషకీ విభాగము తప్పదు. కావ్యము నాగరకతాప్రవృత్తముకలది కనుక, అంతర్వ్యవహారసంబంధి కనుక ఉదాత్తవిషయ పరిశీలనా భూమి గనుక జాతియొక్క లక్ష్యములను నిరూపించు వ్యాపారము నాశ్రయించినది గనుక దానియందు నియమిత భాషయుండుట న్యాయముకదా!

భాషకలదు. భావముకలదు. కవియొక్క యావేశము కలదు, కవి చెప్పునటువంటి విషయము యొక్క ప్రాధాన్యము కలదు. కవియొక్క నేర్పు కలదు. ఇన్నియున్నవి. ఇందులో కొన్ని తక్కువవి కొన్ని యెక్కువవి. యెక్కువైనవాని సంయోగముచేత తక్కువైనవాని కొకొకప్పుడు యోగ్యతాస్థానము వచ్చినట్లు కన్పించును. ఆ సందర్భము, తక్కువైన ఈ విషయము ఎక్కువతనము కలది, అన్న భ్రాంతిని కల్పించును. ఉదాహరణముగా అనాగరకమైన భాషలో ఒకానొక ప్రజోపయోగకరమైన విషయము చెప్పబడినది. దానికాదరణము వచ్చినది. విషయ పురస్కృతమై వచ్చినదికాని అచటనున్న భాషనుబట్టి రాలేదు. ఆ సందర్భమునందా భాషకు ప్రాధాన్యము సిరాకరించబడలేదు. గనుక సర్వత్ర దానికి ప్రాధాన్య వివక్ష చేయుట అపరిశీలనా మతిజనితము.

వాడుకభాషలో నాలుగైదు మాటలతో—చాలసార్లు కర్త కర్మాదులు లేకుండగనే—భావము చెప్పుట కలదు. ఈ మార్గమును కొందరు ప్రౌఢకవులు గూడ తమకావ్యములందచ్చటచ్చట నవలంబించిరి. వారవలంబించిన లక్షణము వేరు. వారు భావముయొక్క లోతులను తీసికొని అచ్చటి పాత్రయొక్క మనో లక్షణమును సందర్భౌచిత్యమును పరిశీలించి దానినెన్నుకొనిరి. ఆధునికకవులలో వక్త కవియే. అతని భాష అతనిదే యనుచున్నది. అతడు పాఠకునకు ముఖాముఖిగా నిలుచున్నాడు. కావ్యములలోని పాత్రలు పరోక్షముగా నున్నారు. ఆధునిక కవి ప్రత్యక్షముగా నున్నాడు. లోకములోనే చూడవచ్చును. ఎవడో యెక్కడో మనలను గురించి యనిన మాటకు మన యెదురుగనే మనలను గురించి యనినమాటకు మనము స్వీకరించెడి లక్షణములో భేదము కలదు. పరోక్షమైన మాటకు అధికకోపము వచ్చును. ప్రత్యక్షమయిన మాటకు వచ్చిన కోపమును నియమములో పెట్టుకొని వానిని నిందింతురు. వానితో పోరాటమునకు దిగుదురు. పరోక్షమైన మాటకు వచ్చిన కోపము గాఢతరమైనది. ఈ సాదృశ్యముచేత రస విషయమును పర్యాలోచించవచ్చును, కథాగతములైన విషయముల వలన కలుగు మనోభావములు హృదయముల మీద గాఢతరమైన ముద్ర కలిగించును. ప్రత్యక్షముగా వినినమాటలకు నెడదమీద నంత ముద్రలేదు. అది వెంటనే ప్రతిసమాధేయమగుచున్నది కనుక. ఈ భేదము కథామయ కావ్యగత కవితానుభవమునకు, కవియే వక్తయైన కావ్య కవితానుభవమునకు పట్టకతప్పదు, మఱియు ఈ క్రొత్తకవి వ్రాసెడు వాడుక భాష మన హృదయముమీద ముద్రితమగుటకు దానియందు నియమములేదు. దానికి శక్తిలేదు. ఈ వాడుక భాషలోని వాక్య మసమగ్రము. దాని ముద్రయు అల్పము. ఆ ఛందస్సునందు పుష్టిలేదు. ఈ మార్గమున కొంత సమాదరము కలిగినచో ఆగుణము ఆమార్గము నాశ్రయించినది కాదు. ప్రజా బాహుళ్యమునందు నెలకొనిన కొన్ని యాధునిక సమస్యలు దానియందు పరామర్శింపబడుటయే దానియందు చూపబడుచున్న తాత్కాలిక సమాదరము యొక్క హేతువు.

ఇంక పూర్వ కవిత్వము. ఈ పూర్వ కవిత్వము యొక్క సామగ్రియు తొలుత చెప్పబడినది. ఈ వట్టి సామగ్రి నాశ్రయించి వ్రాయబడెడు కవిత్వమున కెప్పుడును గౌరవములేదు. కాని ఆ ఛందోమార్గమున కొక పుష్టి గలదు గదా! పుష్టిగల యీ మార్గమున యొక వైలక్షణ్యము కలిగిన శబ్దముల కూర్పుచేత తక్కువ భావనాశక్తిగల కవి యొక్క రచనకు గూడ ప్రసిద్ధి వచ్చుట కలదు. ఆ మార్గములో నొక దోషమున్నది. అత డేమి చెప్పెనని కాదు, ఎంత మధురముగా చెప్పెనని. మాధుర్యము, సౌకుమార్యము, సరిగా నర్థము చేసికోబడని ప్రసన్నతాగుణము, అపూర్వ ఛందోమార్గమున నేడు తాండవముచేయుచున్నవి. భావనా పటిమకు గౌరవము తగ్గిన యేకాలమునందైనను వాని యుద్ధత నృత్యము తప్పనిసరియే.

భావము, సౌకుమార్యము - మొదటిది ప్రధానముగా నర్థమునకు సంబంధించినది. రెండవది ప్రధానముగా శబ్దమునకు సంబంధించినది. జనసామాన్యము రెండవదానికి వశులు. విశేషజ్ఞులు తొలుతటి దానియందు సమాదరము కలవారు. ఇది పరిహరించరాని మానవలక్షణము. సర్వజనులు గాఢశీలురు కారు. మహా విజ్ఞానవంతులు కారు. అందుచేత గాఢ భావనా లక్షణము పరిమిత సంఖ్యాకులైన కొందఱకే పట్టును. కాని వారెక్కడనున్నారో ఎట్లు తెలియును? అందుచేత తత్ప్రయత్నము మానకూడదు. నిత్యమైనదదియే. జాతియొక్క పరమనాగరకతాలక్షణ మదియే. మానవ జీవితములోని లోతులను స్పృశించువారు వారే. వారే మానవజీవిత పరమార్థ పతాకాభూతులు.

మన పూర్వాలంకార గ్రంథములు శబ్దముయొక్క నిర్దుష్టత వాక్యరచనలోఽ నిర్దుష్టత ప్రధానముగా స్వీకరించి చెప్పినవి. భావమును విడఁబఱచి చూపించినవి. రసాదులను సూచించినవి. పాశ్చాత్య విమర్శ గ్రంథములు వేరు త్రోవ త్రొక్కినవి. పాత్రపోషణము, కావ్యరచనాకాలము, కవి జీవితము, కావ్యమునందలి కవిజీవన ప్రతిబింబము, కవి సమకాలిక విషయ పరిశీలన, కవియొక్క స్వంతమైన సుఖదుఃఖములు కావ్యమునందు నిరూపించుట, చరిత్ర - ఇత్యాది విషయములకు వారి విమర్శ ప్రాధాన్యమిచ్చినది. చదివినవారనగా ఇంగ్లీషు చదివినవారే అయిన యీనాఁడు ఆ ఇంగ్లీషు భాషాకావ్యములలో నున్న ఈ సూత్రములు కావ్య ప్రధాన లక్షణముగా పరిగణించుట తప్పనిసరియై పోయినది. అందుకనియే పలుమంది యాధునిక కవుల కావ్యములందు అసంస్కృత శబ్దస్వరూపములు అనిర్దిష్టార్థక శబ్దప్రయోగము, ఆంగ్లేయ భాషా మర్యాదానుకూల వాక్య విన్యాసములు, పరదేశ సంస్కార బహుళ భావములు, తద్దేశగత మహాకవుల మార్గముల ననుసరించుటలు, వానియందు రమించుటలు మిక్కిలిగా కనిపించుచున్నవి. తాత్పర్యమేమనగా ఆధునిక బహుళాంధ్ర కావ్య ప్రపంచమున దేశీయత తక్కువ విదేశీయత యెక్కువయైనది. ఇది యింతటితో నాగలేదు. ఈ సూత్రములతో పూర్వకావ్యములను విమర్శించుటయైనది. పట్టి పాత్రపోషణము అన్న విషయమును తీసికొని విచారించినచో పాశ్చాత్యుల యొక్క ఉత్తమ కావ్యముల యందు పాత్రపోషణమన్న విషయము మిక్కిలి ముఖ్యమైనది. ఏలననగా ఆ కావ్యమునం దొక కథ కలదు. అది కల్పిత కథ. దానియందు కథా పర్యవసానము పరమ ముఖ్యమైనది. ఆ కథ కట్టి పర్యవసానము ఆకథయందున్న భిన్న పాత్రముల యొక్క మనోవృత్తులచేత, స్వభావములచేత, సంప్రాప్తమైనది. అందుచే వారి పాత్ర పరిశీలనము కథా పర్యవసానదృష్ట్యా చేసినచో నధిక విషయములు గోచరించును. ఆ పర్యవసానము యొక్క తథాభూతస్థితికి ఆపాత్రల యొక్క స్వభావము హేతువగుచున్నది. తత్పరిశీలన ముచితమగుచున్నది. మన కావ్యములయందలి కథ లిట్టివి కావు. ఈ కథలలో విచారింపతగినది రసము, భావము, ఔచిత్యము. మన కావ్యములను విమర్శించునప్పుడు ఈ దృష్టితో విచారించవలయును. ఆ దృష్టితో విచారించినచో ఇవినీరసకావ్యములవలె కన్పించును. ఇదివరకే కనిపించినవి.

నేటి యాంధ్ర సారస్వతములో గద్యరచన నవలలుగా, చిన్నకథలుగా, వ్యాసములుగా, విమర్శనములుగా విజృంభించినది. ఇది పాశ్చాత్య సారస్వత సంయోగము చేత నొకటి, సాంఘిక రాజకీయాది పరిస్థితులు, పాశ్చాత్య దేశగత తత్పరిస్థితుల ననుసరించి మారుటచేత నొకటి, తప్పనిసరియైనది. ఒకానొక మార్పు సర్వదిశలనుండి వచ్చుచున్నది. ఒక చిన్న కావ్యము వ్రాయునపుడు పెట్టికొనిన నియమములు సువిస్పష్టముగా కనిపించును, కావ్యము చిన్నదిగనుక వెంటనే గోచరించును. ఆ కావ్యము మిక్కిలి తళతళలాడుచున్నట్లు కనిపించును. ఒక మహాకావ్యములోని నియమములు పలుచబడి అంత తేలికగా కనిపించవు. మంది యెక్కువైనకొలఁది మజ్జిగ పలుచన. ఇది తప్పదు. కాని మంచిగృహస్థు ఆ మజ్జిగలో ఇంత కరివేపాకు ఇంత ఉప్పు లేదా నిమ్మకాయరసము, ఉప్పు, లేదా శొంఠిపొడి, ఉప్పు, వేయును. జనులు ఆ చిక్కని మజ్జిగకంటె ఈ మజ్జిగనే ఎక్కువ ప్రియముగా నాస్వాదింతురు. పంక్తిమీద ఇట్టి మజ్జిగయే ఎక్కువరుచి. మన యింటిలో మనము భోజనము చేయుచున్నప్పుడు కొలదిమంది మిత్రులతో కలిసి భోజనము చేయుచున్నప్పుడు ఆ మజ్జిగకు రుచిలేదు. పెరుగునకే రుచి. రుచిగాని ఆ వస్తువుయొక్క చిక్కన పలుచనలు గాని వేళనుబట్టి. పూర్వమున తెలుగు వచనములో రెండు మూడు కావ్యములు కలవు. అందులోని వచనము బిగింపు కలది. కూర్పు కలది. ఒకశైలిని సంతరించవలయునన్న ప్రయత్నము కలది. చిన్నయసూరి నీతిచంద్రిక అటువంటిది. ఆంధ్రములో ఒకటి రెండు కావ్యములు తప్ప తక్కినవన్ని చంపువులు. అనగా గద్యపద్య మిశ్రితములు. ఆ కావ్యములలోని గద్యములను విచారించినచో పద్యములవలె నవియును ప్రౌఢములు, రచనాశిల్పరమణీయములును. మధ్యకాలములో కొందరు సేనానాయకులు వ్రాసిన వచన గ్రంథములు కలవు. వాని శైలియే వేరు. ఈ కొద్దిలోవనే వచన రచనయందు రెండు మూడు భేదములు కలవు.

ఈకాలమున నవల మొదలైన పలురూపములు తాల్చిన ఆంధ్ర గద్య రచన చిన్నయసూరి వచనరచనవలె, నన్నయ్య గారి వచనరచనవలె నుండవలెననుకొనుట పరిస్థితులెరిగిన యాలోచనగాదు. 'గద్యం కవీనాం నికషం వదంతి' ఇది పూర్వకాలపుమాట. 'కవీనాం' అని ఉన్నదికాని వచన రచన చేయు అందరికి అదిలేదు.

పద్యమువేఱు, గద్యమువేఱు. కావ్యములకు వ్రాసిన వ్యాఖ్యానము కూడ గద్యము. లోకోక్తులు, లోకమునందున్న పరిస్థితులు పద్యమునందు వ్రాసినచో దానిని స్వభావోక్తియను యలంకారమనిరి. ఈ స్వభావోక్తులు, లోకోక్తులు వచన రచనయందనంతముగా నుండును. ఇంతకు ఈవచనమునకు ప్రమాణముగా ఆంగ్లేయదేశపు గద్యరచనా పరిణామమును తీసుకొనవచ్చును. మెకాలే, ఫ్రూడ్, కార్డినల్ న్యూమన్, కార్లైలు, మొదలైనవారి వచనరచన వేరు. డీన్, ఇంగ్ మొదలైనవారి వచనరచన వేరు. ఆధునికాంగ్లేయ రచయితల వచనరచన వేరు. సోమర్‌సెట్ మాఘమ్ యొక్క వచనరచన వేరు. స్కాట్ నవలలలోని ఇంగ్లీషు గద్యమునకు, థామస్ హార్డీ గద్యరచనమునకు ఏమి సంబంధము ?

అట్లే తెలుగు గద్యరచన కూడ కాలమును బట్టి, వ్యక్తులను బట్టి, వస్తువును బట్టి, సాహిత్యశాఖను బట్టి, పలువిధములుగా మారును. కాని ఒక్కటి మాత్రము ప్రధానము. తెలుగు నుడికారమును వదలరాదు. దుష్టశబ్దములను ప్రయోగించరాదు. ఈ ఉల్లంఘనము ఈనాడు పెద్ద కవులన్నవారి గ్రంథములయందే కనిపించుచుండగా వచన రచయితల సంగతి చెప్పనేందులకు ?

ఈ కాలమున విమర్శనలు రెండు విధములు, మొదటిది తమ కిష్టమైన కవిని తీసుకొని వాని కవితలో ఉన్నవి లేనివి తాననుకొన్నవి అతని రచనచేత నిరూపింపబడనివి బహు గుణము లున్నట్లు చెప్పుట. ఇవి భావుకులైన వారు తమలో తాము నవ్వుకొనునట్లుండును. ఈ వాక్యమున కింతయర్థము, ఈ శబ్దమున కిది యర్థము, ఈ యర్థము పుట్టుటకు వాక్య విన్యాస మిట్లుండవలయును, మొదలైన విచారణ తక్కువై ఇంగ్లీషు గ్రంథముల విమర్శనల ననుసరించి ఏదో యేదో ఊరకే పెంచి వ్రాయుచున్నారు.

రెండవది ఒక కవియందు విరోధమున్నచో, ఈర్ష్య యున్నచో వానిలో తప్పులు వెదకుట ఏవో రెండు మూడు వెలిబెడ్డు దోషములుండవచ్చును. వానిని పురస్కరించుకొని పాఠకునకు నవ్వువచ్చెడి, వ్రాసినవానిని పాఠకుడు తిరస్కరించెడి, తప్పులుకాని వంద విషయములను తప్పులుగా చెప్పుట. ఇది జరుగుచున్నది. దీనికి మఱి యొకడు సమాధానము. మఱల నతని ప్రతి సమాధానము. చివరి దెబ్బ నాది అని యొకని సంతోషము. ఈ చివరిదెబ్బ నిర్ణయించెడి వాడు పత్రికాధిపతి. ఆ పత్రికాధిపతి ఇట్టి విమర్శనలను సదసద్విమర్శ దక్షతలేకనో, అతని మనస్సుకూడ ఏవైపునకో ఒక వైపునకు మొగ్గియుండుట చేతనో "గరమ్‌గరమ్ తాజామాల్" ఇత్తమన్న ఒక చమత్కారమైన చిలిపితనము చేతనో పత్రిక అమ్ముడుపోవునన్న ఒక యాశచేతనో వానిని ప్రకటించుట జరుగుచున్నది. అన్నింటికన్న విచారణీయమైన విషయమేమనగా పత్రికాధిపతు లొకనిని తగ్గించి మఱియొకనిని హెచ్చించు నుద్దేశ్యముతో వానికి వ్యతిరేకమైనవి ప్రకటించుచుండుటయు, వాని కనుకూలములైనవానిని బుట్టదాఖలు చేయుటయు జరుగుచున్నది. పత్రికాధిపతులకు విస్పష్టమైన భాషాజ్ఞాన ముండవలయును. కావ్యపరిశీలన ముండవలయును. భిన్నమార్గములయొక్క వివేచనాశక్తి యుండవలయును. మీ కున్నదా యనగా ఉన్నదో లేదో చెప్పలేము. కాని గ్రుడ్డెద్దు చేనబడినట్లు కాకుండ పోవుటకు సర్వథా ప్రయత్నింతుము. పైగా మాది మాసపత్రిక. ఇందు జాగ్రత్తతో పరిశీలించవలసిన యవసరమున్నది. అంత తప్పుదారిని పోవుటకు మా పత్రికకు తాకత్తు చాలదు.

ఇది యెవరియందును ద్వేషము లేకుండ మాకు చేతనైనంతవఱకు గుణ పరిశీలనము చేసి నేటి యాంధ్ర సాహిత్యమునకు మా చేతనైనంత వ్యవస్థ కల్పింపవలయునన్న మా ప్రయత్నము.

పైన వ్రాసిన కొన్ని విషయములు కొందరు మిత్రులకు కష్టము కలిగించునేమో యన్న భయముకూడ మాకు లేక పోలేదు. మాకు మనదేశము మనభాష మన సారస్వతము పరమప్రియములు. అందరు మాకు మిత్రులు, సోదరులు, మా యూహ సారస్వతమునందొక వ్యవస్థ కల్పించుటకు ప్రయత్నము చేయుదమనియే అని మనవిచేయుచున్నాము.

# నీవు | సంపత్కుమార్

సామి పూరిత జలకుంభ చలనరావ
రీతి శబ్దించు గుండెల లోతునుండి
ఎవరవేనీవు ? వచ్చుచుంటిని అపాంగ
వీక్షణాంతాల నందనాల్ విచ్చికొనగ.

ఈ రహోవేళ పాదమంజీర శింజి
తములు కకుబంతముల మ్రోయ రమణి! లేచి
వచ్చినావేరు ? తామిస్ర మచ్చుపడిన
గుండె సందుల సందులనుండి ఇటకు.

ఇది మదీయ జనూరహస్యదసమాధి
ఎదకు లోతులు చూపెడునది అనంత
విచిత్రమైన మదీయమ్మెదొ చిరనవత
విరుచుకొని వచ్చిపడునంచు తెరువుగనుదు.

కనుచు కనుచును కన్నులు కునుకవింత
ఇంతకునికిన అది వచ్చునేమొ ? నీవు
అట్టి సమయాన వచ్చితివయ్యొ గదవె
నీవె తత్క్షణ దేవతా భావమేమొ ?

నీవు నీవందుగాని-కాంతి స్రవంతి
వంటి నిను నీవు నింతైన పరిచయింప
వయితివో విద్యుదక్షి ! నా అంగమెల్ల
క్రమ్మబడినది నీ ప్రభావమ్ము వలన.

ఉదిత యౌవనరాగ పర్యుత్సుకమ్ము
కాలిక శ్రీవిభా పూరకమ్ము-దివ్య
భావ దేవీ పదాంక సంభావితమ్ము
నా మనోభావనమ్ము సంధత్త ఋతము.

నా కనుంగొనలందు నైందవ మనోజ్ఞ
రేఖికాప్రచారమ్ము నైలింపరీతి
కేతమెత్తును-త్వత్సదృక్ ప్రీతదృష్టి
మనసునిండుగ నన్ను చూచినదయేని.

ఎవరివోకాని నీవు-ఇరువదియైదు
గా పొలిచిన శారదిక సాంగత్యజనిత
ముదపలంబియైన చిరషిముగ్ధ మస్మ
దీయ హృత్పథమందు చిందింతు పహము.

విశ్వనాథ సత్యనారాయణ | అభిజ్ఞాన శాకుంతలము-౧

మహాకవుల శిల్పమును గూర్చి వేల యేండ్లు పండితులు భావుకులు విమర్శకులు చెప్పుచునే వచ్చుచుందురు. మరియు నెదో క్రొత్తవిషయము మఱెవ్వనికో స్ఫురించదను నియమములేదు. ఈ యర్థములన్నియు నా కవి యుద్దేశించలేదు. ఇతని స్వకపోల కల్పితములని చెప్పువా రున్నారు. వారికి మహాకవుల వాక్కులోని రహస్యము తెలియలేదనవలయును. వాక్కు వెలుపడును. అది యర్థసహితముగనే వెలువడును. దానిలోనున్న సర్వార్థములును వెలువడినవేళ దానిలో నిమిడియేయుండును. వాక్కుయొక్క రమణీయత దాని వెలువడుటలోననేయున్నది. ఆ వాక్కు నుచ్చరించినవాడు దాని యర్థము భావించెనాయన్న సందేహము వాగర్థముల యవినాభావసంబంధ మెఱుంగనివారికుండును. వాక్కు వెలువడుటకుఁ బూర్వము బహిరాగమనము జరుగవలసిన స్థితిని భావించవలయును. వాక్కెందుకు వెలువడును? ఊరకున్నచో సరిపోదా? వాగ్వ్యవహారములేకుండ లోకమునందుఁ బరస్పర భావ గ్రహణము జరుగుచున్నదని చెప్పుచున్నారుకదా. ఈ వాక్కు లేకుండ జరిగెడి వ్యవహారమునం దసంపూర్తియు వాక్సహిత వ్యవహారమునం దాధిక్యమును కలిమిచేతనేకదా వాక్కునకుఁ బ్రాధాన్యము వచ్చినది?

వాగర్థము లవినాభావసంబంధము కలవి. అర్థమనఁగా నేమి. ఆ వాక్కు నుచ్చరించినవాని తత్కాలజీవస్థితిలోఁదద్వాక్సంబంధిగా నెంతయర్థము పుట్టఁగలదో యంత యర్థము సంగ్రహింపఁబడియుండుట. ఈ సంగ్రహింపబడియుండుట క్రమశః విపృతమగును. వాగుచ్చారణ సమయమందు నది యుచ్చరింపబడుచున్నది. ఆయుచ్చరించినవాఁడు తదర్థగతైక దేశసమన్వయ పర్యాప్తబుద్ధియై యుచ్చరింపవచ్చును. అందుచేతఁ బరిశిష్టార్థము దానియందు లేదనుటకు వీలున్నదా. ఒక డొకమాట నుచ్చరించును. వాఁడొక యర్థము నుద్దేశించి చెప్పును. రెండవవాఁడు తనఁకు గోపహేతువైనవానిలోని యింకొక యర్థమును దీసి వాని నాక్షేపించును. వాఁడు నా యుద్దేశ మదికాదనును. ఇద్దఱును తర్కించుకొందురు. వాఁడు తనయుద్దేశ మదికాదనుట వాని యుద్దేశ్యముకాని రెండవ యర్థమును దీసికొని వీఁడు వివాదపడుట లోకమునందున్నది దీని తాత్పర్యమేమనఁగా వాక్కు బహ్వర్థకము. ఆ వాక్కెవని నోటినుండి వచ్చినదో వాఁడు దాని నుద్దేశించకుండఁగనే యొకటి వాగ్గత శక్తిచేత రెం డుచ్చరించినవాని జీవగతశక్తిచేత దానియందు బహ్వర్థ సంగ్రహణము జరిగియుండును. ఉద్దేశించుట యనఁగానేమి? వాక్కెచ్చటినుండి వచ్చుచున్నది? వాక్స్వరూపమేమి? బహిరాగమన వాంఛాసహితమైన జీవైక దేశవృత్తివాక్కు. ఉద్దేశించుటయనఁగా నేమి. వ్యవహారాపతితమై తత్కాల ప్రయోజన వాంఛ వ్యక్తీకరించుటయందలి భావము. వాక్కుయొక్క యర్థమునకు నీ రెండు భాగములు కలవు. అవ్యవహారదశయందు రెండవదానికిఁ బ్రాధాన్యము. వాగర్థము వాగర్థమని చెప్పుటకు రెండు భాగములు ప్రధానములే.

కావ్యమునందుఁ గావ్యగతవస్తు పురస్కృతమై ద్వితీయ భాగమునకుఁ బ్రాధాన్య వివక్ష కలిగినను గావ్యమున కాత్మ ధ్వని కనుక ధ్వని యనఁగా వాచ్యాతిశాయి యయిన సర్వార్థముకనుక వాక్కుయొక్క సర్వార్థము కావ్యమునందుండును దీనిని గవి యుద్దేశించినాఁడా లేదా యన్నప్రశ్న యుండదు. ఉద్దేశమనగాఁ దదర్థగతాంశ యుచ్చారణ సమకాల

మందు మనస్పృష్టమై యున్నదా లేదా యన్నది. మనస్పృష్టము కానంతమాత్రముచేతఁ దద్గత పరిశిష్టార్థము తదుచ్చారణ ప్రవర్తకమయిన జీవ సంకల్పమునందు లేదనుటకు వీలులేదు. తజ్జీవసంకల్పమంతయుఁ దద్వాగర్థము. ఆ సంకల్పముయొక్క మహాపరిణాహము ఋషులకుండును. తత్తుల్యులైన మహాకవులకుండును.

మన పురాణములయందు ఋషులశాపసందర్భములందు దీని యర్థము సువివృతమై యున్నది. దీనినే భవభూతి,

లౌకికానాం హి సాధూనా మర్థంవాగనువర్తతే
ఋషీణాం పునరాద్యానాం వాచ మర్థోనుధావతి.

అన్నాఁడు. ఈ శ్లోకమునందు వాక్కు-అర్థము నన్న రెండుమాట లున్నవి. ఈ రెండుమాటలునుగలిసి రెండుచోట్ల నున్నవి. రెండుచోట్ల నున్న వాక్కునకొకచే యర్థముకాదు. రెండుచోట్ల నున్న యర్థమన్న శబ్దమున కర్థ మొకటికాదు. ఆ మాటలు మొదటిది లౌకికులైన సాధువులకు సంబంధించినది. రెండవది ఆద్యులయిన ఋషులకు సంబంధించినది. లౌకికులయిన సాధువులు లౌకికమైన యర్థమునుద్దేశించి శబ్దమునుబ్రయోగింతురు. ఆ వాక్కు నా యర్థము నొక్కటి. ఆవాక్కునం దన్యార్థమునకుఁ బ్రాధాన్యము లేదు. ఆద్యులయిన ఋషులు వాక్కును బ్రయోగింతురు. ఆవాక్కుయొక్క యర్థము దాని సర్వార్థమునై యుండును. లౌకిక పారలౌకికములును త్రైకాలికమును నైన సర్వార్థము వారి వాక్కునం దుండును. లౌకికానాం హి సాధూనాం వాక్. ఋషీణాం పునరాద్యానాం వాక్. ఆ వాక్కులు వారివారివి. వాక్త్వ నియమము కలదు. విశేషణ లక్షణోపహితమై తద్వాక్త్వము నియమితమగుచున్నది. పురాణములయందలి ఋషుల శాపములు తీసికొన్నచో దీని యర్థము మఱియు సువిస్పష్టమగును. దీని విస్పష్టత శ్రీనాథకవి రచించిన హరవిలాసావతారికలోఁ జక్కగాఁ గలదు. దుర్వాసుఁడు తన యాశ్రమము ముందఱఁ దాను పెంపుడులేడికిఁ బచ్చి గడ్డిపఱకల నందించుచుండెను. మింటనేగు నొక గంధర్వుఁడు ముద్దువచ్చి చిటికవేసెను. దుర్వాసునకు కోపమువచ్చి యా గంధర్వుని మనుష్యజన్మ యెత్తుమని శపించెను. అతఁడువచ్చి ముని కాళ్ళ వ్రేళ్ళఁ బడెను. దుర్వాసునకు జాలికలిగెను. "ప్రొద్దుననేలేచి యెవనిమొగము జూచితివిరానాయనా ఇంతమాటఁ బడినావు నీభార్యను బిడ్డవలె నాయాశ్రమములో నుంచికొని చూచుచుందును. నీవుపోయి యా తిట్టు ఫలమును దీర్చుకొని ర"మ్మని పంపినాఁడు. దీనిలోని పరమార్థ మిది. అది యా గంధర్వుని నొసట వ్రాసియున్నది. వాని కర్మ యటువంటిది. ఇది శాపము కాదు. ఆ గంధర్వునియొక్క కర్మానుభవము జరుగవలసిన నిముసము వచ్చినది. దుర్వాసుని నోటివెంట వచ్చిన యా మాట యా యనుభవవేళయొక్క పరమ సన్నిహితత్వ ప్రదర్శకమైనది. తదనుభూతి ప్రారంభించుటకు సద్యస్కారణమైనది. ఒక్కొక్క మాటయొక్క యర్థ మిట్లుండును. ఇంత చెప్పుట యెందుకనగా మహాకవుల కావ్యములలో నిట్టి వాక్యము లుండును. వాక్కు లుండును. ఋషులవాక్కు సాధువులవాక్కు అనుటచేత వాక్కున కర్థము అచ్చట వేఱయినట్లు కవులయొక్క కావ్యములయందలి కొన్ని మాటలు సందర్భముచేతఁ జిత్రవిచిత్రములైన యర్థము లిచ్చుచుండును.

ఒక సంగతి, ఈ గ్రంథములో దరువాతఁ జెప్పఁబడును. ఈ సందర్భములో దాని సంగతి స్పృశించి చూపఁబడును. మన సంస్కృత నాటకకర్తలు శబ్దముయొక్క యీ మహార్థపరిణాహము తెలిసినవారు. తమనాటక రచనాశిల్పములో నీమహార్థమున కెక్కువ స్థానము నిచ్చినవారు. నాటకము - అనఁగా రూపకము కావ్యవిశేషము. కావ్యవిశేషమయిన యీ నాటకముయొక్కనాటకత్వము అనఁగా నది నాటకమగుటకొన్ని లక్షణములను బురస్కరించికొని పూర్వ సంస్కృత మహానాటక కర్తలు రూపకరచనావ్యగ్రులయిరి. వారి నాటక రచనాశిల్పముయొక్క మూలస్తంభము ఏతా

ద్భుతమైన యర్థము. ఈ యర్థమునే వివరించి లక్షణకర్తలుకూడ నాటకాంగములుగా చెప్పిరి. కాళిదాస భవభూతులు ఆనాటకాంగములు చాలవన్నట్లు తమ మహానాటకములను సర్వత్ర యీ మహార్థము చేత నిండియుండునట్లే చేసినారు.

భారతీయ సంస్కృతనాటక మనఁగా నిది. ఏ యర్థము భూతభవిష్యద్వర్తమానములందు భివ్యాప్తమై భిన్నపరిస్థితులయం దనుస్యూతమై కర్మసూత్రము చేతఁ బరస్పరసంబంధ లక్షణములు కలిగియుండునో యా యర్థముమీఁద నా మహాకవులు నాటకమును నిర్మించిరి. ఇది భారతీయ సంస్కృత నాటక మూల రహస్యము.

ఈ రహస్యమును వివరించుటలోఁ గాళిదాసు పోయిన మార్గమువేఱు, భవభూతిపోయిన మార్గము వేఱు. కాళిదాసింతకంటె మఱియుఁ బరమరహస్యములను దనకావ్యమునం దిమిడించినాఁడు. నాబుద్ధికిఁ దోచినంతవఱకు వానిని వివరించుటకే యీగ్రంథ రచన యారంభించుటయైనది. "క్వ సూర్యప్రభవో వంశః క్వచాల్పవిషయా మతిః" అన్నమాటలో బ్రభువైన కాళిదాసు పట్టి యాచారమును నిర్వర్తించెనేమో కాని నా యల్పమతివిషయమున నే నాచారమును నెఱపుటకాదు. పూర్తిగా నా యల్పమతివిషయము నాకుఁ దెలియును. మఱియు నింకొక్కవిషయము కలదు. నా వ్రాయుచున్న యీ వ్యాసములలోని పలువిషయములు పూర్వులయిన వ్యాఖ్యాతలు వ్రాసియుండవచ్చును. భావుకులు భావించియుండవచ్చును. చాపలాయ ప్రచోదితః. కాదేని కొన్ని క్రొత్తవిషయము లుండవచ్చును. ఉన్నను నవి ప్రభువైన కాళిదాసు వాక్కులోనున్న యర్థమే.

ఇంత మహార్థము గాలిలోనుండదు. వస్తువునాశ్రయించి యుండును. వస్తువు లోకమునందున్నది. వస్తువుదాత్తమైనచో దానియందు బహ్వర్థములు సహజముగా నిమిడియుండును. ఆ వస్తువునాశ్రయించి మహాకవి కొన్ని కల్పనలఁ జేసెనందుము. ఆ కల్పనలయొక్క రమ్యత వాని యౌచిత్యమునందుండును గదా! ఔచిత్యమనగా నుచితమైనవానియొక్క భావము. ఉచితమనఁగాఁ దగినది. దేనికి దగినది? ఆ కథకుఁ దగినది. అనఁగా సరిపోయినది. అనఁగా దానియందున్నదే-అప్పుడు క్రొత్తగాఁ జూచినదని యర్థము. దానిని జూచుటకా మహాకవియొక్క బుద్ధి కావలసివచ్చినది కనుక నొక మహావిషయములో నున్న సర్వార్థములు మహాబుద్ధికే స్ఫురించును. సర్వార్థము సర్వజనులకు స్ఫురించవలసిన యవసరములేదు. ఒకఁడు తనకా యర్థము పూర్వము స్ఫురించక మఱియొకఁడు దానిని జెప్పినప్పుడు వాఁడు దానిని గల్పించిచెప్పినాఁడనుటలో దాని యౌచిత్యము వాని కప్పుడు తెలిసినది. తనంతటఁ దనకు తెలియ లేదన్న మాత్సర్యమున్నది.

కవి యొకకథను దీసికొని కావ్యమును వ్రాయును. సామాన్య కవియొక్క కథావస్తువు ఆ కావ్యములో నున్న సామాన్య వస్తువే యగును. ఆ కథనే మహాకవి తీసికొన్నప్పుడు ఆ కథలో నెన్ని యర్థము లుండునో యన్ని యర్థము లతనికి గావ్యవస్తువులే. వాగర్థముల విషయములోఁ బూర్వము చెప్పిన విషయమంతయు నతఁడు నాటకము వ్రాయుచున్నచోఁగావ్యవస్తువగును.

కవియనఁగానేమి? ఈ మహార్థములను శిల్పదృష్టితోఁ జెప్పువాఁడు. శిల్పదృష్టి బహుముఖముగా నుండును. ఈ మహార్థములన్నియు దన కావ్యమునం దిమిడించుట యొక మహాశిల్పము. వానిని సముచితముగ నెచ్చట నేది చెప్పవలయును, ఎట్లు చెప్పవలయును, ఆద్యంతము లెట్లు, అభ్యాసమెట్లు—ఈ విచారణ యంతయు జేసి యా ప్రకారము చెప్పుట యొక శిల్పము. ఇందులో ననేకములైన చిన్నచిన్న విషయములుండును. అవి యా మహాప్రవాహములో లీనము కావలయును. వానినెట్లు చెప్పవలయును? ఇది యొక శిల్పము.

ఇవి యిట్లుండగాఁ దాను వ్రాయుచున్నది కావ్యము. కావ్యము కథాశ్రయము. కథాస్వరూపమెట్టిది? తన కథయొక్క స్వరూప మెట్టిది? తన కావ్యమునం

దేరసము ప్రధానము ? ఆ రసముయొక్క స్వరూప మెట్టిది? ఒక విచారణయా? అన్నిటినిఁ గలిపి కాళిదా సొక్క మాటలో వ్రాయును. ఒక్క పద్యములో నన్ని యర్థములు గుమికూడి యుండును. చెప్పికొనవలసి వచ్చినపు డొక్కొక్కదానినే యొకదాని తరువాత నొకటిగాఁ జెప్పికొనఁగలముగాని యన్నిటినిఁ గలిపి చెప్పలేము. అన్నిటినిఁ గలిపి చెప్పఁగలిగినది కవి వాక్యము. విడివిడిగా జెప్పునది విమర్శకుని వాక్యము కవివాక్కులోని యీ సర్వార్థము నొక్కసారి భావుకునకు స్ఫురించును. విమర్శకుని రచన పాఠకులకుఁ దెలియును.

ఒక విధముగా శాకుంతల నాటకము 'గ్రీవాభంగాభిరామం' అన్న శ్లోకముతో ప్రారంభించిన దందము. ఈ శ్లోకములోఁ గాళిదాసు తన యీ సర్వ కావ్య స్వరూపము చెప్పియుండవలయునుగదా.

అతని కావ్యము నిజమునకుఁ దత్పూర్వమే ప్రారంభింపఁబడినది. 'కృష్ణసారే దదచ్చక్షుః' అన్న శ్లోకముతోనే యారంభింపఁబడినది. మఱియు మాటాడినచో 'యా సృష్టి స్స్రష్టు రాద్యా' యన్న శ్లోకముతోనే యారంభింపఁబడినది. 'కృష్ణసారే దదచ్చక్షుః' లో నీసర్వ వాగర్థముల కతీతములైన పరమార్థ విషయమును గాళిదాసు తన కావ్యార్థమునకు శిఖరాయమాణముగా జెప్పదలఁచిన మహా విషయమును సూచింపఁదలఁచినాఁడు. ఆ మహావిషయమున కాలంబభూతుఁడైన యీశుని యష్టతనుని 'యా స్రష్టు స్సృష్టి రాద్యా'లో నిక్షేపించినాఁడు.

కొంత క్రిందికి దిగి కావ్యారంభము చూచినచో 'గ్రీవాభంగాభిరామమ్' అన్న శ్లోకము కావ్యారంభము. సారంగము గ్రీవాభంగాభిరామముగా స్యందనము నందు బద్ధదృష్టియై యనుసరించి పరువెత్తుచున్నది. శరపతనభీతిచేత నెక్కువగాఁ బూర్వకాయము పశ్చార్ధముచేతఁ బ్రవిష్టమైనది. శ్రమవివృతముఖ భ్రంశు లయినవి. యర్థావలీఢములు నయిన దర్భల చేత దారియంతయు వెదఁజల్లఁబడియున్నది. ఉదగ్ర ప్లుతములచేత నా లేడి యెక్కువగా వియత్తునందును దక్కువగా భూమియందుఁ బోవుచున్నది. ఇందులో సారంగము, గ్రీవ, స్యందనము, పశ్చార్ధము, కాయము, శరము, వియత్తు, ఉర్వి-యీశబ్దములు కలవు.

ఈ శబ్దములే యేల యుండవలయును? సంస్కృత భాషలో బర్యాయపదములు కొల్లలుకొల్లలుగానుండును గదా. సంస్కృతభాషా శబ్దములు వ్యుత్పత్తిసహితములైనవి. ఎక్కువ శబ్దములు ధాతుజన్యములు. కొన్ని భిన్నావయవములయొక్క యర్థపోషకములు. అందుచేతఁ బ్రతిశబ్దమునకు యౌగికార్థము రూఢ్యర్థము రెండు నుండును. సామాన్యముగాఁ గవి తన కావ్య రచనకు రూఢ్యర్థమునే స్వీకరించవలయునుగదా. (యోగార్థములో శబ్దములను బ్రయోగించినచో నేటి కొందఱు విమర్శకులు తిక్కన్నగారు వ్రాసినమాటనే ప్రాఁతవడ్డ మాటను అన్నదానిని దెచ్చి హింసించుట కలదు. ప్రాతపడ్డ మాటలని తిక్కన్నగారు. విరళాన్ పేచోషాదిక శబ్దాన్ అని నన్నయగారు. ఇది వేఱే విషయము.)

మహాకవులు సామాన్యపాఠకునకు స్థూలకథావస్తువునకు శబ్దమును రూఢ్యర్థములోఁ బ్రయోగించుచుఁ దాముద్దేశించిన మహార్థములను లోతుగా దిగిచూచెడి పాఠకులకు వాని యౌగికార్థములలో సంతరింతురు. కాళిదాసుయొక్క సర్వరచనయందు నీ ప్రయోగ రహస్య మున్నది. నా చూచినన్నిచోట్ల నాయన కావ్యములందుఁ గనిపించినది. శాకుంతలమునందు లేనితావు లేదు. అతని కావ్యము లన్నియుఁ దత్ర తత్ర యీదృష్టితోఁ జూచితినికాని సర్వంకషముగఁ జూడలేదు. శాకుంతలమునందుఁ బెక్కుచోట్లఁ జూచితిని. సర్వత్ర యీ వైచిత్రికనిపించుచునే యున్నది. సారంగశబ్దమునకు రెండు వ్యుత్పత్త్యర్థములు కలవు. సారమైన యంగములు కలది యని యొకటి. తన జాతివానితోఁగలసి విహరించునది యని మఱొకటి. తన కావ్యవస్తువు సారమయిన యంగములు కలది. సజాతీయ భావములతోఁ గలసి వ్యవహరించునది. అతని కావ్య వస్తు వేది? అతని వస్తువు

దృశమైన యర్థము. ఈ యర్థమునే వివరించి లక్షణకర్తలుకూడ నాటకాంగములుగా చెప్పిరి. కాళిదాస భవభూతులు ఆ నాటకాంగములు చాలవన్నట్లు తమ మహానాటకములను సర్వత్ర యీ మహార్థము చేత నిండియుండునట్లే చేసినారు.

భారతీయ సంస్కృతనాటక మనఁగా నిది. ఏ యర్థము భూతభవిష్యద్వర్తమానములందు నివ్యాప్తమై భిన్నపరిస్థితులయం దనుస్యూతమై కర్మసూత్రము చేతఁ బరస్పరసంబంధ లక్షణములు కలిగియుండునో యా యర్థముమీఁద నా మహాకవులు నాటకమును నిర్మించిరి. ఇది భారతీయ సంస్కృత నాటక మూల రహస్యము.

ఈ రహస్యమును వివరించుటలోఁ గాళిదాసు పోయిన మార్గము వేఱు, భవభూతిపోయిన మార్గము వేఱు. కాళిదాసింతకంటె మఱియుఁ బరమరహస్యములను దనకావ్యమునం దిమిడించినాఁడు. నాబుద్ధికిఁ దోచినంతవఱకు వానిని వివరించుటకే యీగ్రంథ రచన యారంభించుటయైనది. "క్వ సూర్యప్రభవో వంశః క్వచాల్పవిషయా మతిః" అన్నమాటలో ప్రభువైన కాళిదాసు వట్టి యాచారమును నిర్వర్తించెనేమో కాని నా యల్పమతివిషయమున నే నాచారమును నెఱపుటకాదు. పూర్తిగా నా యల్పమతివిషయము నాకుఁ దెలియును. మఱియు నింకొక్కవిషయము కలదు. నా వ్రాయుచున్న యీ వ్యాసములలోని పలువిషయములు పూర్వులయిన వ్యాఖ్యాతలు వ్రాసియుండవచ్చును. భావుకులు భావించియుండవచ్చును. చాపలాయ ప్రచోదితః. కాదేని కొన్ని క్రొత్తవిషయములుండవచ్చును. ఉన్నను నవి ప్రభువైన కాళిదాసు వాక్కులోనున్న యర్థమే.

ఇంత మహార్థము గాలిలోనుండదు. వస్తువునాశ్రయించి యుండును. వస్తువు లోకమునందున్నది. వస్తువుదాత్తమైనచో దానియందు బహ్వర్థములు సహజముగా నిమిడియుండును. ఆ వస్తువునాశ్రయించి మహాకవి కొన్ని కల్పనలఁ జేసెనందుము. ఆ కల్పనలయొక్క రమ్యత వాని యౌచిత్యమునందుండును గదా! ఔచిత్యమనగా నుచితమైనవానియొక్క భావము. ఉచితమనఁగాఁ దగినది. దేనికి దగినది? ఆ కథకుఁ దగినది. అనఁగా సరిపోయినది. అనఁగా దానియందున్నదే-అప్పుడు క్రొత్తగాఁ జూచినదని యర్థము. దానిని జూచుటకా మహాకవియొక్క బుద్ధి కావలసివచ్చినది కనుక నొక మహావిషయములోనున్న సర్వార్థములు మహాబుద్ధికే స్ఫురించును. సర్వార్థము సర్వజనులకు స్ఫురించవలసిన యవసరములేదు. ఒకఁడు తనకా యర్థము పూర్వము స్ఫురించక మఱియొకఁడు దానిని జెప్పినప్పుడు వాఁడు దానిని గల్పించిచెప్పినాఁడనుటలో దాని యౌచిత్యము వానికప్పుడు తెలిసినది, తనంతటఁ దనకు తెలియలేదన్న మాత్సర్యమున్నది.

కవి యొకకథను దీసికొని కావ్యమును వ్రాయును. సామాన్య కవియొక్క కథావస్తువు ఆ కావ్యములోనున్న సామాన్య వస్తువే యగును. ఆ కథనే మహాకవి తీసికొన్నప్పుడు ఆ కథలో నెన్ని యర్థములుండునో యన్ని యర్థము లతనికి గావ్యవస్తువులే. వాగర్థముల విషయములోఁ బూర్వము చెప్పిన విషయమంతయు నతఁడు నాటకము వ్రాయుచున్నచోఁ గావ్యవస్తువగును.

కవియనఁగానేమి? ఈ మహార్థములను శిల్పదృష్టితోఁ జెప్పువాఁడు. శిల్పదృష్టి బహుముఖముగానుండును. ఈ మహార్థములన్నియు దన కావ్యమునం దిమిడించుట యొక మహా శిల్పము. వానిని సముచితముగ నెచ్చట నేది చెప్పవలయును, ఎట్లు చెప్పవలయును, ఆద్యంతము లెట్లు, అభ్యాసమెట్లు— ఈ విచారణ యంతయు జేసి యా ప్రకారము చెప్పుట యొక శిల్పము. ఇందులో ననేకములైన చిన్నచిన్న విషయములుండును. అవి యా మహాప్రవాహములో లీనము కావలయును. వానినెట్లు చెప్పవలయును? ఇది యొక శిల్పము.

ఇవి యిట్లుండగాఁ దాను వ్రాయుచున్నది కావ్యము. కావ్యము కథాశ్రయము. కథాస్వరూపమెట్టిది? తన కథయొక్క స్వరూప మెట్టిది? తన కావ్యమునం

దేరసము ప్రధానము? ఆ రసముయొక్క స్వరూపమెట్టిది? ఒక విచారణయా? అన్నిటిని గలిపి కాళిదాసొక్కమాటలో వ్రాయును. ఒక్క పద్యములో నన్నియర్థములు గుమికూడి యుండును. చెప్పికొనవలసి వచ్చినపు డొక్కొక్కదానినే యొకదాని తరువాత నొకటిగాఁ జెప్పికొనఁగలముగావి యన్నిటినిఁ గలిపి చెప్పలేము. అన్నిటినిఁ గలిపి చెప్పఁగలిగినది కవి వాక్యము. విడివిడిగా జెప్పునది విమర్శకుని వాక్యము కవివాక్కులోని యీ సర్వార్థము నొక్కసారి భావుకునకు స్ఫురించును. విమర్శకుని రచన పాఠకులకుఁ దెలియును.

ఒక విధముగా శాకుంతల నాటకము 'గ్రీవాభంగాభిరామం' అన్న శ్లోకముతో ప్రారంభించిన దందము. ఈ శ్లోకములోఁ గాళిదాసు తన యీ సర్వకావ్య స్వరూపము చెప్పియుండవలయునుగదా.

అతని కావ్యము నిజమునకుఁ దత్పూర్వమే ప్రారంభింపఁబడినది. 'కృష్ణసారే దధచ్చక్షుః' అన్న శ్లోకముతోనే యారంభింపఁబడినది. మఱియు మాటాడినచో 'యా సృష్టి స్స్రష్టు రాద్యా' యన్న శ్లోకముతోనే యారంభింపఁబడినది. 'కృష్ణసారే దధచ్చక్షుః' లో నీసర్వ వాగర్థముల కతీతములైన పరమార్థ విషయమును గాళిదాసు తన కావ్యార్థమునకు శిఖరాయమాణముగా జెప్పదలఁచిన మహా విషయమును సూచింపఁదలఁచినాఁడు. ఆ మహావిషయమున కాలంబభూతుఁడైన యీశుని యష్టతనుని 'యా స్రష్టుస్సృష్టి రాద్యా'లో నిక్షేపించినాఁడు.

కొంత క్రిందికి దిగి కావ్యారంభము చూచినచో 'గ్రీవాభంగాభిరామమ్' అన్న శ్లోకము కావ్యారంభము. సారంగము గ్రీవాభంగాభిరామముగా స్యందనమునందు బద్ధదృష్టియై యనుసరించి పరువెత్తుచున్నది. శరపతనభీతిచేత నెక్కువగాఁ బూర్వకాయము పశ్చార్థముచేతఁ బ్రవిష్టమైనది. శ్రమవివృతముఖభ్రంశు లయినవి, యర్థావలీఢములు నయిన దర్భలచేత దారియంతయు వెదఁజల్లఁబడియున్నది. ఉదగ్రప్లుతములచేత నా లేడి యెక్కువగా వియత్తునందును దక్కువగా భూమియందుఁ బోవుచున్నది. ఇందులో సారంగము, గ్రీవ, స్యందనము, పశ్చార్థము, కాయము, శరము, వియత్తు, ఉర్వి-యీశబ్దములు కలవు.

ఈ శబ్దములే యేల యుండవలయును? సంస్కృతభాషలో బర్యాయపదములు కొల్లలుకొల్లలుగానుండును గదా. సంస్కృతభాషా శబ్దములు వ్యుత్పత్తిసహితములైనవి. ఎక్కువ శబ్దములు ధాతుజన్యములు. కొన్ని భిన్నావయవములయొక్క యర్థపోషకములు. అందుచేతఁ బ్రతిశబ్దమునకు యౌగికార్థము రూఢ్యర్థము రెండు నుండును. సామాన్యముగాఁ గవి తన కావ్య రచనకు రూఢ్యర్థమునే స్వీకరించవలయునుగదా. (యోగార్థములో శబ్దములను బ్రయోగించినచో నేటి కొందఱు విమర్శకులు తిక్కన్నగారు వ్రాసినమాటనే ప్రాఁతవడ్డ మాటను అన్నదానివి దెచ్చి హింసించుట కలదు. ప్రాతవడ్డ మాటలని తిక్కన్నగారు. విరళాన్ పేచోషాదిక శబ్దాన్ అని నన్నయగారు. ఇది వేఱే విషయము.)

మహాకవులు సామాన్యపాఠకునకు స్థూలకథావస్తువునకు శబ్దమును రూఢ్యర్థములోఁ బ్రయోగించుచుఁ దాముద్దేశించిన మహార్థములను లోతుగా దిగిచూచెడి పాఠకులకు వాని యౌగికార్థములలో సంతరింతురు. కాళిదాసుయొక్క సర్వరచనయందు నీ ప్రయోగ రహస్య మున్నది. నా చూచినన్నిచోట్ల నాయన కావ్యములందుఁ గనిపించినది. శాకుంతలమునందు లేనితావు లేదు. అతని కావ్యము లన్నియుఁ దత్రతత్ర యీదృష్టితోఁ జూచితినికాని సర్వంకషముగఁ జూడలేదు. శాకుంతలమునందుఁ బెక్కుచోట్లఁ జూచితిని. సర్వత్ర యీ వైచిత్రికనిపించుచునేయున్నది. సారంగశబ్దమునకు రెండు వ్యుత్పత్త్యర్థములు కలవు. సారమైన యంగములు కలది యని యొకటి. తన జాతివానితోఁగలసి విహరించునది యని మఱొకటి. తన కావ్యవస్తువు సారమయిన యంగములు కలది. సజాతీయ భావములతోఁ గలసి వ్యవహరించునది. అతని కావ్య వస్తు వేది? అతని వస్తువు

బహుముఖములుగా గలదు. ఒకటి శివస్వరూపమును జెప్పుట. రెండు అంతఃకరణ లక్షణమును జెప్పుట. మూఁడు సత్పురుషుఁ డెట్టివాఁడో నిర్ణయించుట. నాల్గవది శృంగారరసముయొక్క కట్టుదిట్టములు నిరూపించుట. ఐదవది శకుంతలాకథ. ఆఱవది నాటక స్వరూపము. ప్రధానముగా నివి కనిపించుచున్నవి. సారంగమన్న శబ్దము-వీని యన్నింటికిబదులుపయోగింపఁబడినది. గ్రీవా—అన్నాదికములు దీని చేత మ్రింగఁబడును. అని వ్యుత్పత్తి. వ్యుత్పత్త్యర్థ వశమున లక్షణ ప్రాపించినచో స్ఫురణశక్తి యర్థము వచ్చును. స్యందనము— రథము, స్రవించునది. కథ స్రవించును. రసముస్రవించును. జీవితముస్రవించును. ఏదికాదు? శరము - హింసించునదికనుక శరము. ఒక యోషధియందు బాణమునందు నీశబ్దమువర్తించుచున్నది. వ్యుత్పత్తి రెండుచోట్ల నొక్కటియే. ఇచ్చట 'నీ కావ్యమును విమర్శించువారు' అను నర్థమును జెప్పవచ్చును. ఎందుకుఁ జెప్పవలయుననఁగానీకావ్యమిట్లెందు కారంభింపవలయును? ఏ రీతిగానోయొక రీతిగా నారంభింపవలయును గదా. ఇది రమ్యముగానేయున్నది యన్న సమాధానము చాలదు. శిల్పము యొక్క ప్రధానలక్షణము ప్రయోజనసహితత్వము అధికార్థ సంగ్రహణము, పాఠకుని గాఢభావనాశీలుని జేయునది. కాయమ్-అవయవములచేతఁ గూర్చఁబడునది యని వ్యుత్పత్తి. కావ్య మిటువంటిది. దానికి మొదలున్నది, చివఱయున్నది, నడుమున్నది అన్నియవయవములు కలవు. బాణముపడునన్న భీతిచేత లేడి తన పూర్వకాయమునందు వెనుకటి శరీరమును జొప్పించుకొన్నది. తన కావ్యము శీర్ణమైపోవునని తన శత్రువులు కావ్యమునందు సంయోజన గుణము తక్కువయందురని తరువాతికథ యంతయుఁ గాళిదాసు నాటకముయొక్క పూర్వభాగమునందుఁ దానుఁ జొప్పించినాఁడు. ఈ లేడి తన కావ్యవస్తువు. తన కావ్యవస్తువన్నివిధములు. ఈమాటచేతనాటకాంగములయిన సూచనాదు లన్నియు దీనియం దంతర్భూతములై యున్నవి. ఈ లేడి వియత్తునం దెక్కువయుర్వియందు దక్కువకదా వియత్తునకు 'ఎడతెగక యుండునదియని' వ్యుత్పత్తి. ఉర్వికి బర్వతములచేతఁ గప్పఁబడినది యని వ్యుత్పత్తి. తనకథ యధికమైనది యాకాశమునందున్నది- యంతటను వ్యాపించియున్నది ఇది పట్టి శృంగారరసముకాదు. శృంగార రసమయినను ననంతమైనదే. అదికాక పరమేశ్వరుడు జీవుఁడు. సర్వజీవకోటియందు మేల్కొనియున్న యంతఃకరణము. ఇది యతని కావ్యవస్తువు. ఇవికాక తన కావ్యకథ మొదటఁ జివఱఁగూడ నరణ్యములలోఁ గొండలలో జరిగినది. లేదా దుర్గమార్గములు కలది.

మఱియు నీ సారంగము మెడవంచి స్యందనమును జూచుచున్నది. చూచికొంచునే పరువెత్తుచున్నది. ఈ కథ ఉంగరము కనిపించకపోవుటచేత వెనుకకుఁ దిరిగినది. కాని కథనుజూచుట వదలిపెట్టలేదు. రకరకములుగాఁ జూచుచున్నది. "బలవత్తుదూయమానం ప్రత్యాయ యతీవ మేహృదయమ్" "మయ్యేవ విస్మరణ దారుణ చిత్తవృత్తౌ". ఇట్టి యర్థములచేత వెనుకకుఁ జూచుచున్నది కథావస్తువైనచో నిది. జీవలక్షణమయినచో 'సతాంహి సందేహపదేషు వస్తుషు' 'కదాపి సత్పురుషా శ్శోకపాత్రాత్మానో నభవంతి' 'నను ప్రవాతేపి నిష్కంపాగిరయః' 'యదాగజో నేతి సమక్షరూపే'—ఇత్యాది వాక్యములచేత నాయంతఃకరణప్రవృత్తియొక్క జీవగతలక్షణము సత్పురుషుని యందున్న యంతఃకరణము జీవస్యందనమార్గమును వెనుకకుఁ దిరిగిచూచికొనుట మొదలైనవి చెప్పబడుచున్నవి.

అన్ని రసములలో శృంగారరస నిర్వహణము క్లిష్టాతిక్లిష్టమయినది .శృంగార రసమునం దుదాత్తత నిలుపఁబెట్టుట కాళిదాస భవభూతులకే తగునేమో. నిముసములో కచకుచాది వర్ణనములక్రిందికి దిగును. ఈ శాకుంతల నాటకమును బ్రదర్శించుచుఁ గాళిదాసుని యౌచిత్య మెఱుఁగక బజారు శృంగారము చేయఁబడుటయు నేనెఱుఁగుదును. ఇట్టి శృంగారరస ప్రాధాన్యముగల తన కావ్యమును నాయికా నాయక

ప్రథమసమావేశ భూతమైన ప్రథమాంకమును గాళిదాసు ఇన్ని బహ్వర్థముల నుద్దేశించి రాజు లేడిని దఱుముటతోఁ బ్రారంభించెను. ఆలేడి కృష్ణసారము కృష్ణునియొక్క సారము. భగవంతుడైన కృష్ణుని చేతఁ జెప్పఁబడిన గీతోపనిషత్తు యొక్కసారమా? రాజెట్లున్నాఁడు? సూతునకతఁడు మృగానుసారియైన పినాకివలెఁ గనిపించుచున్నాఁడు. మృగమనఁగా వెదుకఁబడుచున్నది. ఏది వెదుకబడుచున్నది? తత్త్వము అంతఃకరణాంతర్గత సూక్ష్మభావభూతజీవ స్వరూపము. తత్ప్రేరేపకుఁడయిన శివుఁడు.

కాళిదాసుని యభిజ్ఞానశాకుంతలము ఇది సర్వ వేద వేదాంతసారము. శివాద్వైత ప్రతిపాదక గ్రంథము.

వీని నన్నింటిని నా యోపికకొలఁదిని దక్కిన భాగములయందు వివరించుటకుఁ బ్రయత్నింతును.



అల మీఁక కేశవ వాయుసూను రఘూద్వహాదిక సేవయా
అల మింద్రియప్రత తేర్జయాధికయత్న జీవన బాధయా
అల మస్తి మే సుకుమార కోమల కామినీ సితగండభాక్
హసితాభ కావ్యవసంత పుష్పవనీ నిరంతరచంద్రికా.

— విశ్వనాథ సత్యనారాయణ.

# తెలుగు కవితలో క్రొత్తతెన్నులు - రాయప్రోలు నుండి దేవులపల్లి వరకు

రమణారెడ్డి

తెలుగు కవిత రాయప్రోలుకు మునుపు ప్రకృతి చిత్రాలకు గొడ్డుపోలేదు. సూక్ష్మ చిత్రాలు కొన్ని. విపుల చిత్రాలు కొన్ని. గాఢ వర్ణాంకితాలు కొన్ని. లలిత వర్ణాంకితాలు కొన్ని కోకొల్లలుగా వున్నవి. కాని పూర్వకవుల దృష్టిలో ప్రకృతికి స్వతంత్ర ప్రతిపత్తి ఎక్కువగాలేదు. లోక నాటక రంగాన నిలిచి నటించే మానవ చర్యలకు ప్రకృతి పూర్వరంగముగా వుపకరించినది. అది ఔపచారికము మాత్రమే. ప్రకృతికి స్వయం సంపూర్ణతను, స్వాతంత్ర్య ప్రతిపత్తిని యిచ్చిన ఆధునికాంధ్ర కవులలో రాయప్రోలు సుబ్బారావుగారు, చారిత్రక దృష్టితోగాని, వైశిష్ట్య దృష్టితోగాని చూస్తే ప్రథములుగా కనిపిస్తారు. కాల్పనికోద్యమ స్రష్టలు ఆంగ్లాంధ్ర సాహిత్యాలలోనూ కొన్ని దృక్పథాలను వుభయ సామాన్యంగా చేబూనినారు. ఇది యాదృచ్ఛిక ఘటన అయివుండదు.

నియో-క్లాసిసిస్ట్ ధోరణికి ప్రతిగా అక్కడ, క్షీణ ప్రబంధిక ధోరణికి ప్రతిగా యిక్కడ, ఒక నూతన కావ్యధోరణితోబాటు ఒకానొక నూతన తత్త్వము కూడ తల ఎత్తింది. శైలిలో, పదాల కూర్పులో, వృత్తాల ఎన్నికలో మాత్రమేకాక, యీమార్పు కొన్ని కొన్ని విశ్వాసాలలో, అభిప్రాయాలలో, ఆదర్శాలలో కూడ కనిపిస్తుంది. ఇది పూర్తిమార్పు లేదా విప్లవము కాకపోవచ్చును. పరిమిత వ్యాప్తి కలిగియుండ వచ్చును. కాని దీనివలన శుభ పరిణామాలు స్వచ్ఛ హిమానీజలాలవలె ప్రవహించినవి. భావనను నిర్బంధించగల తార్కిక, తాత్త్విక శృంఖలలను విదల్చి, హృదయోద్రేకాలను కదిపి కవ్వించగల కవిత్వ లావణ్యాన్ని వరించి, మానవ ప్రకృతిలో క్షుద్రలక్షణ చిత్రణము త్యజించి, పరమాద్భుతమైన విశ్వ ప్రకృతిని ఆరాధించే వైఖరి యీ రొమేంటిసిస్ట్ (కాల్పనిక) వుద్యమానికి జీవగర్ర. చూడ చక్కని దృశ్యాల దొంతరయని ప్రకృతిని యీ వుద్యమ కవులు వుపాసించలేదు. బ్రతుకును వుద్దీపింపజేసే బీజాక్షరమేదో దానిచేత వున్నదని ప్రకృతిని సమీపించారు. సాంప్రదాయక మతాచారాల పట్టు సడలజొచ్చిన రోజులలో తమతమ అనుభూతులతో యీ కవులు నూతన విశ్వాసానికి ప్రాణ ప్రతిష్ఠ చేశారు. చూపులో క్రొత్తందనాలు, ఎదలో నూత్నానుభవాలు, చుట్టూ చోద్యాలు కనుగొని, ఆశ్చర్యభావంతోటి లోకాన్ని కనుగొన్నారు. ఈ అన్వేషణలోబడి, క్రింద దూరాన చీకటిలో, తెలియమిలో మ్రగ్గుతున్న వారికి యెడమై యెత్తై పోయారు. నిజానికి యిది ఒక సంఘటితోద్యమంకాదు. ఎవరికి వారుగా విడివిడిగా స్వానుభూతులకే కావ్యత్వ మిచ్చిన వ్యక్తులకు కొన్ని ధోరణులు సాధారణాలయినవి మట్టుకే. మనస్సుకంటె హృదయం ఆలోచనకంటె ఆవేశం, సంయమనంకంటె విశృంఖలత్వం, మితభాషిత్వంకంటె వాచా చాపల్యం, యీ సాధారణ లక్షణాలలో కొన్ని. తాము కల్పించిన వుద్రేకాల ప్రవాహాలలో తామే వివశులై కొట్టుకొనిపోతూ బాధలో సుఖం పొందే దౌర్బల్యం వీరి ముఖ్య బలం.

వర్డ్సువర్తులోనూ రాయప్రోలులోనూ కాల్పనిక ధోరణి వికటం కాలేదు. పరిసరాలకూ వీరికీ వైరుధ్యం లేదు. సర్వసాధారణాలైన అనుభూతులను స్వీకరించి, కావ్యాలుగా ఆదర్శీకరించారు. కాబట్టి దైనిక జీవితములోని మాలిన్యాన్ని కావ్యవాహినులలో ప్రక్షాళించి నిర్మల మొనర్చినారు. సమాజానికి

కవికి వీరు పరస్పర బాహ్యతను నిరూపించలేదు. నిత్యము మనం చూచే వాస్తవంనుండి తీవ్రాను భూతితో తత్వాన్ని, మనశ్చక్షువు మాత్రమే దర్శింప గలిగిన మర్మాన్ని ఆవిష్కరించారు. వీటికి వాహ కాలుగా వాడిన పదాలలోకూడ నవ్యత్వం కనిపి స్తుంది. ప్రకృతి వుభయులకూ దేవతామతల్లి; ఒజ్జ. ప్రకృతి కామరహితమైన ప్రేమతో నిండి వున్నదని రాయప్రోలు విశ్వసించారు. సమస్త పరాపర కార్య ములకు పృథివియే తల్లి, ధాత్రి, దేవతామతల్లి, నిర్గుణ పరబ్రహ్మను సంభావించలేక, పంచభూతాత్మకమైన ప్రకృతిలో పరతత్వాన్ని దర్శించినారు.

"కానబడ కనుమాన ప్రమాణమునకె
అంది యందని పరతత్త్వ మవలనుంచి
పంచభూత దృశ్యంబైన ప్రకృతి యొకటె
సన్నిహిత లక్ష్యమనియె వచస్వి నేడు."

ఆయన ప్రకృతిని ప్రదర్శించిన తరహాలు బహు ముఖాలు. ఒకప్పుడు బాలెంతగా కనిపిస్తుంది (ఆంధ్రా వళి, శ్రీముఖ: "ప్రసవించిన యెలతీవెల....") ఒకప్పుడు చూలాలుగా, పుష్పిణిగా, పయోధర శ్యామలగా- సమస్త ఋతుచక్రము స్త్రీరూపిణిగా పరిభ్రమిస్తుంది (ఆంధ్రావళి: ధాత) సమీరములు చెలిపెదవి తాకి తాకనట్లు పెట్టిన ముద్దులుగా, చిగు ళ్ళెత్తిన కొమ్మలు "శీతపీడకు నునుపు మాయగ సిగ్గు చితికి" నట్లుగా కనిపించినప్పుడు ప్రకృతి ఇంద్రియాలను ప్రకోపింపజేస్తుంది. ఈనిన ఆల మందలు, శద్దసంతానము, పుల్గబాలెంత, వెన్నెల జున్నుబాలు చేపిన రేలు, ప్రాణాంబర ప్రథమోచ్ఛ్వాస ములూ — జంగమస్థావర భేదము లేకుండా, మింటి మంటి హద్దులు లేకుండా, ఒక సహృదయశక్తి స్వరూపిణి అణువణువున ప్రాణాన్ని, ప్రణయాన్ని ప్రభాసింపజేస్తున్నది. ఈ Mystic Pantheism రాయ ప్రోలులోనూ, వర్డ్సువర్తులోనూ ఒక మహావేశ మయింది.

చరాచర జీవకోటిచేత ప్రకృతి చనుబాలు కుడి పించిన కవికి స్త్రీలపట్ల ఆర్ద్రకోమల దృక్పథం అల వడుటలో ఆశ్చర్యం లేదు. నవ్యులకు సౌందర్యమే ఉపాధి అయింది. వారు "ప్రేమమంత్ర మహో పాసనామయులు." కాని వారి లక్ష్యము "ఆత్మా నందసిద్ధి". పూర్వకవులవలె సంభోగశృంగారము కాక, సంభోగరహితమైన విప్రలంభ శృంగారము వీరికి వుపాదేయమైనది. "సౌందర్యార్చనమేగాని వీరి సిద్ధాంతమున సౌందర్యానుభవము లేదు. అను భావాభావమే దాని నమలినము చేసినది. వీరిదృష్టిలో స్వీయ తప్ప యితర నాయికలు లేరు. ఏలన సంభోగ రహితమైన శృంగారములో ధర్మరూపమైన కామ పురుషార్థమునే వీరు తప్పక యితరులు గ్రహించి నందున నోర్చగలరు." (కురుగంటి సీతారామయ్య: రమ్యాలోక సమీక్ష. 1939 ఆంధ్రపత్రిక సంవత్స రాది సంచిక)

"మూఢు లిచ్చయించెదరు సంభోగసుఖము
నే వియోగ మాధుర్య లీలావిపాక
మనుభవింప నట్టాడెద ననడె, యాంధ్ర
రసిక కులరాజు పండితరాజు మున్ను?"

స్వీయనాయికగాగల విప్రలంభశృంగారంకంటెకూడ అమలినమైనది వాత్సల్యమని, అది అమృతతుల్య మని, నిర్మోహమని భావించినాడు.

"కులకుభాంగీపయోధీర కుసుమమందు
మోహమధువె గవేషించె మున్ను సుకవి;
సాత్త్వికప్రేమ కోశపేశలములయిన
వత్సలామృత రుచులను వలచెనేడు."

విప్రలంభ శృంగారములోకూడ శీలమును చెదర నీయడు. అశ్లీలమును అనాదరిస్తాడు.

"బాల పుష్పమునంటిన పాపమనుచు,
ముగుదవలె రేకు జెలుగుల మూసికొనిన
మధుర తారుణ్య మర్చనా మాత్రమనుచు
అడుగు సోకిన కడనెల్ల నణువులణువు
లగుచు ప్రాణకళలు రాల నంద మెంచి
కొలుచుచుందురు భావకోమలులు నన్ను."

నిత్యకౌమార తరుణాభి జాత్యనగుచు
నింత స్పర్శాకలంకము నెఱుగ నేను."

(జడకుచ్చులు : కవిత)

"స్పర్శాకలంకము"లేనిప్రేమ ఆదర్శీకృత భావమాత్ర మైనందున, రక్తమాంస శరీరులైన సామాన్యులకు సాధింప నలవిగాకపోయినది. వియోగ సంభోగ ములను సమానముగ నెంచు మతి స్థిమితము ద్వంద్వాతీతులకేగాని ద్వంద్వ మగ్నులకుకాదు. విరహ వేదనలోనే సౌఖ్యమున్నదను వాదముకూడ సార్వ జనీనముకాదు.

రాయప్రోలు కవి వ్యక్తిలో సమాజము చొరబారినది. మతవిహితాచారములపై, సామాజికసంస్థలపై ఆయన కత్తిదూయలేదు. ఆయన నిర్వర్ణించిన శృంగారము వివాహ బాహ్యము కాలేదు. ఏ కొద్ది కావ్య ఖండికలలోనో, రాధను గోపికను చాటుజేసికొని ఆయన వైవాహికేతర ప్రణయము ధ్వనించినా, యిది తత్త్వార్థములో సాంప్రదాయికముగ మాధురీభక్తిగ రూఢిబొందినది. కాని కాలక్రమాన యీ "అమలిన" విప్రలంభ శృంగారములోకూడ సామాన్య యింద్రియ వాసనలు వ్యాపించసాగినవి. కవి వ్యక్తి సమాజము నుండి విడివడి, స్వతంత్ర ప్రతిపత్తిని కోరేస్థితికి వచ్చింది. "మనము" లో వున్న "నేను" కాకుండా, "మనము"లోనుండి తప్పుకొన్న "నేను"అనే భావము కవి వ్యక్తిని ఆవేశించింది. సౌందర్యార్చనములో అనుభవము పాలెక్కువైనది. "స్పర్శాకలంకము" ప్రణయముపై దాడిచేసినది. వాత్సల్యము పరమోన్నత పదవీభ్రష్టమై, వుభయ నిష్ఠముకాని శృంగారము ఆస్థానము నాక్రమించినది. వియోగములో సంభోగ వాంఛ ప్రస్ఫుటమైనది; విరహవేదనలో సుఖము కంటె దుఃఖము పాలెక్కువైనది. కవి వ్యక్తికీ సమాజవ్యక్తికీ అగాధము సువ్యాప్తమైనది. కాల్పనికోద్యమ కవులలో తొలితరానికీ, రెండవ తరానికీ ఆంగ్లాంధ్ర సాహిత్యాలలో వుభయసామాన్యధోరణులు కొన్ని లేకపోలేదు.

"The second generation breathes a spirit of moral revolt···It is innovatory, critical and readily places itself outside the pale of common obligations."

(A History of English Literature: Legouis and Cazamian)

ఈ మార్పు శ్రీదేవులపల్లి కృష్ణశాస్త్రిగారి కవితలో మొదలై తీవ్రాతితీవ్రమై, గుడిపాటి వెంకటచలం రచనలలో సంఘంమీద బహిరంగ యుద్ధప్రకటనగా వృద్ధిచెందేంతవరకు విశ్రమించలేదు. కవులుగా, సౌందర్యార్చకులుగా నేర్పుగల రచయితలుగా వీరిని ఎవ్వరూ తప్పుబట్టలేరు. కాని వారి అభిప్రాయాలు, వాటి ధోరణులు, సంఘంమీద అవి పరపే ప్రభావాలు-వీటినిగురించి ప్రతియొక్కరూ తర్కించుకొనే హక్కు కలిగియున్నారు. దేవులపల్లివారు తెలుగు కవితలోని గూఢమైన అందాలనన్నిటిని దోచుకొన్నారు. వారి 'కృష్ణపక్షము', 'ప్రవాసము', 'ఊర్వశి' సౌందర్యాల సంత. వర్ణనావైచిత్రి, గాఢవర్ణదీప్తి, అంతర్లీన మహావిషాదవాహిని వారి కవిత్వానికి ప్రముఖ గుణాలైనవి. వారి పరవడి రెండు తరాలవారికి కవిత్వ రచనోత్సాహాన్ని కల్పించింది. రాయప్రోలు తర్వాత, ఒక నూత్న కావ్యధోరణికి వారు ఆదికవులయ్యారు. ఇది చరిత్ర.

చరిత్ర ఒక ఎత్తు; విమర్శ వేరొక ఎత్తు. దేవులపల్లి వారు ఎంతటి మహాకవులైనా, విమర్శకు అతీతులు కారు. ఆయన కావ్యగత సౌందర్యాలను మనసా అనుభవించి, ఆయనతోబాటు ఏడ్చిన యువకులలో నేనూ ఒకణ్ణి.కాని ఆ మెప్పులోకూడ ఆతాదాత్మ్యంలో కూడ ఆయన అభిప్రాయాల ప్రభావాన్ని కంటగించుకొన్నాను. వారి కృతులలోని సందేశం లోకకల్యాణకారి కాదని అప్పటికీ యిప్పటికీ నా నమ్మిక. ఆత్మాశ్రయ కవిత్వం సాహిత్యంలో వ్యక్తి వాదాన్ని ప్రతిష్ఠించింది. అవయవాలలో ఏది కుళ్ళినా శరీరానికే ముప్పు. కనుక అవయవానికి గొప్ప విలువ కద్దు. "ఒక్కొక్క ముహూర్తంలో ఈ అణువువంటి

మానవునికి వచ్చే అనుభవం శరీరానికి అంతా అమూల్యమైనదే. అలాంటి అనుభవాన్ని ప్రకటించే కావ్యం ఆత్మపరమైనదైనా, అప్పటికి స్పష్టంగా అందకపోయినా, అందరికీ విలువైనదే." (పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వము: దేవులపల్లి కృష్ణశాస్త్రి: భారతి-రజతోత్సవ సంచిక) మానవ శరీరం అణుసముదాయం అనే శాస్త్ర విషయం ఆధారంగా ఆత్మాశ్రయ కవిత్వ మూల్యాన్ని సమర్థించారు కవిగారు. కాని యీ అణుసిద్ధాంతానికి ప్రతిగా మరొకరు శరీరసిద్ధాంతాన్ని నిలుపవచ్చును. భిన్నరూపాలు భిన్న ధర్మాలు కలిగిన అవయవాల కూడికయైన శరీరం ఆరోగ్యవంతమై వుండవలెనంటే, ప్రతిఅవయవం నిజోచితధర్మం సక్రమంగా నిర్వర్తించాలి. ఈ అవయవాలు పరస్పర సాహాయ్యకాలు పరస్పరాధీనాలు; అవి స్వతంత్రించిన పక్షంలో శరీరము అస్తవ్యస్తమవుతుంది. అణుసిద్ధాంతములోకూడ, వ్యక్తి అనుభవం సమిష్టికి వినియోగపడుతుందన్నారు. కాని యీ అనుభవంవికటానుభవమైతే? లోకవృత్తముతో విరోధించని అనుభవమే కల్యాణకరమైనదీ, విలువైనదిన్నీ. అది ఆత్మాశ్రయ కవిత్వంలోనికవివ్యక్తిలో చాలవరకు లోపించింది. "నా యిచ్ఛయేకాక, నాకేటి వెరపు?" అని ప్రతివ్యక్తి భావిస్తే పర్యవసానం సమాజమా అరణ్యమా? పదుగురు నవ్వేపని పదుగురు ఒప్పేదై యుండదు. లక్షోపలక్షల జనుల పాదముద్రలు తలదాల్చిన రాజపథమునకూడ కవివ్యక్తి "వక్రగతి" బోతాడు; "కుమార్గము" చూస్తాడు (నా జీవితము: కృష్ణపక్షము). కట్టుబాట్లు మన మేర్పరచుకొననంత మాత్రాన, వాటికి మనం బానిసలమా? "క్రౌర్యకౌటిల్య కల్పిత కఠిన దాస్యశృంఖలలు" త్రెంచవలసిందే. కాని సమాజసంస్థలన్నీ దూష్యాలు కావు.

దివి జేరిన పత్నీస్మృతిని అశ్రుధారలతో నిత్య హరిత మొనర్చుకోజూచే కవి నైర్మల్యాన్ని లోకం సానుభూతితో మెచ్చుకొంటుంది. కాని "విరిసి విరియని" పూవును స్పృశించి వలపుల హరింప నిచ్చగించినప్పుడు లోకం వులికిపడుతుంది. 'కృష్ణపక్షము' లో తృతీయ వేణికగా రూపొందిన యీ ప్రణయ విషాదాంత వృత్తాంతాన్ని గురించి శ్రీ తల్లాప్రగ్గడ శివశంకరశాస్త్రిగారు "కృష్ణపక్ష సింహావలోకనము"లో వ్రాసినట్లు, "దుఃఖములోతు గ్రహించిన యీ కవిహృదయములో ప్రీతి అంకురించి దుఃఖోపశాంతి జేసినది." తన విరులదోటలో పెంచు కొన్న గులాబిమొక్క కొన్నినాళ్ళకు క్రూరార్క కిరణతాపమువలన సోలి వీడిపోయిన తర్వాత, ఆయనకు లోకముమీద కోపానహ్యాలు కలిగాయి (లోకము: కృష్ణపక్షము). "రోదనోచ్ఛలితోచ్ఛ గీతా దురంత దుస్సహార్చులు" వెలువడ్డాయి. కాని తిరిగి ఆశ... "మఘవ మస్తక మకుట మాణిక్య రాజ్ఞి" పలుకరించింది. ఆ ఊర్వశి యెవరో మన కక్కర లేదు. రవీంద్రుడు వెలుగువలువలు ధరింపించి మనోహర సౌందర్య భావాన్ని మూర్తీకరించిన మధుర భావమా? కాదు! కాళిదాసు పురూరవుని వేడుక కొరకు భువికి తెప్పించిన నారాయణోరు సంభవయైన దేవవేశ్యయా? కాదు! ఈ ఊర్వశి ఎర్రాశర త్తుల నిబిడ సంగమమున బొడమిన సంధ్యాకుమారి, శర్వరీ వియోగకపోలపాళిక, నవసాంధ్యసమయ మల్లీమనోజ్ఞ కుసుమకామిని. పరమ మోహన వర్ణనలలోకూడ లీలగా మానవీమూర్తి కనిపిస్తుంది. భావగీతిగా రూపొందిన ఆలావణ్యసీమ వియచ్చరయైనను స్వీయకాదు, చాలకాలమువరకు రతి ఉభయనిష్ఠము కాదు. కనుక కొంత రసాభాసము తప్పలేదు. చివరకు నాయికా నాయకులు చేయిజేయి కీలించినారు.

రాయప్రోలు తర్వాతి ఆత్మాశ్రయ కవితలోని ప్రణయము 'అమలినము' కాదు. కవి వ్యక్తి సంఘవ్యక్తితో విరోధించినాడు. లోకానికీ కవికీ కలఅంతరం భువికీ దివికీ గలట్టిది అయింది. వివాహబాహ్య ప్రణయం నిస్సంకోచంగా మొదట స్వీకార్యమై చివరకు ఆదర్శమైనది. శ్రీ దేవులపల్లిగారిలో సూక్ష్మకృతిలో తలయెత్తిన "నా యిచ్ఛయేకాక నాకేటి వెరపు" అనే ధిక్కారభావం క్రమేపీ విస్తృతాకృతిబూని చివరకు గుడిపాటి వెంకటచలంగారి రచనలలో సంఘసంస్థ

లపై ప్రత్యక్ష యుద్ధప్రకటనగా పరిణమించింది. ఆత్మాశ్రయకవితలో బయల్వెడలిన "వింత తీయదనాలు" శ్రుతిమించగా, "అక్షరానందసిద్ధి" అక్షరాలా యథార్థమై ఇంద్రియానంద సిద్ధిగా రూపొందింది. పంచేంద్రియాలకు పని కల్పించి, తద్వారా హృదయాన్ని కదపడానికి సంగీతమయకావ్యం పూనుకొన్నందుచేత, మెదడు మూలబడి బూజుబట్టి పోసాగింది. సౌందర్యార్చన సౌందర్యానుభవంగా వికటించింది. హేతుచింత, విచక్షణ, మితివంటి ఉన్నత గుణాలకు వుద్వాసన జరిగింది. దేశం రాజకీయోద్యమ సంరంభాలలో అట్టుడికినట్లు వుడికిపోతున్న రోజులలో, కవులు అగ్రసరులై సమాజముతో అభేదం ప్రకటించవలసిన రోజులలో, ఆత్మాశ్రయకవిత ఆంధ్రదేశంలో రెండుతరాల యువభావుకులను అహంభావులనుగా అట్టిపెట్టిందేగాని, ఆంధ్రోద్యమంలో రాయప్రోలువలె, జాతీయోద్యమంలో భారతివలె, నజ్రుల్ ఇస్లాంవలె ఒక చెప్పుకోదగిన కవిని దేశానికి యివ్వలేదు. ఇంద్రియారణ్యాన కవివ్యక్తికినిష్క్రమణ మార్గంలోపించింది. స్వానుభవానికి కావ్యత్వమిచ్చి కావ్యము యొక్క ప్రబోధాన్ని పరిమితం చేసుకొన్న కవివ్యక్తి విజయాన్ని సాధించడానికిమారు, విఫలుడయ్యాడు. సమాజంమీద వ్యక్తి 'విజయం' అతని పరాజయమే; సమాజంనుండి వేర్పాటు తన చేటే.

# కార్యసాధకుల మహాకావ్యం | బుచ్చిబాబు

ప్రపంచభారం ముగ్గురిమీద పడింది. పనిచేసేవారు; ఏం చెయ్యాలో చెప్పేవారు; వీరు సరిగ్గా చెప్పారో లేదో, వీరు చెప్పింది వారు చేస్తున్నారో లేదో గమనిస్తూ, అసలు ఏం చెప్పాలో, నిర్ణయించేవారు. మొదటివారు కష్టజీవులు; రెండోరకం వారు మేధావులు, మూడోరకం వారు పాలకులు. కీర్తి, పలుకుబడి, పేరుప్రతిష్ఠలు, అధికారం, డబ్బు, గౌరవం అన్నీ యీ మూడోరకం వారికే దక్కుతున్నాయి. వీరు కాక నాలుగోరకంవారు కూడా వున్నారని యీ మధ్యనే తెలుసుగున్నాను. ఈ మూడురకాలవారి చర్యలని చూస్తూ, ముక్కుమీద వేలేసుకుని 'ఔరా!' అని లోపల అనుకుంటూ కూర్చునేవారు. నే నీ రకం వాడిని. ఈ నాలుగోరకంవారి ప్రతినిధిగా వారి గుణగణాలని పొందుపరుస్తున్నాను. మేం అందరం చాలా మంచివాళ్ళం. ఎవరిజోలికీ పోము—తుదకు మా జోలే మా కక్కర్లేదు. ఒక సంఘటన జరిగిపోయిన చాలాకాలం వరకూ, మాకు దాని విషయం తెలవదు. ఆ సంఘటన గురించి కొన్ని అభిప్రాయాలు ఏర్పరుచుకుని, ఇతరులకి చెబుదామనుకున్నప్పుడు, వారందరూ ఆ సంఘటన మరిచిపోయేవుంటారు. మాకింక చెప్పే అవసరంలేదు. ఇతరులతో సంభాషించేటప్పుడు, ఎన్నెన్నో చమత్కారమైన భావాలు, సమాధానాలు మా బుర్రలలో చటుక్కున మెరిసి మాయమైపోతూంటాయి. వాటిల్లో వొక్కదాన్ని చెప్పడానికి చక్కటి మాటలు వెదుకుతూండగా, ఆ సంభాషణ సమయం గడిచిపోయి, అవతల వ్యక్తులు నిష్క్రమించడం మామూలుగా జరుగుతూవుంటుంది. ఒక జడ్జీగారు భార్యని పిలిచి "ఆ మెట్ల మీదనుంచి వెళ్ళిందెవరు?" అని ప్రశ్నించారట. వారం గడిచింతర్వాత "అది పిల్లి" అని ఆమె సమాధానం యిచ్చిందట. మేం అట్లాంటివాళ్ళం. మేం వూహలో జీవిస్తాం. ఆ సామ్రాజ్యంలో మేం పాలకులం—కాని పాలితులు లేరు. స్థితప్రజ్ఞులకింద జమకట్టి గీతాకారుడు మమ్మల్ని తెగమెచ్చుకున్నాడు. మాకూ ఆకలి దప్పులూ, తృష్ణ, వాంఛ, అహం కావలసినంత వున్నాయి. దప్పికైతే మంచినీరు త్రాగితే, దప్పిక తీరిపోయి ఆ అనుభవం దూరమైపోతుందన్న భయం వల్ల మేం దప్పిక తీర్చుకోము. వాసనచూసిన పుష్పం త్వరితంగా వాడిపోతుందే అనుకుని, దాన్ని తుంచం, వాసన చూడం. గొప్ప సౌందర్యంకేసి చూస్తే, కన్నీటితో మలినమైన మా దృష్టికి ఆ సౌందర్యం మలినమైపోతుందని భయపడి, దానికేసి చూడం—చూడకుండా, వినకుండా, స్పృశించకుండా, సౌందర్యం మాదవాలి—యిదెల్లా సాధ్యం చెప్పండి! ఊహా జగత్తులో ఏవో పిచ్చి ఆటలాడుకుంటూవుంటాం. కాని మమ్మల్ని అల్లా విహరించనివ్వరు. ఎవ్వరో చెయ్యిపట్టుకుని స్థూలజగత్తులోకి లాక్కుపోతూంటారు. ఏమిటో చదువులట, ఉద్యోగాలట, పెళ్ళి సంసారంట, కూరగాయలు, రైళ్ళు, కోర్టులు, డాక్టర్లు, డబ్బుట! "మార్కెటుకెళ్ళి కూరలు పట్టుకురా" అని ఎవరో కసిరి, మా చేతిలో వో సంచీయిచ్చి జేబులో నోట్లుపెట్టి, తరుముతూ వుంటారు. ఎక్కడ మార్కెట్టు? పుచ్చొంకాయ ఎట్లా వుంటుంది? చేదు దోసకాయని పసికట్టగలవా? ముదిరిన బెండలో బండారం బైట పెట్టగలవా నా బెండరాజా? ఈ ప్రశ్న పరంపరకి సమాధానం ఎవ్వరూ చెప్పరు. అనుభవంవల్ల ముదిరిన బెండ వైనం తెలుసుకున్నా, మళ్ళా మార్కెటికి వెళ్ళినప్పుడు, ఆ అనుభవం వుపకరించదు. ఆ బెండ అక్కడ వుండదు. ఎవరో దాన్ని పట్టుకుపోయి తినేస్తారు. ముదిరిన బెండ తినరుకాబోలు, మేకలికి పెడతారా? నాకు తెలీదు. మరో కొత్త బెండ అవతరిస్తుంది, దాని పుట్టుపూర్వోత్తరాలు, భవిష్యత్తు ఎవరికి తెలుసు? మాకు మాత్రం తెలవదు. రోజు రోజు యీ బెండలు, దోసలు, ఎఱ్ఱ పచ్చ మిరప కాయలు, బ్యాంకులు, ఇన్‌కంటాక్స్ ఫారాలు, పని మనిషి పగిలినగాజు, కింద వుద్యోగి పూడివపాగా, పెళ్ళిలో బాండ్ వాద్యం, — యీ లోకం మీకు కొత్తగా, వింతగా కనిపిస్తూనే వుంటుంది.

ఎల్లాజరిగిపోతాయో చిత్రం, అందరిలాగే మేమూ తయారవుతాం, స్కూళ్ళకెడతాం, చదువుకుంటాం, పెరిగి పెద్దవాళ్ళమవుతాం. మాకూ పెండ్లిళ్ళు అవుతాయి. అత్త, మామ, మరదళ్ళు, తోడల్లుడు—వీళ్ళందరూ వుంటారు తమాషా.

"నన్నెరుగుదురా?"

"ఎరక్కేం?"

"చెప్పుకోండి"

"ఇంకానయం—మీరు రాజారావుగారు"

"కాను, మీ తోడల్లుడు మేనమామగా రబ్బాయిని. గుర్నాథం పెళ్ళిలో కలుసుగున్నాం." అంటాడాయన. మధ్యలో యీ గుర్నాథం ఎవడు? ఏమో! ఎందుకొచ్చింది—గమ్మునుండు! అనుకొని నోరు నొక్కుకుని,—రాజారావు వెళ్ళిపోయింతర్వాత లెండి—కూర్చుంటాం.

మేం ఎవరికేనా మనియార్డర్లు కడితే, అవి తిరిగి మాకే రావడం, పోస్టువాడి చేతులో అణా పెట్టడం మామూలే. ఎవర్నేనా మందహాసంచేసి ఆహ్వానిస్తే, అవతలవాడు సిగ్గుపడి, మొహం తిప్పేసి పోతాడు. అప్పుడప్పుడు నౌకర్లు మొదలైనవారిని గదమాయించమంటారు మమ్మల్ని. కోపంతెచ్చుకొని, నానాతిట్లూ తిట్టి, అధికారం చెలాయిస్తాం. కాని అదేం ఖర్మమో, అవతలవాడు నవ్వు ఆపుకుంటాడు. ఆ దృశ్యం చూసి, మేమూ వచ్చే నవ్వుని ఆపుకోలేక నవ్వేస్తాం. మమ్మల్ని గదమాయించమని పురిగొల్పిన వ్యక్తులు, మమ్మల్ని గదమాయించడంతో ఆ వినోద ఘట్టం పమాప్తమవుతుంది.

"తెలిసిందా, ఇంకెప్పుడూ అల్లా చెయ్యకు. చేశావంటే, చెవడా లెక్కదీస్తాను. మొట్టికాయవేస్తాను. మా చిన్నప్పటి మేష్టారులా తొడపాశం పెడతాను, జాగ్రత్త!"

"అదేమిటండి — ఆ అబ్బాయిని కసురుకుంటారు? అతను డాక్టరుగా రబ్బాయి."

ఇట్లాంటి పొరబాట్లు చేసినవారికి పుట్టగతులుంటాయా? ఎవరింటికేనా వెడితే, పనవగానే, అందరిలాగా, 'వెళ్లొస్తాం' అని లేచిరావడం మాచేతకాదు. గొంతు, సవరించడం, 'అహహ' అని సకిలించడం.........యాలోగా ఇంటి యజమాని మమ్మల్ని బైట దిగవిడిచి, తలుపు గడియేసుకు పోవడం జరుగుతుంది. మమ్మల్ని యీడ్చుకుపోవడం యమధర్మరాజుకి కూడా అంత సుళువుకాదు. సావిత్రి మా పెద్దక్క!

మాకు పలుకుబడిలేదు.—"కానీ తక్కువైంది — రేపిస్తారే" అంటే దుకాణదారుడు పూరుకోడు. చొక్కా విప్పించి దగ్గరుంచుకుంటాడు. మాకెవ్వరూ దగ్గర స్నేహితులు లేరు. మా అభిప్రాయాలు ఎవ్వరికీ అక్కర్లేదు. మేం చెప్పింది ఎవ్వరూ వినరు—అసలు అడిగేవాళ్లే లేరు. ఏపని మీదా మమ్మల్ని పంపరు. మాకు పేరు ప్రతిష్ఠలులేవు.—కీర్తిలేదు. అన్నింటికన్నా ముఖ్యం మాకు డబ్బులేదు. ప్రపంచంలో యింత డబ్బు చలామణి అవుతోందంటే మా కాశ్చర్యం. ఇచ్చేవాడెవడు? పుచ్చుకునేవాడెవడు? మాకు అధికారంలేదు. మేం చెప్పింది ఆఖరికి దేవుడుకూడా చెయ్యడు.

ఇదంతా అతిశయోక్తి అంటారా? నాకో వెయ్యి కావాలి. పంపించి ఆమాట అనండి. మళ్లా తిరిగి యిస్తారెండి. ఆ డబ్బు స్వరూపం చూడనివ్వండి. చూసి, కాదూ కూడదంటే అప్పుడే తిరిగి యిచ్చివేస్తా లెండి. దీనికి కారణం ఏమిటంటారు! ముందే చెప్పాను. మేం చాలా మంచివాళ్ళం అని. మంచివాళ్ళని సంఘం క్షమించదు. "తన చుట్టూ వున్న సమాజంలో వ్యక్తులకంటె మంచిగా వుండటానికి యత్నించినవారు, 'దుర్నీతి' అనే గుమ్మంలో కాలు పెట్టినట్లే" అన్నాడు వొక పాశ్చాత్య తత్వజ్ఞుడు, ఎటొచ్చీ మంచిగా వుండటానికి మేం యత్నించే అవసరంలేదు. అసలు 'యత్నం' అనేది మాకు సాధ్యంకాదు. సహజంగా, పట్టుకతోనే స్థిరపడిపోయిన మంచివాళ్ళం మేం.

మమ్మల్ని తృప్తిపరిచేటందుకు కొందరు మమల్ని 'పాలకుల పాలకులు' అని వ్యవహరిస్తున్నారు మా బుర్రలోంచి ఏవో భావాలొస్తాయి, మేం చనిపోయిం తర్వాత, ఏ వొకరిద్దర్నో అవి ఆకర్షిస్తాయి. వారు వాటిని ప్రచారంచేస్తారు. విప్లవాలు, యుద్ధాలు జరిగింతర్వాత, వాటిని ప్రజలు ఆమోదిస్తారు; వాటిమీద వొక సమాజం నెలకొల్పబడుతుంది; వొక నాగరికత ప్రారంభమవుతుంది. ఇవన్నీ మేం చనిపోయిం తర్వాత. ప్రస్తుతం రాత్రికి మాకు తిండిలేదు.

మాకు తిండి కల్పించడానికీ, మా పలుకుబడి పెంచడానికీ, మమ్మల్ని పైకి తీసుకురావడానికీ, ఆధునిక యుగంలో ఎందరో కృషి చేస్తున్నారు. ఈ కృషివల్ల వారు కోటీశ్వరులైపోతున్నారనుకోండి. అవుతేనేం? మాకు సమాజంలో వొక స్థానం ఏర్పరచి, మమ్మల్ని వో యింటివాడిగా చేయడానికి తోడ్పడే వీరి కృషికి మా కృతజ్ఞత.

ఇట్టివారిలో వొకరు మాది 'మిడత మనస్తత్వం' గా వర్ణించారు. మా మనస్సు దేనిమీదా కేంద్రీకరించదు. అల్లా అల్లా ఎగురుతోవుంటుంది. మేం సినిమా వెడితే, 'అయ్యో కన్యాకుమారికి వెళ్ళలేదే!' అని వాపోతాం. వేమన్నను గురించి వుపన్యాసం సాగుతూంటే షేక్స్పియర్‌ని గురించి ఆలోచిస్తాం. భార్య 'భోజనానికి లేస్తారా?' అన్నప్పుడు, పక్కింటారి ప్రభావతిని స్మరించి ఆమె కళ్ళలోకి చూసినట్లు భార్యకేసి పరధ్యాన్నంతో చూస్తాం. సినిమాకెడితే, సినీ నటుడు కావాలనిపిస్తుంది; నాటకం చూస్తే, రంగస్థల నటుడు కావాలని ఆశయం; కుస్తీపట్టు పోటీ చూస్తే, 'పహెల్వాన్' అవాలని సంకల్పం; ఉపన్యాసం వింటుంటే, 'డిమాస్థనీస్' 'సురేంద్రనాథో బెనర్జీ' లగా ఐపోవాలని లోలోన తీర్మానాలు.

మిడతలదండు దండెత్తితే పొలాలునాశనం. మా మనస్తత్వం వల్ల అట్లాంటి ప్రమాదం ఎవరికీ జరగదు. ఈ మనస్తత్వం గల వాళ్ళపైనుంచి ఆకలితో మాడిపోతున్న యుగయుగాల మనుషులు నడిచిపోతారు. వాళ్ళ కాళ్ళకింద నలిగిపోతాం. ఈ మనస్తత్వం నిర్మూలంచేసి మమ్మల్ని పైకి తీసుకొచ్చే విధానం వుంది. దానికి చాలా డబ్బు కావాలి. చాలాకాలం శిక్షణ పొందాలి.... పోస్టు ద్వారా పాఠాలు పంపుతారు నిజమే. మా సందేహాలు మళ్ళా పోస్టు ద్వారా పంపే తెలిపే లేదసిగా మా గొడవ!

ఇవన్నీ కనిపెట్టి, కొందరు పాశ్చాత్యులు, మాకోసం బోలెడు గ్రంథాలు వ్రాశారు. "సులువుగా 'విజయం' అనే నిచ్చెనెక్కడం;" 'స్నేహితుల్ని సంపాదించడం సులువు;' 'ఎంత కావలిస్తే అంత;' 'లోకం నీ బానిస.' 'పై ఉద్యోగం కావాలా?' 'ఇతరులపైఅధికారం నీకుంది;' 'నీదేపైమాట;' 'ప్రేమించిన స్త్రీని పొందు.' 'నీ శక్తి నీకు తెలవదు;' 'అందరూ వింటారు నీ మాట;' 'నువ్వే నాయకుడవు.' 'శిఖరానికి నిచ్చెన' యివన్నీ ఆ గ్రంథాల పేర్లు. వీటి వెల రూపాయి, రెండుకి మించదు. అన్ని రైల్వే బుక్ స్టాల్స్ లోను దొరుకుతాయి. రైళ్ళకోసం కాచుకున్నప్పుడల్లా యీ పుస్తకాలని కాస్తకాస్త చదువుతూ, వీటి భోగట్టా అంతా తెలుసుకున్నా. "లోకం నీ బానిస" అన్న పుస్తకం నన్నెక్కువగా ఆకర్షించింది. అది చూస్తూవుండేనే రైలెళ్లిపోయింది మా అవిజ్ఞ తీసుగుని. నేను దిగబడిపొయ్యాను. అప్పుడు కొన్నాను ఆ గ్రంథరాజాన్ని.

కొన్ని మిలియన్ల కాపీలు అమ్ముడుపోయినాయని ఆ గ్రంథకర్తగారు చెప్పుకొన్నారు. ప్రపంచం అన్ని భాషల లోకీ—తుదకి నార్వీజియన్ భాషలోకి గూడా—అనువదింపబడింది. భాషలన్నింటిలోకీ తెలుగు లెస్సగాన, తెలుగులోకి అనువదింపబడలేదు. పుస్తకం చివరలో ప్రముఖుల అభిప్రాయాలు, చదివి బాగుపడినవారి అనుభవాలు పొందుపర్చబడి వున్నాయి.

ఒకాయన యిల్లా వ్రాశాడు :

"మీ పుస్తకంలో పై అధికారి ప్రాపకంపొందటం ఎట్లా" అనే అధ్యాయం చదివి మీ సూత్రాలను ఆచరణలో పెట్టాను. దాని ఫలితంగా మొదట్లో నా మొహంకేసి చూడని మా పై అధికారి రోజూ మధ్యాహ్నం టీకని మా యింటికే వచ్చేస్తున్నాడు. ఇప్పుడు ఆయన్ని వదిలించుకోడమే పెద్ద సమస్యగా తయారైంది. ఆయన్ని వొదిలించుకొనే మార్గం సూచించండి" అని.

ఈ పుస్తకంలో ఆరు అధ్యాయా లున్నాయి. అందులో సూత్రాలను ఆచరణలో పెట్టాక కలిగిన ఫలితాలను, జరిగిన మేలును వ్రాసుకొనేటందుకు పుస్తకం చివరలో ఖాళీ కాగితా లున్నాయి. యీ పుస్తకం మీలో చాలామంది చదివే వుంటారు. మీకందరికీ నాలాగ వృద్ధిలోకిరావాలని వుబలాటం వుందని నాకు తెలుసు. లేకపోతే నే వ్రాసింది చదవరు. కాబట్టి ఆ పుస్తకంలో విషయాలన్నీ ఏకరువు పెట్టకుండా అందులోని కొన్ని ప్రధాన సూత్రాలను వివరిస్తాను.

"నీలో చాలా శక్తులున్నాయి, నాశక్తులు నాకుతెలియవు. కాస్తంత పట్టుదలతో పనిచేస్తే నువ్వెంతవాడవు ఆవాలనుకున్నావో అంతవాడవు అయ్యితీరుతావు. నీకు డబ్బుకావాలా? స్నేహితులు కావాలా? పలుకుబడా? అధికారమా? ప్రేమా? బలమా? అవును నీకివన్నీ కావాలి. నీకు పట్టుదల కూడా వుంది. దానికి తార్కాణం నీవా పుస్తకం చదవడమే"

అల్లా సాగుతుంది మొదటి అధ్యాయం. తర్వాత ఆపుస్తకంలో విషయాలను ఆచరణలో పెట్టి గొప్పవారైన కొందరి వ్యక్తుల సంగ్రహ జీవితాలు కూర్చబడివున్నాయి. సంఘంలో పలుకుబడి సంపాదించి పైకిరావాలంటే—యిప్పుడు నా గొడవ అదికనక—ఏంచెయ్యాలో గ్రంథకర్త కొన్ని నినాదాలు క్రింద క్లుప్తీకరించాడు.

అ : అనవసరంగా మాట్లాడకు.

ఆ : మాట్లాడేముందు నిదానించి చటుక్కున తట్టినదాన్ని విడిచేసి మరేమన్నా చెప్తే బాగుంటుందేమో ఆలోచించి అది చెప్పు.

ఇ ; నిన్నుగురించి మాట్లాడకు.

ఈ ; అవతల వ్యక్తిని గురించి మాట్లాడు, అతని భార్య, పిల్లలు. సంసారం, అభిప్రాయాలు, అభిరుచులు తెలుసుకో. వీలైతే పొగుడు. మెచ్చుకో. మరీ భట్రాజులాగ కాక లౌక్యంగా స్తోత్రంచెయ్యి.

ఉ : ప్రతివాడు ఏవో కొన్ని తప్పులు చేస్తాడు. ఏవో లోట్లు వుంటాయి. అవి తెలుసుకొని సానుభూతి ప్రకటించు. అట్లాంటివి నీలో కూడా వున్నట్లుగా ప్రకటించు.

ఊ : అవతల వ్యక్తి స్త్రీ అయ్యినప్పుడు ఆమె వయస్సు అడగకు.

ఋ : పై అధికారి దండించినపుడు తప్పును ఒప్పేసుకో. సమర్థించకు.

ౠ : ఇవన్నీ ఎప్పుడు ఆచరణలో పెడ్తావు? ఎప్పుడో అవకాశం వస్తుందని కూర్చోకు. వచ్చేనెల చూసుకుందాంలే అని వాయిదా చెయ్యకు. రేపు ఆలోచిద్దాంలే అని అనుకోకు. ఇప్పుడు, ఈక్షణంలో ప్రారంభించు. లేచివెళ్లు."

నిజంగా చూస్తే యిందులోవి ఏవీ కొత్త సూత్రాలుకావు. గీతాకారుడు, భర్తృహరి, వేమన్న ఏనాడో చెప్పినవే. కాని ఈ గ్రంథకర్త నా నిత్య జీవితంలోని విషయాలతో సమన్వయ పరచి నినాదాలులాగ గద్యలో సూటిగా చెప్పడంవల్ల ఉద్రిక్తుడనై పుస్తకం మూసి అవతలపారేసి రోడ్డుమీదికి పరుగెట్టాను. మొదట్లో ప్రత్యక్షమైంది రోజూ మావీధిలో తిరిగే పిచ్చాడు. వాడు చక్రవర్తిట. వాడికి రాణీలు కావాలిట. వాడి సామ్రాజ్యంలో ప్రజలులేరుట. నన్ను రమ్మని ఆహ్వానించాడు. ఏమిటో, నిజంగా ఆలోచిస్తే నాకూ వాడికీ తేడా ఏమిటి? వాడి భావాలే నాలోనూ వున్నాయి. ఎటొచ్చీ వాటిని పైకనే సాహసం నాలోలేదు. నావూహా సామ్రాజ్యానికి నేను చక్రవర్తిని, వాడు స్థూలజగత్తులో తిరుగాడుతున్నాడు. అతన్ని సంఘం చక్రవర్తిగా అంగీకరించలేదు. ఎందుకంటారా సంఘంలో ప్రతి వొక్కడు వారి వారి వూహలలో చక్రవర్తులే. ఇట్లాంటివారిముందు ఈగ్రంథకర్త సూత్రాలు ఎందుకు పనికివస్తాయి? పిచ్చివాళ్లు పైకి వొస్తారా, పైకి వచ్చినవాళ్లు పిచ్చివాళ్ళు అవుతారా? గబగబా ఇంట్లోకి వెళ్ళి సమాధానంకోసం మళ్ళా ఆ పుస్తకం తీశాను. దొరకలేదు. ఈ విషయం గ్రంథకర్తకి వ్రాద్దామని ఖాళీకాగితంమీద గుర్తు పెట్టుకున్నాను. ఒక బ్యాగ్ తీసుకొని ఒక నలభై ఏండ్ల ఆమె వరండాలో ప్రత్యక్షమయింది.

"ఆమె వున్నారాండి."

నేను మాట్లాడలేదు.

"మిమ్మల్నే. ఆమె వున్నారా అండీ ?"

నాకు నవ్వొచ్చింది. నవ్వు ఆపుగున్నాను. ఈవిడ కేం సమాధానం యివ్వను? ఆవిడ ఒక అడుగు ముందుకేసి "ఆమె యింట్లో లేరాండీ" అని కంఠం పెద్దదిచేసి ప్రశ్నించింది. నాకు తెలిసిపోయింది. నాకు చెముడు అని అనుకుంటోంది.

"నాకు చెముడు కాదండోయి" అని వెంటనే తట్టిన సమాధానాన్ని దిగమింగేశాను.

"ఎవరికోస మండి ?"

"ఆమె లేరాండి."

"మీ పేరు ?"

"నన్నెరగరా ?"

"అయ్యో, ఎరక్కేం ?"

"లేడీస్ క్లబ్ సెక్రటరీని."

"మీ భర్తగారి పేరు ?"

ఆవిడ నవ్వింది.

"మీవారి పేరు చెప్పండి" అంది.

"మావాళ్ళదేముందిలెండి. సంతోషంగా చెపుదును. మీ అంతటి వారు అడగటం నేను చెప్పకపోడమునా? కాని ఒక్క తిరకాసు వుంది. మావారు అంటూ లేరు. ఎందుకో మీరు వూహించుకోగలరు. మీ క్లబ్‌లో నన్ను చేర్చుకో రాండి ?"

"మీకు వివాహం కాలేదన్నమాట."

"అన్నమాటేమిటండీ, బొత్తిగా కాలేదు."

"రాయలసీమ క్షామనిధికి విరాళాలు పోగుచేద్దామని బయలుదేరాము. అయితే యిది గుర్నాథంగారి యిల్లు కాదన్నమాట."

"అన్నమాటేమిటండీ, బొత్తిగా కాదు. మూడిళ్ళు దాటాక నాలుగో ఇల్లు వారిది. మీవారిని కలుసుకోవాలని వుందండీ."

"తప్పకుండా కలుసుకోవచ్చు. కాని ఒక్క తిరకాసుంది."

"అయ్యో పాపం!, అడిగినందుకు క్షమించండి."

"అదేమిటండోయ్ అసలు పెళ్ళేకాందే."

"అల్లాగా క్షమించండి."

ఆవిడ వెళ్ళిపోతోంది.

"ఏమండోయ్, మీ వయస్సు మాత్రం చెప్పకండేం."

ఆవిడ నవ్వుకుంటూ వెళ్ళిపోయింది.

నాకు చెముడనే కాకుండా 'పిచ్చ' అని కూడా అనుకుంటోందని నాకు తెలుసు. కాని ఏమి చెయ్యడం? ప్రతి ప్రజానాయకుడు, కార్యసాధకుడు, వుద్యమకర్త, కొన్ని కష్టాలు భరించాలి, కొన్ని త్యాగాలు చెయ్యాలి. ఈ అనుభవం ఖాళీ కాగితంలో వ్రాసుకున్నాను.

మరోవారంలోనే గ్రంథకర్తగారి సూత్రాలు పూర్తిగా ఆచరణలో పెట్టే అవకాశం దొరికింది. మా మామయ్యగారి వూరికి గంట రైలుప్రయాణం. పెట్టెలో జనం కిటకిటలాడుతున్నారు. కాని రైలు కదిలే సమయానికి చాలామంది దిగిపోయారు. పెట్టెలోమిగిలింది ఆరుగురం. ఒక ముసిలామె, ఆమె మనుమడు, తలపాగా ఆసామీ, ఒక పోలీసు, నా ఎదురుగుండా సీటుమీద ఒక ఘరానా వ్యక్తి. పత్రిక తీసి చదువుతున్నట్టు అభినయిస్తూ ఆ పెట్టెలో వున్న వ్యక్తుల వాలకాలనుబట్టి వారు ఏ యే వృత్తులలో వుండివుంటారో వూహిస్తూ కాలక్షేపం చేశాను. తలపాగా ఆసామి వ్యాపారస్తుడు. ముసలామెను పోల్చుకోలేకపోయాను. వాలు, పిడకలూ అమ్ముతూ జీవితంగడుపుతుంది కాబోలు. మనవడు రబ్బరుత్రాడు తగిల్చిన బంతిని ఎగరేస్తూ తనవైపుకు లాక్కుంటున్నాడు. సరే, పోలీసు ఆయన పోలీసాయనే. నాకు చిన్నప్పటినుంచీ పోలీసులన్నా, ఖాకీ చొక్కా లాగు వేసుకున్న మిలటరీవాళ్ళు అన్నా చచ్చే భయం. ఒకేరకం

దుస్తులు ధరించిన ఏ పదిమందిని చూసినా కూడా భయమే. ఎందుకో తెలియదు. చిన్నప్పటినుంచీ పోలీసులంటే భయం నేర్పుతారు కాబోలు. అసలు శాంతికాముడుగా జన్మించానేమో లేక సహజమైన భయాన్ని అహింసాతత్వంగా మార్చుకున్నానేమో. ఈ భయమే అసహాయకుడుగా చేస్తుందనుకుంటాను. భయం దిగమింగుకొని సాహసం అలవర్చుకొంటే మానవుడు సాధించని కార్యం లేదనుకుంటాను. ఇవన్నీ నాకు తెలుసు. కాని ఆదర్శానికి ఆచరణకి చాలా వ్యత్యాసముంది. పర్యవసానం ఏమిటంటే కాస్త దూరంగా వుండి ఆ పోలీసాయన ముఖంకేసి మళ్లా చూడలేదు. ఆ పక్క స్టేషనులో రైలు ఆగడం తలపాగా ఆసామి దిగడం మళ్లా రైలు కదిలే వరకూ నేను గమనించనేలేదు. ముసలామె పడుకుంది. రబ్బరుత్రాడు తెగిపోయి కుర్రాడు వుత్త బంతితోనే ఆడుతున్నాడు. మళ్లా పత్రిక చూశాను. వుద్యోగం ఖాళీల వివరాలు చదివాను. నాకు నచ్చినది ఒకటీ లేదు. 'వరుడు కావలెను' జాబితా చూశాను. నాకు తగినవారు ఒక్కరూ లేరు. పరమపదించినవారి చిట్టా చూశాను. నాకిది నచ్చింది. నా భావాలు చాలాచెడ్డవి. చనిపోయినవాళ్లనుగురించి చదవడం నాకిష్టం. ఆత్మహత్యలు, హత్యలు మరీ యిష్టం. ఎవరేనా చనిపోతే వారిల్లు ఖాళీ అవుతుందికదా! వారుచేసిన వుద్యోగం ఖాళీ ఏర్పడుతుందికదా! ఎక్కడో విమానం తగులడింది. మరెక్కడో యుద్ధం, రెండు లారీప్రమాదాలు. ఒక రాజకీయ హత్య. మరో ప్రాంతంలో కరువు. ఒక దేశంలో భూకంపం. మరోచోట అగ్నిపర్వతం ప్రేలుడు. పసిఫిక్ సముద్రంలో రెండు ఓడలు మునిగాయి. అవన్నీ ఆ పత్రికలో వార్తలు. ఒక్క రోజులో యింతమంది చనిపోయారే, యిన్ని ఖాళీలు ఏర్పడ్డాయే, నాకుమాత్రం వుద్యోగం దొరకదేం? ఎదురుగా కూర్చున్న ఘరానావ్యక్తి నోట్లో సిగరెట్టు పెట్టుకొని అగ్గిపుల్లకోసం సంజ్ఞ చేశాడు. నా దగ్గర లేదు. పోలీసాయనకేసి చూపించాను. నా చేతిలో పత్రిక ఆయనకు యిచ్చాను. ఆయన సిగరెట్టు ముట్టించి పత్రిక చదువుతూకూర్చున్నాడు. ఆయనకేసి పరకాయించిచూశాను. వయస్సు ముప్పై లోపు. దట్టంగా మీసాలున్నాయి. ఖద్దరు లాల్చీ, పైన కండువా, కళ్ళజోడూ, మధ్యపాపిడ, రెండు అంగుళాలు నడిచి జుట్టు సుదులు తిరగటంమూలాన్న నిలచిపోయింది. ఆయన విద్యార్థి కాడు, వుద్యోగి కాడు, రైతు కాడు, వ్యాపారస్థుడు కాడు, భూతవైద్యుడు కాడు. ఇల్లా ఆయన ఏం కాడో ఒక రోజల్లా చెప్పుకుపోగలను. 'మరెవరు?' 'శాసనసభాసభ్యుడేమో.' ఆయన ప్రాపకం నా కవసరం. "అల్పుడా! మందభాగ్యుడా, ఇంకా ఎంతకాలం జాప్యం చేస్తావు? రైలుచక్రాల కింద నిమిషాలు నలిగి చస్తున్నాయి. ఆయన్ని మంచిచేసుకోవాలని లేదా? ఆయన్ని పలకరించవేం 'లే,' 'వెళ్ళు!' 'మాట్లాడు'" అని అంతరాత్మ దండిస్తోంది.

"బాగా చెప్పావు, యింకా చివాట్లు పెట్టు. నాకు మీ భాష రాదు. వొస్తే నేనూ నాలుగు తిడుదును" అని గ్రంథకర్తగారు అంతరాత్మని పురిగొల్పుతున్నాడు. ఇంక నేను ఆలసించడానికిపీల్లేదు. గొంతుకుసవరించుకుని వుపక్రమించాను.

"తమ నామధేయం....?"

ఆయనేమీ మాట్లాడలేదు.

"తమ పేరు శెలవిచ్చారు కారు."

ఆయనకి చెముడా అన్న అనుమానం రాసాగింది.

"మిమ్మల్నే" అన్నా కొంచెం బిగ్గరగా.

పత్రిక మడిచేసి, నాకేసి చూశాడు.

"ఆయ్యా" అన్నాడు.

"తమపేరడిగాను."

"మిమ్మల్ని నేనూ అదే అడుగుదా మనుకుంటున్నాను."

నాపేరు చెప్పాలనీ, మాతాతగారి పేరు చెప్పాలనీ—మా తాతగారి తండ్రిగారు కొన్నాళ్ళు దివాన్‌గిరీ చేశాడుట, ఇప్పుడవన్నీ ఎవరు వాకబు చెయ్యొచ్చారులెండి—నాలిక చివరిదాకా వొచ్చేశింది. దానిని దిగమింగాను.

"తమరెవరో...."

ఏమిటి చెప్పాలో స్పష్టంగా లేకపోతే వాక్యనిర్మాణం యిల్లాగే ఏడుస్తుంది.

"మిమ్మల్ని ఎక్కడోచూసినట్లున్నాను." అన్నాడాయన.

"మిమ్మల్ని తప్పకుండా చూశాను........ కాకినాడా....? విశాఖపట్నమా....?"

"ఆ, జ్ఞప్తికొచ్చింది. మిమ్మల్ని నెల్లూరులో చూశాను." అన్నాడాయన.

నేను నెల్లూరుకిగాని ఆ చుట్టు పక్కలికి గాని, రైలు ప్రయాణములో తప్ప వెళ్ళలేదు. కాని ఖండించటం తప్పనీ వాదనలోకి దిగవొద్దనీ, 'లోకం నీ బానిస' గ్రంథకర్తగారి నినాదం చెవులో అద్దె ఎగేసి కాపరం వుండి, ఇల్లు తన స్వంతందే అనే స్థితి కొచ్చింది.

"నాదేముందిలెండి. మీరంటే దేశం నాలుగు మూలలూ తిరిగొచ్చినవారు. పైదేశాలుకూడా పర్యటన...."

"ఎబ్బే—లేదండి—నామోహం—మీమాట చెప్పండి—మీరు ఉత్తర హిందూదేశం అంతా తిరిగొచ్చినట్లుగా వున్నారు" అన్నాడాయన.

"తాజ్‌మహల్‌ను గురించి మీ అభిప్రాయం వినాలనుంది." అన్నాను.

"ఏంచేదులెండి—కన్యాకుమారినుండి సూర్యాస్తమయం గొప్పగా వుంటుందిట. దాన్ని గురించి మీరేమన్నా చెబుతారేమో...."

సూర్యాస్తమయం వర్ణన పద్యం వొకటి జ్ఞప్తికొచ్చింది. దాన్ని నాలుకకిందే నలిపేశాను.

"మీ కండువా చాలా బాగుందండి—ఆ ఖాదీ ఎక్కడిదండి?" అన్నాను. ఆయన నాజోళ్ళకేసి చూస్తున్నాడు.

"మీ జోళ్ళు బావున్నాయి. ఎంతకి తీశారు?"

"మీ కండువాగురించి చెప్పారుకారు...."

"ఆ—ఇదేముందిలెండి—ఇది నాది కానేకాదు. ఓ స్నేహితుడిది." అన్నాడాయన.

"మీ స్నేహితుల్ని బట్టి, మీరెవరో చెప్పచ్చునంటూ వుంటారు పెద్దలు. మీ స్నేహితుడి అభిరుచులు మంచివండీ. బాగుంది కనుకనే మీరు దాన్ని ధరించారు. మీ స్నేహితుణ్ణి గురించి వినాలనుంది. చెప్పండి" అన్నాను.

రైలు నిలిచింది. కుర్రాడు ఎగరేస్తున్న బంతి తిన్నగా వొచ్చి ఆయన మెడకింద కండువా దాగుచేసి పడింది.

"మీ వాడా ?"

నా వొళ్ళు మండింది. ఈ దౌర్భాగ్యుడు ఆమాత్రం వూహించలేడు. పెండ్లయి, అంతవయస్సు పిల్లాడి తండ్రిలాగున్నానా — కళ్ళులేవు ? అందుకనే కండ్లజోడు పెట్టుగున్నాడు ?

ముసలమ్మ, మనమడు దిగిపొయ్యారు. రైలు కదిలింది. ఘరానా వ్యక్తిపై కోపం వచ్చేసింది. 'లోకం బానిస' గ్రంథకర్తమీద కోపం వొచ్చేసింది. అసలు మొత్తంగా పుస్తకాలంటేనే కోపం రేగింది. ఎవ్వళ్ళూ పుస్తకాలు చదువకూడదు.

పుస్తకాలకి అలవాటు పడినవాళ్ళు వూహాలో జీవిస్తూ, లోకజ్ఞానం లేక, అనామకులుగా, ఎందుకూ పనికి రాకుండా తయారవుతారు. పుస్తకాలని నిషేధించాలి ప్రభుత్వాలు. ప్రతి గ్రంథకర్త, ప్రభుత్వానికి పుస్తకానికి వెయ్యిరూపాయిలు చొప్పున సుంకం చెల్లించి మరీ రచనికి పూనుకోవాలి. దాన్ని పుస్తక భాండాగారంలో భద్రంగా వుంచాలి. దానిని చదవాలన్నవారు, ఐదు రూపాయిలు రుసుం చెల్లించాలి. అప్పుడు గాని యీ రాతలు, చదువులు తగ్గవు.

'లోకం బానిస' గ్రంథకర్త కేవలం ఆ పుస్తకం వ్రాసే బోలెడు డబ్బు సంపాదించాడు. ఇంకేపనీ వాడికి చేతగాదు. అతను పాశ్చాత్యుడు—వారి దేశంవారిని వుద్ధరిద్దామని వ్రాసుకున్నాడు. నే నెందుకు చదవాలి ? పాశ్చాత్యుల నాగరికత వేరు, సంస్కృతి వేరు, వారి ఆదర్శాలే వేరు. వారిది కృత్రిమ జీవితం; విద్యుత్ పరికరాలపై ఆధారపడ్డ అసహజమైన జీవితం. వారి విజ్ఞానంలో జ్ఞానానికి స్థానం లేదు. వారి కళలు, వినోదాలు, వేడుకలు, చౌకబారు విలువలు గలవి. వేగం, పైపై నిగనిగలు, అశాశ్వతమైన, బుద్బుదప్రాయాలైన వెకిలి, బాహ్య, శారీరక, ఇంద్రియాల తృష్ణతో నశింపయ్యే రైలుపొగలాంటి జీవితానందాలు వారివి. ఈ యుద్ధాలన్ని ఆ జీవితవిధానంవల్ల సంక్రమించినవే అని వారే వొప్పుగుంటున్నారు. ఇంకా పైకి రా; డబ్బు గడించు; అధికారం తెచ్చుగో, సుఖించు, నీ బాగు చూసుగో— ఇల్లా ప్రతివారూ కృషిచేస్తే వారందరి 'అహం' లూ ప్రేలి, ఢీకొని, యుద్ధంగా గాక, మరెల్లా అంతమొందుతాయి ?

ఇంకనేనా—మాది వ్యవసాయ నాగరికత. ప్రకృతితో ముడిపడిన సహజ సంస్కృతి. ప్రపంచాన్ని తిలకించడం—ఆలోచన, తపస్సు—ఆధ్యాత్మిక చింతన, జన్మరాహిత్యం, 'అహం' ని చంపడం—యివి మా జీవితవిధానం. కడుపులో చల్లకదలకుండా, హాయిగా కొబ్బరిచెట్ల కింద చాపేసుగుని పరుండి, పక్షుల ప్రేమగానం వింటాను. ఆవుపాలు స్వయంగా పితుక్కుని త్రాగుతాను. భాగవతం చదువుకుంటాను. పొలం దున్నుతాను, కూరగాయలు స్వయంగా పండించుకుంటాను. చదరంగం ఆడుకుంటాను. రాట్నం త్రిప్పుతాను. నదిలో స్నానంచేసి, పరమాత్మని తెలుసుగోవాలని పూజచేస్తాను. నేనెక్కడికీ వెళ్లను; నాకు డబ్బొద్దు— అధికారం వొద్దు, గొప్ప వొద్దు, బస్తీలొద్దు, విద్యుత్ నాగరికత వొద్దు, యుద్ధాలొద్దు; ఇంటికెళ్ళి ఆ పుస్తకాన్ని చించెయ్యాలనుకున్నంత కోపం వొచ్చింది.

"అవునులెండి — దేశంలో జనాభా పెరిగిపోతోంది. కుటుంబ నియంత్రణం మంచిదని పెద్దలంటున్నారు. మీబోటివారు ఆచరణలో పెట్టడం బాగుంది. మీరే మార్గదర్శకులు" అన్నాడాయన. ఇదెక్కడి గొడవ. నా కసలు పెండ్లేకాందే ; ఖండించడం తగదు.

"మీ అత్తవారేవూరండి ?" అని ప్రశ్నించాడు. పెండ్లిని గురించి, ప్రేమతత్వం గురించి నా అభిప్రాయాలు చెప్పాలనిపించింది. ఎల్లా? అవతల వ్యక్తిని గురించే మాట్లాడాలి ;

"మీ పిల్లల్నిగురించి చెప్పండి — చదువుకుంటున్నారా? వారి వయస్సులు—అమ్మాయిలైతే వయస్సు చెప్పనక్కర్లేదు లెండి." అన్నాను.

"పిల్లల చదువు, ఉద్యోగావకాశాలు,—జాతీయ విద్యావిధానం—వీటినిగురించి మీ అభిప్రాయాలు చెప్పండి."

"మీరు స్వచ్ఛమైన తెలుగు మంచి జాతీయాలతో మిళాయించి మాట్లాడుతున్నారు. సంస్కృతంలో పాండిత్యం సంపాదించినట్లున్నారు." అన్నాను.

"నేనడిగినదానికి సమాధానం చెప్పకుండా తప్పించేస్తున్నారు. మీరు కవిత్వం వ్రాస్తారు. కాదనకండి."

ఇదేం కర్మ!

"మీబోటి రసికుల ఆదరణ వున్ననాడే కవిత్వానికి దోహదం చేకూరుతుంది. ఏమంటారు?"

"మీరు చదువుకుంటున్నారా?"

"మీ వుద్యోగం........"

"ముందు మీ విషయం చెప్పండీ." అని కంఠం కాస్తంత పెద్దది చేశాడు.

"అదేనయ్యా నేనూ అంటున్నదీ, ముందు మీ విషయం చెప్పమనే."

"ఏమిటయ్యా మహా, యిందాకటినుంచి చూస్తున్నాను. ఒక్క ప్రశ్నకి సమాధానం చెప్పవు........"

"నీ వ్యవహారం మరీ ఘోరంగావుంది. సమాధానం చెప్పవు సరికదా, ప్రశ్న పరంపరలు కురిపిస్తున్నావు." అన్నాను.

"నీ వ్యాకరణబద్ధమైన భాష నా నెత్తిలాగవుంది కాని, నీ పెళ్ళి, పెళ్ళాం విషయం చెప్పు."

"ఏమయ్యోయి. యింతవరకూ చెప్పలేదు. యిప్పుడు చెప్పేస్తున్నాను. నేను కవిని. బోలెడంత కవిత్వం వ్రాశాను. కాపీలు కావాలంటే నాకు వ్రాయాలి తెలుసా! నువ్వు చదవక పోతే సరా? నీలాంటి రసికులు ఎందరు తక్కువుంటే కవిత్వానికి అంత మంచిరోజులు. పైగా నా పెళ్ళాంగొడవ నీకెందుకూ, అసలు నాకు పెళ్ళేకాలేదు. నీ పిల్లలవిషయం అఘోరించు." అని అనేశాను వొళ్ళుమండి.

"మాటలు తిన్నగారానియ్. నాపిల్లలజోలి నీకెందుకు? నీబోటిగాడి దిష్టి తగిలిందంటే అసలు పిల్లలే పుట్టరు. నీకొక్కడికే కాలేదనుకున్నావా పెళ్ళి. నాకూకాలేదు. అసలు కాదుకూడా" అన్నాడు.

"ఏం ఏంవచ్చింది తెగులు నీకు, గుడ్డివాడివా, కుంటివాడివా?"

"ఛీ, నోర్మూయ్."

"ఛ, ఛా, నీనోరు నీచేత్తో మూసుకో. మూతికి తాళంవేసి తాళంచెవి నాకియ్యి."

ఆయన లేచి లాల్చీ చేతులు పైకి మడుస్తున్నాడు.

"ఏదీ. యిప్పుడు వాగు."

నేనూ లేచాను.

"ఏం కొడ్తావా? ఏయ్ పోలీసాయనా" అని పోలీసాయన కూర్చున్న వేపుకి చూశాను. ఏడీ ఎక్కడా లేడే. సీటుకింద దూరి ఒక దుడ్డుకర్ర, నల్ల కంబళీ పైకితీసి చుట్టచుట్టి బయటకు పోయాడు.

జనం పెట్టెలోకి ఎగబడుతున్నారు. "ఇది ఏ స్టేషన్?" అని అడిగాడు ఘరానావ్యక్తి.

'ఫలానా' అన్నారు ఎవరో.

ఘరానావ్యక్తి గబగబా సంచీ తీసుకొని జనంలోంచి పెట్టె బయటపడ్డానికి పెనుగులాట సాగించాడు. అతగాడిని ఎదుర్కున్న వస్తుపరంపర ఒకటా. కొబ్బరికాయల సంచీ, కుడి ఎడమ వైపులవారిని ధృతరాష్ట్రద్వయంగా చేయగల పాలకావిడి, మృదంగంలాగ మోగే కిరసనాయిలు డబ్బాలు; కట్టెలమోపు. మూతి వూడిపోయిన మిరపకాయలు సంచీ, యీ సరుకు తాలూకు అసామీల సముదాయం, యిందరిలోంచి బయటపడటంలో ఘరానావ్యక్తి సంచిలోంచి ఒక గ్రంథరాజం కిందపడి నలిగి చిరిగి తుత్తునియలు కాబోతుండగా పురావస్తు పరిశోధనలాంటి సాహసకృత్యంతో దాన్ని బయటికి లాగి, దులిపి ఘరానావ్యక్తికి యిచ్చాను. రైలు కదులుతోంది. ఆయన చాలా థ్యాంక్స్ చెప్పడం గ్రహించాను. ఆయన సంచీలోంచి పడిపోయిన పుస్తకం పేరు "లోకం నీ బానిస"- నా అభిమాన గ్రంథరాజం. చిన్ని పొరపాటు జరిగిపోయింది. నేను దిగవలసిన స్టేషన్ దాటి పోయింది.

మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

## ముత్యాలశాల

ఆంధ్ర కవి సార్వభౌమ హేమాభిషేక
పరమ సమ్మాన మంగళాచరణ గాన
వాద్య నిస్వాన మదియొక్క స్వాతివాన
తనువుగా మొగ్గ విచ్చె ముత్యాలశాల.

కస్తూరికా పుండ్రకమ్ము దిద్దిన మేల్మి
పస చిందులాడు నెన్నొసలివాఁడు
తార హారముల ముత్యాలపేరుల ప్రోలఁ
గొమరారు తెలిజన్నిదములవాఁడు
రత్నాంగుళీయకప్రభకు శోభలుతీర్చి
విలసిల్లు కెంజేతి వ్రేలివాఁడు
తుళకించు పైఁడి పువ్వులు కుట్టినంచుల
పట్టు సాలువ వలెవాటువాఁడు
ఠీవి గలవాఁడు - శంభు సేవా వివేక
సాధు శీలమ్మువాఁడు - శ్రీనాథ విబుధుఁ
డచ్చమగు తెన్గు నొడువు ముందడుగు లిడఁగ
వెడలెఁ గనకాభిషేకంపుఁ బెండ్లికొడుకు.

అడఁకువ వాఱు భక్తి పెనుపారఁగ దేవనృపాల మంత్రి చూ
పెడు పువుబాటలో నడుగువెట్టుచు గన్నియ లెత్తు హారతుల్
పొదవగు కూర్మి సందుకొని పోవుచు సూరెల బారు తీఱి చే
రెడు కవిబృందముం బలుకరించుచు ముచ్చటలూర్చు నయ్యెడన్.

తనకున్ స్వాగమనంబు పల్కి మృదుహస్త ద్వంద్వ సంస్పర్శనం
బునఁ దేలించిన గౌడ డిండిముల చొప్పున్ మెచ్చి శ్రీనాథుఁ డె
త్తిన యంఘ్రిన్ గరుణార్ద్రచిత్తుఁడు సముద్దిష్టంబు పీఠంబుపై
నునిచెన్ మెల్లన వంది గీత జయగాథోత్సేథ మధ్యంబునన్.

★'ఆంధ్ర పురాణము' విద్యారణ్యపర్వము నుండి ఉద్ధృతము.

ప్రౌఢపతి మౌళిఁ గుచ్చు తురాయి చుంగు
అల 'క్రియా శక్తి' మేని వెన్నెల హారంగు
సకల కవి సార్వభౌమోపచారమునకుఁ
గుడి యెడమవైపు పీచోపు వడుపు లయ్యె.

కలిత శివార్చనైకరసికమ్మగు శ్రోత్రియతేజ మొండు ని
ర్మలము సముజ్జ్వలంబునయి మౌక్తికశాలకు లో వెలుంగుచున్
వెలిగొడుగుం బెడంగుఁ దలఁపించె; నుదంచిత సార్వభౌమతా
కళ కవినాథులో నకృతకంబు స్వతోజనితంబునై తగెన్.

కర మానందము కల్మిఁ దెన్గు కవులుం గర్ణాట సూరుల్ బరా
బరులై తా మరిగాపు లట్లు సభతీర్పన్ - నర్తనప్రౌఢలౌ
తెలువల్ కొందఱు మంద ముగ్ధగతులన్ దీనారటంకాల ప
ళ్లెరముల్ దోసిళులార నుంచుకొని యోలిం దెచ్చి రాస్థానికిన్.

మేలి ముత్యాలశాల యన్ పాలకడలి
నురలి వచ్చిన యీ పైఁడి సిరులు మోసి
యింక "శ్రీనాథుఁ" డగును బో! యీతఁ డనుచు
వేసికొనె డిండిముఁడు మెల్ల విసపు గుటక.

హేమాభిషేక సంభారమ్ము లెల్ల సమానీతమ్ము లైనవెంట హృద్యమంగళ వాద్యంబు లయు, విబుధుల సాదువాదంబులయు, భూసుర స్వస్తి వాచనంబులయు, తియ్యని సవ్వడిలో మహోత్సవ పర్యవేక్షణ పీఠాధ్యక్షుండగు చంద్ర భూష క్రియాశక్తి కోవిదులగు సభాసదులం గనుం గొని జలదస్వన గంభీర గళస్వరంబున-

"డిండిమ బుధేంద్రు సలఘు పాండితిని గెలిచి
కవులలో సార్వభౌమతఁ గన్న మేటి-
యితని వ్యుత్పత్తి కీ ధరాధీశ్వరుండు
చేయుచున్నాఁడు స్వర్ణాభిషేక పూజ"

అని పలుకునంత విద్యానగర వసుంధరా రమణుండు దేవరాయలు శ్రీనాథ కవిసార్వ భౌమున కాభిముఖ్యమ్ము వహించి తన పజ్జ నొక తరుణి కరయుగంబునం బట్టియున్న బంగారు బళ్లెరంబున దోసిలి ముంచి తీసి యప్పసిండి విరులఁ గవిచక్రవర్తి శిరమ్ము నభిషేకించెఁ; బదం పడి చంద్ర భూష క్రియాశక్తి మగుడ సభ్యుల నరసి మధురోచ్చతరంబగు నెలుంగున-

"ప్రౌఢ నరపతి తన యేలుబడి ధరిత్రి
నేఁడు శ్రీనాథు సరి లేఁడు లేఁ డటంచు
నీ త్రిలింగ కవీశున కిపు డొసంగుఁ
గనక కుసుమ మహాన్యాస గౌరవంబు"

అని వచించునంత నా తెనుంగు నేలిక యనల్ప శివ సంకల్పమ్మున రెండవ దోయిట దీనారమ్ము లందుకొని శ్రీనాథు నుత్తమాంగమునఁ దీర్థమాడించుటయుఁ జంద్ర భూషక్రియాశక్తి మరల సదస్యులం బరికించి ముక్త కంఠంబున-

"పదను గల కైత యొక కొమ్మ-వాడిదేటి
యున్న వైదుష్య వైభవ మొక్క కొమ్మ-
కాంతి రమ్యము శ్రీనాథ కామధేను
మౌళి తలమున బంగారు పూల దిమ్మ."

అని పలుకునంత నొదయందు తృతీయాంజలిం గయికొన్న జాంబూనద ప్రసూనంబులు వోసి శ్రీనాథ మహాకవిని మూర్ధాభిషిక్తు నొనరించు టయు-

పరి గొనివచ్చి మంతురులు పళ్లెరముల్ కయికొంచు వేడ్క బం
గరు విరి వానలం గురియఁగాఁ దలమున్కల సార్వభౌముఁ డ
య్యురవడి గౌరవంబునకు నుబ్బియు నుబ్బక శారదా దయా
వరణములో నొదల్ దులిపివైచి కనెన్ నవజాత రూపమున్.

అట్టి మహోదయావసరంబున-

శతమానం భవతీతి
శ్రుతి పాఠ పురస్సర ద్విజశుద్ధ మహీ దై
వత కృత మహదాశీస్సం
భృతాక్షతల దోఁగి లేచి శ్రీనాథుఁ డొగిన్.

పెద్దల కెఱంగి ప్రౌఢరాయ మహీనాథు దెస నరసి-

"నరవరమౌళి యొక్క కవినాథుని యొదలఁ గాక శారదా
చరణములందుఁ బాద్యము నొసంగితి; వర్ఘ్యము నెత్తుకొంటి; వి
త్తతి-మతి యింతకంటె నొక ధన్యత నీకును నాకు లేదు; బం
గరువునఁ దావి పొందు తొలకాడెను నీ కతనన్ దెలుంగునన్."

మఱి మించి యీ కల్యాణ సమ్మర్ద సమయంబున హృదయంబు విప్పఁ గడంగ నని యథోచితమ్ముగఁ బలికి యూరకుండుటయు నాయెడ రాజనియుక్తులు కొందఱు-

ప్రభురత్నమ్మగు దేవ భూపతి యపార ప్రీతి శ్రీనాథుపై
నభిషేకించిన శాతకుంభమయ పుష్పానీకముల్ భక్తి సౌ
రభ పూర్ణంబులు రాశిచేసి యరుదారన్ నిండు దోసిళ్లతో
సభ విద్వాంసుల కెల్లఁ బంచిరి సమంచద్గౌరవోదాత్తతన్.

జాదులు ప్రసాదములు గాఁగ స్వర్ణకుసుమ
విసరముఁ బరిగ్రహించిన విబుధ వరుల
ప్రమద బాష్పాంబువుల మెత్తబాఱిపోయి
యుక్కు సెడి పల్క దీఁక లోహ ధక్క యెపుడు.

దురిత హరములు నాథ పాదుకలు గొనఁగ
సుమహిత సువర్ణ మంత్ర పుష్పముల మెఱయు
కరపుటంబులతో నిల్చు ఘనుల తోడ
నలరె ముత్యాలశాల దేవాలయముగ.

దివాకర్ల వేంకటావధాని

# కావ్యస్వరూపము

కవిశబ్దము మొదట వేదములందుఁ బరమాత్మ పరముగా వాడఁబడినది. తరువాత నది పరమాత్మ సాక్షాత్కారమునందిన ఋషులకు వాడఁబడినది. వేదమంత్రములను దర్శించిన మహర్షులు కవులు. వారి కావ్యలు ముపనిషదాదులు. లౌకిక కావ్యములైన రామాయణ మహాభారతములను రచించిన వాల్మీకియు వ్యాసుఁడునుగూడ ఋషులే. వారు దివ్యదృష్టిచే ప్రపంచరహస్యము లారసి, లోకజ్ఞులై, లోకోత్తర వర్ణనాత్మకములైన మహాకావ్యములు రచించిరి. ఆరంభమున వేదముల దర్శించినవారు ఋషులగుట చేతను, దరువాత లౌకిక కావ్యములను రచించిన వారుగూడ ఋషులే యగుటచేతను ఋషి కానివాఁడు కావ్యము రచింపఁ జాలఁ (నానృషిః కురుతేకావ్యమ్) దనియుఁ, గవి క్రాంతదర్శియనియు నానుడు లేర్పడినవి. క్రాంతదర్శియనఁగా జర్మచక్షువుల కతీతములైన విషయములనుగూడఁ జూడఁ జాలినవాడని యర్థము.

దర్శనమాత్రముచే నెవ్వరును గవులు కాఁజాలరు. ముందు దర్శించి తరువాత దర్శించిన దానిని వర్ణింపవలయును. దర్శన వర్ణనములవలన లోకమున కవి యను ప్రసిద్ధికలుగుననియు (దర్శనా ద్వర్ణనాచ్చాథ రూఢాలోకే కవిశ్రుతిః) ద్రష్టయైన వాల్మీకి వర్ణనానంతరమే (రామాయణ రచనానంతరమే) కవియను యశస్సు నార్జించెననియు, భట్టతౌతుఁడు చెప్పియున్నాఁడు. ప్రతిభాశాలియై, నిపుణముగా వర్ణించువాఁడే కవియని భామహుని యభిప్రాయము. ప్రతిభావంతుఁడు కాని వస్తువులను లెస్సగా దర్శింపజాలడు. వస్తువులను లెస్సగా దర్శించిన వానికిఁ గాని వానిని జక్కగా వర్ణించుశక్తి పమకూరదు. కాపున వస్తువులను దర్శించుట, దర్శించిన వస్తువులను వర్ణించుట కవియొక్క ముఖ్యలక్షణములు.

కవనీయము (వర్ణింపఁదగినది) కావ్యము. లోకోత్తరవర్ణనా నిపుణుఁడైన కవి కర్మ కావ్యమని మమ్మటుఁడు. లోకోత్తర వర్ణనానైపుణ్యము ప్రతిభైక సాధ్యము. ప్రతిభ దేవతానుగ్రహ సంపాద్యము. దేవతానుగ్రహము తపస్సంపాద్యము. తపస్సు ఋషి వ్యాపారము. అందుచేతనే ఋషికానివాఁడు కావ్యము నిర్మింపజాలఁడను మాట కలిగినది. కావ్యాంగము గాని శబ్దముగాని, న్యాయముగాని, విద్యగాని, కళ గాని లేదు. అందుచేఁ గవిపై మహత్తరమైన భార మున్నది. కవి కాకపోవుటలో నధర్మమేమియు లేదు, అందువలన మృతిగాని శిక్షగాని కలుగనేరదు. కాని కుకవిత్వము మాత్రము సాక్షన్మరణమే. కుకవిత్వము చెప్పుటకంటె నసలు కవిత్వము చెప్పకుండుటే మేలని దీని యభిప్రాయము.

కవి కర్మ కావ్యమని తేలినది. ఇంక దాని స్వరూపము నారయుదము. కావ్యము నొక వ్యక్తితోఁ బోల్చి పూర్వలాక్షణికులు దాని స్వరూపము నిర్ణయించుటకుయత్నించిరి. వ్యక్తికివలెనే కావ్యమునకుఁ గూడ దేహాత్మలు, గుణాలంకారములు మున్నగునవి యుండును. ప్రాచ్య లాక్షణికుల కాద్యుఁడైన భరతుఁడు కావ్యమున కితివృత్తము శరీరమనియు రసము తత్సౌందర్య హేతువనియు నుడివెను. క్రీ. శ. ౭వ శతాబ్దికిఁ జెందిన భామహుఁడు శ్రవ్య కావ్య చర్చ గావించి "సహితములైన శబ్దార్థములు" కావ్యమని చెప్పెను. ఇతని యభిప్రాయము ననుసరించి శబ్దార్థ యుగళమే కావ్య శరీరము. అలంకారములు దీనికి సౌందర్యము కలిగించును.

క్రీ. శ. ౭ వ శతాబ్దియందలి దండి "ఇష్టార్థ వ్యవచ్ఛిన్నమైన పద సమూహమే" కావ్యమని చెప్పెను. రమణీయమైన యర్థముతోఁగూడిన పదముల సమూహము కావ్యమని దీని యర్థము. ఇష్టార్థ వ్యవచ్ఛిన్నమను విశేషణము వాడినను ఇతఁడు పదసమూహమునకే యెక్కువ ప్రాధాన్యమొసంగెను. ఇతని మతమునఁ బదసమూహమే కావ్య శరీరము. గుణములు తత్సౌందర్య హేతువులు.

క్రీ. శ. ౮ వ శతాబ్దివాఁడగు వామనుఁడు గుణములచే నేర్పడు రీతి కావ్యాత్మయనియు నలంకారములు తత్సౌందర్య పోషకములనియు నుడివెను. ఇతఁడు భామహు ననుసరించి శబ్దార్థముల సమాహారమే కావ్య శరీరమని యభిప్రాయపడెను.

ధ్వన్యాలోక కర్తయైన యానందవర్ధనుఁడు కావ్య శరీరమును గూర్చి యిదమిత్థమని చెప్పియుండలేదు. కాని తరువాతి వ్యాఖ్యాతలు కొందఱు శబ్దార్థ యుగళమును, గొందఱు చారుత్వాతిశయముతోఁ గూడిన విశిష్టార్థమును బ్రకాశింపఁజేయు శబ్దమును అతఁడు కావ్యశరీరముగాఁ జెప్పిన ట్లూహించిరి. ఇందలి రెండవ యభిప్రాయమునకును దండి యభిప్రాయమునకును భేదమేలేదు. లోచన కర్తయైన అభినవగుప్తుఁడు కూడ శబ్దమే కావ్యశరీరమని భావించెను.

తరువాతి లాక్షణికులలోఁ బ్రధానులైన మహిమభట్టు, కుంతకుఁడు మున్నగువారు శబ్దార్థ యుగళమే కావ్యశరీరమని సూచించిరి. రసగంగాధరకర్తయైన జగన్నాథుఁడు దండివలె శబ్దమునకే ప్రాధాన్యమొసంగెను.

శబ్దార్థములు రెండును అవినాభావ సంబంధము కలిగియుండునను మాట నిజమే. అందుచేతనే కాళిదాసు పార్వతీపరమేశ్వరులను "వాగర్థావివసంపృక్తౌ" అని వర్ణించెను. కాని శబ్దము కావ్యబహిస్స్వరూపమును మాత్రమే సూచించును, అర్థము దాని యాంతర ప్రవృత్తిని సూచించును. లాక్షణికులు కావ్యాత్మయని చెప్పిన రసాలంకారగుణరీతి ధ్వన్యనుమానౌచిత్యాదులన్నియు నర్థము నాశ్రయించినవే. అందుచేఁ గావ్యబహిఃస్వరూపము శబ్దమే యనియు వ్యక్తిసామ్యమును బట్టి చూచినచో నదే కావ్యశరీరమగుననియు నూహింపవచ్చును.

మన లాక్షణికులు పలువురు కావ్యమును బలువిధముల నిర్వచించియుండిరి. అందుఁగొన్ని ముఖ్యములైన వీ క్రింద నొసంగఁబడుచున్నవి.

సహితములైన శబ్దార్థములు కావ్యము (భామహుఁడు). ఇష్టార్థవ్యవచ్ఛిన్నమైన పదావళి కావ్యము (దండి). గుణాలంకార యుక్తములైన శబ్దార్థములు కావ్యము(వామనుఁడు). అదోషములు, సగుణములు, సాలంకారములు అయిన శబ్దార్థములు కావ్యము. అవి యొక్కొక్కప్పు డనలంకారములు కూడఁ గావచ్చును (మమ్మటుఁడు). రసాత్మకమైన వాక్యము కావ్యము (విశ్వనాథుఁడు). నిర్దోషము గుణాలంకార రసవంతము నగు వాక్యము కావ్యము (భోజరాజు). గుణాలంకార రీతి రసోపేతమైన సాధు శబ్దార్థ సందర్భము కావ్యము (వాగ్భటుఁడు). నిర్దోషము, గుణాలంకార రీతి వృత్తిమంతమునగు వాక్యము కావ్యము (పీయూషవర్షుఁడు). రమణీయార్థ ప్రతిపాదమైన శబ్దము కావ్యము (జగన్నాథుఁడు). రసాలంకార యుక్తము సుఖవిశేష సాధనమునైన వాక్యము కావ్యము (కేశవమిశ్రుఁడు).

ఈ పై నిర్వచనములలో దేహాత్మలతోఁగూడిన కావ్యసమగ్రస్వరూపము చెప్పఁబడినది. ఈ నిర్వచనములను గావించునప్పు డా యా లాక్షణికులు తమకుఁ బూర్వమందుండిన లాక్షణికులు చెప్పినవాని యందలి దోషములను జూపి యంతకంటె నుత్తమమైననిర్వచనమును జెప్పుటకు యత్నించిరి. ఆ యభిప్రాయములు దిఙ్మాత్రముగా నిట సూచింపఁబడుచున్నవి.

దండి మనోహరార్థ సమలంకృతమైన పదసమూహము కావ్యమనిచెప్పి యందల్పమైన దోషమునుగూడ నుపేక్షింపరాదని భావించెను. మమ్మటుఁడు శబ్దార్థయుగళము కావ్యమనిచెప్పి యా శబ్దార్థ

ములు సగుణములు నిర్దోషములు సాలంకారములునై యుండవలెనని సూచించెను. "అనలంకృతే పునః క్వాపి" యనుటవలన నొకానొకచో నలంకారములు స్ఫుటముగా లేకున్నను గావ్యత్వమునకు హానిరాదని వ్యాఖ్యాత సూచించెను. దండి మమ్మటు లిరువురును గావ్యము నిర్దోషమై యుండవలెనని నొక్కి చెప్పిరి. మమ్మటుఁడది యదోషమై యుండుటేకాక సగుణము సాలంకారమునై కూడ నుండవలెనని భావించెను.

లోకమున దోషరహితమైన కావ్యమేదియు నుండదనియు, నదోషత్వమే కావ్యమునకుఁ బ్రధాన లక్షణమైనచో ధ్వని ప్రాధాన్యమునుబట్టి యుత్తమ కావ్యములు కావలసినవి పెక్కు-సలు కావ్యములే కాకపోవలసి వచ్చుననియుఁ దెల్పి పైవారి యభిప్రాయములను విశ్వనాథుఁ డాక్షేపించెను. మఱియు నతఁడు రసము కావ్యమున కాత్మభూతమని యంగీకరించినప్పుడు గుణములులేనిచో రసముండదు కావునఁ గావ్యము సగుణమైయుండవలెనని వేఱే చెప్పనక్కఱలేదని భావించెను. అలంకారములు గుణములవలె రసధర్మములు కాకపోవుటచే నలంకారము లేకున్నను గావ్యము రసవంతము కావచ్చుననియు నందుచేఁ గావ్యము సాలంకారమై యుండవలెననుటయు ననవసరమే యనియు నతఁడు తెలిపి రసాత్మకమైన వాక్యము కావ్యమను నిర్వచనము కావించెను.

జగన్నాథుఁడు మమ్మట విశ్వనాథుల నిర్వచనముల రెంటిని ఖండించెను. లోకమున "ఈ కావ్యము దుష్ట"మను వ్యవహారముండుటచే దుష్టత్వము కావ్యత్వమునకు హాని చేకూర్పదనియు, గుణాలంకార సహితములు కాకున్నను వ్యంగ్యార్థ భూయిష్ఠములై యుత్తమ కావ్యము లనిపించుకొనునవి పెక్కుండుటచేఁ గావ్యము సాలంకారము సగుణమునై యుండవలె ననుట వ్యర్థమనియు, నాతఁడు మమ్మటుని నిర్వచనము నధిక్షేపించెను. రసాత్మకమైన వాక్యమే కావ్యమన్నచో రసస్పర్శలేని వస్త్వలంకార ధ్వని యుక్తములైన కావ్యములు కావ్యములు కాకపోవలసి వచ్చుననియుఁ, బ్రాచీనులు కపి బాలవిలాస జలపాతాదులను గూర్చి వర్ణించిన వస్త్వలంకార ధ్వని ప్రధానములైన కావ్యములు పెక్కు గలవనియుఁ దెల్పి యతఁడు విశ్వనాథుని నిర్వచనమును గూడ ఖండించెను. రమణీయార్థ ప్రతిపాదకమైన శబ్దము కావ్యమని జగన్నాథుని నిర్వచనము. దీనికిని దండి నిర్వచనమునకును భేదమేమియులేదు.

మన లాక్షణికుల వలెనే పాశ్చాత్య విమర్శకులు కూడఁ గవిత్వమును నిర్వచింప యత్నించియుండిరి. వారు రసధ్వన్యలంకారాదులను గూర్చి ప్రాచ్య లాక్షణికులయట్లంత నిశితముగాఁ బరిశీలనము చేయనప్పటికిని వారు కావించిన నిర్వచనములలోఁ గొన్ని యలంకారమతమునకును గొన్ని రసమతమునకును జెందినట్లు కన్పించును. గోల్డుస్మిత్తు, లేహన్టు మొదలైనవా రలంకార మతమునకును, వర్డ్సువర్తు, జాన్ లెబెల్ మొదలైనవారు రసమతమునకును సంబంధించినవారని చెప్పవచ్చును. మొదటి తెగవారు కావ్యబహిస్స్వరూపమును మాత్రమే చెప్పియుండ రెండవమతమువారు దాని యాంతర స్వరూపమును గూడ భావించినట్లు గోచరించును.

భావనావ్యక్తీకరణమే కవిత్వము (The expression of the imagination). భావన కొకవిధమైన భ్రాంతిని గలిగించునట్లు పదముల నుపయోగించు కళయే కవిత్వము (The art of employing words in such a manner as to produce an illusion on the imagination) సౌందర్యమును గణబద్ధముగా సృజించుటయే కవిత్వము (The rhythmic creation of beauty) అనునవి మొదటితెగవారొనరించిన నిర్వచనములు. ఆవేశమప్రయత్నముగా మూర్తీభవించియుండు పదములును భావములునుగాక కవిత్వమనఁగా నింకేమి యని జాన్ స్టూవర్టు మిల్ నుడివి యుండెను[1]. శక్తిమంతములైన భావములు సహజ

1. What is poetry but the thought and words in which emotion spontaneously imbodies itself.

ముగా నుప్పొంగుటయే కవిత్వమని వర్డ్సువర్తును[2], ఉప్పొంగిపోవు భావప్రవాహమునకుఁ బరీవాహమే కవిత్వమని జాన్ లెబిల్[3] అనునతఁడును గవిత్వమును నిర్వచించియుండిరి. ఈ నిర్వచనములు క్రౌంచ ద్వంద్వ వియోగోత్థమైన యాదికపి శోకమే శ్లోకత్వ మొందెనను నానందవర్ధనుని భావమునకుఁ బ్రతిబింబములుగా నున్నవి. ఇందు రససిద్ధాంతము పూర్తిగా వ్యక్తముచేయఁబడకున్నను దాని ఛాయలు మాత్రము గోచరించుచున్నవనుటలో సందేహములేదు.

ఈ విధముగాఁ బ్రాచ్య లాక్షణికులును బాశ్చాత్య విమర్శకులునుగావించిన నిర్వచనములలోఁ గావ్యము యొక్క దేహాత్మలు రెండును స్పృశింపఁబడినవి. కొందఱు శబ్దార్థములు రెండును గలసి కావ్యమనిరి; మఱికొందఱు విశిష్టలక్షణములుగల శబ్దమే కావ్యమనిరి. మొదటివారు కావ్యముయొక్క బహిరంతఃస్వరూపములు రెండింటిని జత చేసిరి. రెండవవారు బహిస్స్వరూపమును మాత్రమే వ్యక్తము చేసిరి. సూక్ష్మముగాఁ బరిశీలించినఁ బై యిరుతెగలవారి యభిప్రాయములును యథార్థములే.

---

2. Poetry is the spontaneous overflow of powerful feelings.
3. Poetry is a vent for overcharged feelings.

మల్లంపల్లి వీరేశ్వరశర్మ

# రాయలు - ఆముక్తమాల్యద

రాయలు విష్ణుచిత్తుఁడు. ఆయన కూతురు, ఆముక్త మాల్యద. విష్ణుచిత్తాచార్యుల పుత్రియగు నాముక్త మాల్యద సప్తప్రాకారపరివేష్టితుండగు శ్రీరంగనాథుని వరింపఁగా నీవిష్ణుచిత్తుని పుత్రిక యేడుకొండలపై నధివసించిన శ్రీ వేంకటేశ్వరు వరించినది. కాఁగా నాముక్తమాల్యద సప్తాశ్వాసపరిమితగ్రంథ మైనది. సర్వాంధ్రప్రబంధ విలక్షణత యిందెల్లెడలఁ బ్రస్ఫుటము. రాయలకు మునువెనుకలను సమకాలమునను బుట్టిన ప్రబంధములెల్ల ప్రాయికముగా శృంగారరస ప్రధానములు. కొన్ని క్షేత్రమహాత్మ్యములును గలవు. అందు శ్రీకాళహస్తీశ్వర మాహాత్మ్యముతో నీ గ్రంథమునకుఁ గొన్ని పోలికలు గలవనవచ్చును. కాని బహువిధ భక్తిరస కథాసంపుటియగు కాళహస్తీశ్వర మాహాత్మ్యము కాళహస్తీశ్వరునకే యంకితమైనది. ఆముక్తమాల్యదయందలి సమగ్ర పురవర్ణనాదులు, ఋతువర్ణనలు, మతసిద్ధాంతములు, రాజనీతి బోధనములు మున్నగునవి విలక్షణములై దీని నాముక్తమాల్యద యనుటకంటె రాయల విజ్ఞాన సర్వస్వమని గాని తత్ప్రతిభానికషోపలమనిగాని చెప్పుట యుచితమనిపించును. నామమునుబట్టి యిందలి ప్రధానకథ గోదాదేవి చరిత్రయయ్యు నది శ్రీ రంగనాథునకు సంబంధించియు శ్రీనివాసున కంకితమగుట యొక విశేషము. దీని యుత్పత్తి క్రమమే వేఱు.

కళింగదేశ విజిగీషామనీష దండెత్తి పోవుచు నాంధ్రవిష్ణుని సన్నిధి భీష్మైకాదశి హరివాసరోపవాసమున్న యీ రాయలకుఁ గలలో నాంధ్రవిష్ణువు కనిపించి ప్రశంసించి తుద కిట్లనియెనట.

ఎన్నిను గూర్తునన్న విను
మే మునుదాల్చిన దండనిచ్చు న
ప్పిన్నది రంగమందయిన
పెండిలి సెప్పుము మున్నుగొంటి నే
నన్నడదండ నొక్క-
మగవాఁడిద, నేను తెలుంగురాయఁడఁ
గన్నడరాయ యక్కొ-దువ
గప్పు ప్రియాపరిభుక్త భాక్కృతన్.

తెనుఁగురాయలు కన్నడరాయలను గథ చెప్పుమని కోరినాఁడు. ఆ కథ యరవదేశమందలి శ్రీరంగనాథునిది. అంకితము మాత్రము తన యిష్టదైవము వేంకటపతికిమ్మనెనట. అతఁడు మాత్రము నేనేగదాయని బలికెనట. ఇటులనుటలో ద్రవిడాంధ్ర కన్నడ దేశీయుల కందఱకు, నిలువేల్పున కిచ్చినట్లయినది. వారెల్లరు రాయల ప్రజలేకదా. ఆ ప్రజలే రాయలును. తెలుఁగు కావ్యముగా మన తెలుఁగుదేశమున వెలసిన స్వామి కిడుట తెలుఁగురాయల ప్రేరణమునకేగాక, కన్నడరాజ్య రమారమణుడయ్యుఁ దెలుఁగువాఁడగు రాయలకు ధన్యత నొనగూర్చుట యగుచున్నది. ఇందొక ప్రశ్నకలదు. తెలుగురాయలు గోదాదేవికథనే యేల చెప్పుమనెను. సమాధాన మందే కలదు. అది యిది. "మున్నుగొంటి నే నన్నడదండ నొక్క- మగవాఁడిద" ఇట శ్రీకాకుళస్వామి భక్తగాథ యొకటి అనుసంధేయము. దాని సారాంశమిది. ఆంధ్రవిష్ణునిపూజారి బ్రాహ్మణున కొక వలపులసానికలదు. అతఁ డామె యందలి మక్కు-వ పెక్కు-వ దేవళమునందలి పూవులన్నియు నెత్తులు కట్టి మున్నుఁగా దన ప్రియ నలంకరించిన వానినే పదపడి స్వామికి కైంకర్యమున కుపయోగించుచుండెను. ఒక సమయమున నానాటిప్రభువు స్వామి సేవింపవచ్చి పూజారి యొసంగిన ప్రసాద కుసుమములఁ గేశములు గాంచి కోపించి యాతని

శిక్షింపదలఁచుటయు, నాపూజరుఁడు స్వామికి కేశములు గలవని బొంకి, వాని విదర్శనమునకు రాజు కడ నవధికోరి స్వామి చరణములపైఁబడి యాక్రోశించెను. స్వామి కనికరించి తన కేశవత్త్వమును స్పష్టపరిచెను. రాజు సందేహించి వాని నాకర్షింపఁగా స్వామి శిరమునుండి నెత్తుటితో నవి వచ్చెను. ఆ రాజు స్వామి మహిమ కచ్చెరువంది క్షమాపణము వేడి పూజారిని గౌరవించెను. ఈకథ నేటికి నిచటి వారు చెప్పుకొందురు. ఇట్టి కథ పలివెలలోని కొప్పు లింగేశ్వరుని గూర్చియు గలదు.

రాయలవా రచ్చటకు వచ్చినప్పుడు అచటివారు స్వామిమహిమఁ దెలుపుచు నీగాథ దెలిపియుందురు. ఆ ప్రభువునకు స్వామికిఁగల భాగవతాభిమానము విస్మయపాటొదవించి సాదృశ్యధర్మమున గోదాదేవి కథ స్ఫురణకువచ్చినది. రంగనాథుఁడు ప్రియాపరి భుక్తభోగి. ఆంధ్రవల్లభుఁడు భక్తప్రియా పరిభుక్త భోగి. తన యిలువేల్పగు వేంకటపతియేనా తక్కువ? ఇట్టి తన రసికత ధ్వనింప నాకథనే తన స్వామి కంకితము జేయుటతో రాయ లాత్మనివేదన మొన రించుకొన్న ట్లయినది. భాగవతులు భగవత్స్వరూపులే గావున తత్సేవకొనర్చిన వేశ్యయందు దోషము లేదు. ఇంచుమించు తొండరడిప్పొడి యాళ్వారుల వలె నితఁడు స్వామిచే ననుగృహీతుఁడైనాఁడు. మఱియును, గుపితయై తన సన్నిధినివిడిచి దూరముగా నున్న యలమేలు మంగమాంబను నిత్యము నర్ధరాత్రముల నుపలాలించు వేంకటేశ్వరస్వామికీ కథను సమర్పించుటలోని రాయల భావమును గమనార్హము.

ఇందాంధ్రవల్లభుఁడు శ్రీరంగమందయిన పెండ్లి వర్ణింపుమనగా రాయలు గోదాదేవి వివాహమును విల్లిబుత్తూరులో వర్ణించినాఁడు. స్వామి చెప్పినది యొకటి, యీయనచేసినది యొకటియు నైనది. శ్రీరంగమున స్వామి గోదాదేవిని గ్రహించినను బెండ్లి బ్రహ్మరుద్రాదుల రాకడలతో మహా వైభవముగా నామె జన్మస్థానమగు విల్లిబుత్తూరులోనే జరిగినది.

విష్ణుచిత్తుఁడగు రాయలవారే యీ యాముక్త మాల్యదా జనఁకుడగుటచేత సాక్షాత్తు శ్రీరంగనాథుఁడే యల్లుఁడైనను తన రాజనమునకు భంగమురాకుండ దనయింటనే కన్యాదానముఁ గావించెను. ఆ గోదాదేవి యాముక్తమాల్యద యైనదియు విల్లిబుత్తూరులోని మన్నారునకేగదా. కావున నిదియు స్వామి యాజ్ఞలోనిదే.

ఇందలి కథలు భిన్న భిన్నములై ప్రధానకథా రసవిచ్ఛేదము కలిగించుచున్నట్లు దోచును. కాని యివి యస్థాన ఘటితములు గాక సుసంపన్నములే యయియున్నవని నేను తలంతును. వానిని సమన్వయ మొనర్చుటకుఁ బూర్వము రాయలొనరించిన 'యనంతుని స్తుతి నొకింత వివరింతును.

"సిరినొక్కుపప్పుకు కన్మొఱంగి
హరి దన్వేరం బ్రహర్షించు ను
ర్వరకు న్వంచనగూడ గాఁగలుగు
భాస్వచ్చంద్రశాలాపరం
పరలయ్యేం బఱపైన యెవ్వని
ఫణాపంక్తుల్ భజింతు న్నిరం
తరముం దాంతుని నయ్యనంతుని
నతీత బ్రహ్మకల్పాంతునిన్."

సిరిని మోసగించి యుర్వరను (సర్వసస్యాఢ్యను) బొందుటకు శ్రీహరికి యెవని పడగలు చంద్రశాలా పరంపరలయ్యెనో యట్టి యనంతుని భజింతు నను చున్నాడు. సిరిని మోసగింపనేల భూమి ననుగ్రహింప నేల యనుచో, తన దాక్షిణ్యమును శంకించియో, తన సర్వ ప్రియాధికతను దెలుపుటకోయన నిత్యానపాయినియై హృదయముననే లక్ష్మి వసియించి యున్నను నిత్యము పాద సంవాహన మొనర్చు విశ్వంభర ననుగ్రహించుట తనకు విధిగావున నట్లు మోసగించె ననవచ్చును. హరి యిట్లు భూదేవి ననుగ్రహించెననుటకు బ్రమాణమేమి? ఆ భూదేవి యెచ్చట నున్నదియను శంక గలుగును. భూదేవి శేషుని పడగలపైననేగదా యున్నది. మఱియు పడగలయందు విష్ణుపాదములు ప్రస్ఫుటము లగు

చుండగా, హరి యట్లు చేసెననుటకు సందియ మేమి గలదు.

ప్రకృతమున గోదాదేవి భూదేవి యవతారము. ఆమెను విష్ణుచిత్తుఁడు శిరమున ధరించి పోషించెను. శ్రీరంగనాథుఁడు దేవి సన్నిధియందే తన దేవళమున నామెను గారవించెను. పాండ్యరాజాస్థానమున విష్ణుచిత్తుఁడు ననంతముఖముల నుపన్యసించెను. దాంతుఁడగు ననంతునియందు విష్ణుచిత్తుఁడు ప్రస్ఫుటముగా కనుపించుచున్నాఁడు. కావున నీ స్తుతియందు కథా వస్తువు ప్రస్ఫుటముగా ధ్వనించుచున్నది.

విష్ణుచిత్తుని వర్ణించిన ప్రథమాశ్వాసములోని గద్యను పరిశీలించినచో నందు రాయల స్వరూపము పరిస్ఫుటముగా గమపించును. మఱియును, నాముక్తమాల్యదను స్వామి కర్పించుటయందును రాయలే కనుపించును. విల్లిబుత్తూరులోని మన్ననారు, పాండ్య రాజును వైష్ణవునిగా నొనరించి వచ్చిన విష్ణుచిత్తుని జూచి దేవితో సీతఁదొకఁడును యామును దొకడును మన్మతము నుద్ధరించిరనిచెప్పి, యామె యడుగగా యామునాచార్య చరిత్రనుఁ దెలిపెను. ఆముని పాండ్య రాజున కల్లుఁడై రంగనాథ దర్శనమున బూర్వజ్ఞానము నంది తనయునకు రాజ్యము నొసంగుచు దీర్ఘమగు రాజనీతి నుపదేశించెను. ఇందు రాయలు సర్వత్ర గోచరు డగుచున్నాఁడు. విష్ణుచిత్తునకు యామునాచార్యునితో సామ్యము చెప్పుట వలన, వైష్ణవమతాభిమానియగు రాయలు వారిరువురియందు ప్రతిబింబించుచున్నాఁడు.

పెరియాళ్వారు, (విష్ణుచిత్తుఁడు) పాండ్యరాజు సభలో వివిధ మతవాదముల ఖండించి, విష్ణు పారమ్య బోధకముగా నాతని కుపదేశించిన ఖాండిక్య కేశిధ్వజ సంవాదమున బ్రహ్మజ్ఞానియు భక్తియోగ నిష్ఠాగరిష్ఠుడునగు కేశిధ్వజునియందును రాయలే గాన్పించును. కాగా నిట్లు సకల విశిష్టాద్వైత సిద్ధాంతము లెఱింగి తదనుష్ఠాన పరుండగు రాయలు పరమ భక్తియోగంబు పెంపున సర్వశేషియగు నారాయణుఁ వకుఁ దాను శేషరూపమునొంది, తన విష్ణుచిత్తతను అనంతత్వమును, ననుసంధించుచుఁ, బెక్కు వర్షములు, శరత్తులు కడపి కడపి యొక వసంతమున నాముక్తమాల్యదనుఁ గాంచెను. ఇందు మన్ననారు ననుగ్రహము సంపాదించుటకుఁగా గావించిన తపమే ప్రథమాశ్వాసమున సంకల్పితమై, ద్వితీయమున గ్రీష్మమై, తృతీయమునఁ బ్రహ్మజ్ఞానబోధనమై, తురీయమున యామునాచార్య సామ్యము ననుగ్రహించి వైష్ణవమత ప్రచార వర్షాధారమై పండు వెన్నెలలు గాచి దిగ్విజయ మొనర్చి రాజపంబోధన మొనర్చి, తుదకు వసంతమున, దరణోపాయ దర్శనియు, జ్ఞానాకృతియునగు గోదాదేవియను బుత్రికనుఁ బ్రసాదించెను. ఇందితఁడు కవికుల గురువగు కాళిదాసుని వలె ఋతువర్ణనము, గ్రీష్మముతో నారంభించి వసంతముతో కల్యాణాంతముగ ముగించినాఁడు. గోదాదర్శనమైన వెనుక, హేమంత, శిశిరములకుఁ దావులేదు. ఆమె చరిత్ర నిత్యవసంతము.

ఇప్పటి కైదవయాశ్వాసము మొదలిడినది. ఇంత దనుక కథానాయిక జనకుఁడగు విష్ణుచిత్తుని చరిత్రమే బహుభంగుల నిరూపితమైనది. ఇక నీ వసంతమున నాముక్తమాల్యద పెరిగి జవ్వనియై మధుర కవితా స్వరూపము ధరించి శ్రీకృష్ణవిరహిణియైనది. పూర్వ జన్మమందలి తన సత్యభామాత్వమును స్మరించినది. ఇట్లు విజృంభించి మిన్నుముట్టిన విరహమున స్వామి యందు లగ్నాత్మయగు నాముక్తమాల్యదా మన స్స్వరూపము, తండ్రియగు విష్ణుచిత్తుఁ డెఱుఁగ దయ్యెను. ఆదాంతుఁడా శృంగారము నొక భక్తిమయ తపస్సుగనే భావించి దానిందెలియ వేడి తన మన్న నారునకు నివేదించెను.

ఇటనుండి యారవ యాశ్వాసము ప్రారంభమగు చున్నది. ఇందు స్వామి విష్ణుచిత్తునకు సమాధానముగా మాలదాసరి కథ జెప్పి గోదాదేవి భూదేవి యవతార మని వివరించి, యామె యాముక్తమాల్యదాత్వమును విశదీకరించి, శ్రీరంగమునఁ దన్ను సేవింప నామెను దోడ్కొనిరమ్మని పంచెను.

ఇట నొక్కమాట వచించెదను. ఆముక్తమాల్యద యెచట లభించినది ? విల్లిబుత్తూరులోని యుద్యాన వనములో గదా ; ఆ యుద్యానవన మెట్టిది ?

"ఒకనాడామ్రాంకురౌఘంబురుకు
    సుమకుడంగోదరశ్రేణిఁదల్ప
ప్రకరంబై కాంతచే మున్నతులఁ
    బదరి పై ప్రౌఢివాటించి విట్టూ
ర్పెకదొట్టిణ దన్ని వీరాయితమతి
    మతి తారెల్లమున్నట్లయౌ నా
యికలంగందర్పుదోటంబెటిఁగి
    తతిమివీపేసెనా నంటుతోటఁ"

ఇట్టి తావున దొరకిన బాలిక యెట్టిది కావలయును. యెట్టిదయినను గణ్వుఁడు శకుంతలనువలె, యజ్ఞ భూమిని సీతను జనకుఁడువలె విష్ణుచిత్తుఁడామెనుగని పోషించి, పెంచినాఁడు. ఆమె యెట్టిది కావలయునో నట్టిదేయైనది. కాక భాగవతులకుఁ గులభేదములేదు. భక్తిజ్ఞానాది గుణవిశిష్టతయే ప్రధానము. దానికి నిదానము మాలదాసరి. అయ్యును రాయలకు వర్ణాశ్రమ ధర్మముల గౌరవము మెండు. కావుననే దాసరి గీతా శ్రుతిఫలమున బ్రహ్మరక్షస్త్వముపోయిన యా సోమ శర్మ నేరుగా భాగవతోత్తముఁడుగాక యుత్తమ విప్రుడైన పదపడి భాగవతుఁడయ్యెనట ; ఈ కథనే స్వామి వరాహావతారమున భూదేవికిం జెప్పుటయు, నామె గోదాదేవియై యవతరించి, మహా ఫలదాయిని యగు, విరహగీతికాగానము నెపంబున, స్వామిని సర్వదా సేవించుటయును వివరించుటగా గోదాదేవి పూర్వజన్మ వృత్తాంతము, విస్పష్టపఱచినాఁడు. ఈ సోమశర్మ కథ సప్తమాశ్వాసమునఁగూడ నున్నది.

వెంటనే విష్ణుచిత్తుఁడు ఆముక్తమాల్యదతో శ్రీరంగమున కరిగి రంగనాథుని దర్శించినాఁడు. స్వామి యా విరహిణీరూపము నాపోవని చూపులఁ జూచిచూచి తుదకు శుద్ధాంతసీమఁ జేర్చికొనినాఁడు. తనయం దేకాగ్రలగ్న చిత్తముననున్న విష్ణుచిత్తుఁడు కైంకర్యావసానమునఁ గలిగిన తెలివిఁ దన తనయను వెదకికొనకుండ నొక మాయావధూటినట సృష్టించి నాఁడు. అతఁ డామెయే యాముక్తమాల్యదయని యెంచి, యింటికేగి పల్లకితలుపుఁదీసి చూచుసరికది శూన్యమైయుండెను. ఈ కల్పన మెంత విచిత్రము. ఎంత గంభీరము. ఎంత సముచితము.

పెరియాళ్వారు తనమతిసర్వస్వము నారాయణునం దర్పణము నిత్యము సేయుచున్నాడు. నేడది స్వామియందే లీనమైనది. అదియ తన వాంఛితమును. అయినను, పూర్వపరిచితానుభూతిబలమున నది వేఱుగా దనకు గన్పింపనంతవఱకు మఱలఁ బ్రాకృతుఁడై స్వామిపై నేరమువెట్టి యాక్రోశించినాఁడు. పరమేశ్వరునకుఁగూడ భాగవతుఁడగు నీ పేదమామగారికిఁ జంకక తప్పలేదు. మీ బిడ్డ మీ యింటనే గలదు చూచికొమ్మని నమ్మబలికి పంపి యామెను ముందయచటికిఁ జేర్చి బ్రహ్మాదులచే బెండ్లిరాయబారమంపి మామ కోరిన ప్రకారము విల్లిబుత్తూరుననే నామెను పాణిగ్రహణ మయ్యెను. ఆముక్తమాల్యదారసజ్ఞుఁడగు స్వామి యామె తండ్రి యగు నా పరమభాగవతునకు వశంవదుఁడై యుండక తప్పునా ?

రాయలిట్లు విష్ణుచిత్తుఁడై కేశిధ్వజుఁడై యామునాచార్యుఁడై దాసరికథవలన, బూర్వవృత్త మెఱిగిఁ యాముక్తమాల్యదా స్వరూపయగు తన యాముక్త మాల్యదను శ్రీనివాసున కర్పించి చరితార్థుఁడయ్యెను. గోదాదేవి జనించిన యా తోట నొక స్రగ్ధరావృత్తమున వర్ణించినాడు. ఇచట నీవృత్తమును బట్టియే గోదాదేవి జీవితము సూచితమగుచున్నది. కేవల మీ పద్యమునే గాక ప్రథమాశ్వాసములోని విల్లిబుత్తూరు పురవర్ణనము నంతయు నిట ననుసంధించికొనవలయును. అట్లు గావించినచో నామె జన్మస్థానమునందలి పవిత్రత ప్రత్యక్షమగును. చరిత్రశుద్ధియే జన్మవిశుద్ధిని స్పష్టపఱచును. ఈ విషయమును ప్రమాణాంతరమున ఋజువుపరచుటకుకూడ మాలదాసరికథ యిందు సుఘటితమై యున్నది. అతఁడు చండాలవాటిక యందు జన్మించినను బరమభాగవతుడు. ఆమె పరమ శృంగార బహుళమగు నుద్యానమున జనించినను,

భగవదేకనాయిక. మహా భాగవతురాలు. అచటి యరటి గెలలపై తమ పెరుమాళ్ళకర్పింపనెత్తిపట్టిన బొందు దోమాలియలు. అంతియకాదు. ఆయుద్యానమే యొక స్రగ్ధర. అనగా మాలికాధారిణికావున గోదాదేవియు నట్టిదియే యైనది.

ఆముక్తమాల్యదకు విష్ణుచిత్తీయమను నామాంత రము ప్రసిద్ధము. విష్ణుశ్చిత్తే యస్య ; విష్ణోః చిత్తమ్; విష్ణురేవ చిత్తమ్ ; అని ముప్విధములుగా విష్ణు చిత్తపదమునకు విగ్రహము చెప్పవచ్చును. ఇవి యన్నియు నించుమించు సమానార్థకములేయయ్యును కడపటి విగ్రహమునే రాయలు తలంచియుండును. అదియే యాతని యభిమతము. ఆతని నధికరించి వలికినది గావున నీ గ్రంథము విష్ణుచిత్తీయమగు చున్నది. ఈ పేరునుబట్టి పరికించినచో నిందలికథలు పరస్పరానంబద్ధములను శంకకు తావేలేదు. కాని రాయలు దీని నాముక్తమాల్యదయనియే యాశ్వా సాంతములందు బరిస్ఫుటముగా వక్కాణించినాడు.

ఆ విష్ణుచిత్తుని సర్వస్వ మీ యాముక్తమాల్యద. అది బహుజన్మ తపఃఫలము. అట్టిఫల మావిర్భవించి తనకుదాన భగవదంకితమగుటయే సిద్ధి. ఆముక్త మాల్యదయే జనింపనినాడు విష్ణుచిత్తు డెట్టివాడైన దియు నెవ్వరును బరికింపరు. ఏలయన నతని బోలు వారు పలువురు గలరు. ఆమె యితఁడు గడుపున గన్న కూతురుకాదు. మఱి వాసనాబలమున లభించి నది. అనగా నట్టి జ్ఞానసంపత్తి యితని యుపజ్ఞకాదు. అది యనాదిసిద్ధము. పుణ్యవశమున నాతనికి లభించి నది. ఇందలి ప్రధానవిషయ మదియే కావున రాయలు దీని నాముక్తమాల్యదయనియే వ్యవహరించెను.

కవులు తమ కావ్యకథాపాత్రములఁ బ్రతిబింబిం చుట యెట్టు లనివార్యమో తత్తత్కృతిపతులు నాయా కథానాయకులయందు బ్రతిబింబించుటయు నట్టిదియే. దీనినిబట్టి చూచినచో మనుచరిత్రమునందు బ్రధాన ముగా రాయల భౌతికజీవితమును, ఆముక్తమాల్యద యం దాతని యాధ్యాత్మిక జీవితములును వ్యంగ్యము లగుచున్నవి. భౌతిక జీవితమును స్వయముగా వ్రాసికొనవచ్చినను, నాధ్యాత్మికవిత జీమితరులు వ్రాయవలవికానిది. కావున మొదటిదానిని దన యాస్థాన కవీంద్రుఁడగు కవితాపితామహున కప్పగించి రెండవదానిని రాయలే స్వయముగా నిర్వహించెను. సంస్కృతమున బెక్కు గ్రంథములు నిర్మించుటయే గాక సకలకథాసార సంగ్రహమును రచించిన రాయలు అఖిలపురాణాగమేతిహాస కథార్థస్మృతి యుతుఁడగు నంధ్రకవితా పితామహునకు స్వారోచిష మనుసంభవము నెన్నికచేసి భవచ్చతుర రచన కను కూలమని చెప్పుట పరిశీలించినచో నిది స్పష్టము కాగలదు. పెద్దన్నయు *ప్రాజ్యతత్కథానాయకరత్న* మగు రాయల వంశము నారంభించుటయు దీనికి దోహద మిచ్చుచున్నది. స్వరోచికివలెనే రాయలకును ముప్వురుభార్యలు. రాయలు గజపతినిజయించి యాతని పుత్రిక నన్నపూర్ణాదేవిని పెండ్లియాడినయట్లు స్వరో చియు రాక్షసరూపముననున్న గంధర్వు నోడించి యాతని పుత్రికను మనోరమను పెండ్లియాడెను. ఇది ప్రధానకథ. కావున రాయల జీవితము లక్ష్యముచేసి యన్వయించినచో నాముక్తమాల్యదయందలి కథల వలెనే మనుచరిత్రకథలకును వస్త్వైక్యము సిద్ధించును.

మనుచరిత్రమునందలి కథలకన్న యాముక్త మాల్యదయందలి కథలు విడివిడిగా కన్పించును. ఇది బాహ్యదృష్టికిమాత్రమే. విష్ణుచిత్తుడు, కేశి ధ్వజుడు, యామునుఁడు, మాలదాసరి, నామరూపా దులచేత భిన్నులును, కాలముచేత సుదూరఘటితులు నొక క్రమమున లేనివారయ్యును వారు సాధించిన విషయమొక్కటియే. అనన్యమగు భక్తి యుపాసన లేని కేవల శాస్త్రజ్ఞానము వ్యర్థమని సూచించుటయే యిందలి పరమార్థము. వారల యా భక్తిసంపత్తియే యాముక్తమాల్యద. కావున దాసరి చరిత్రవలెనే కేశి ధ్వజ చరిత్రయు, యామున చరిత్రయు గోదాదేవి చరిత్రకు పోషణము నొనర్చుచున్నవి. ఖాండిక్యుఁడు తన్ను జయించిన సోదరుడు మఱల దన రాజ్యమును దన కొసంగినను దానిని గ్రహింపక యతనివలన బ్రహ్మజ్ఞానమునే యర్థించి పొంది, రాజ్యమును

సుతునకొసంగి తాను భక్తిప్రపత్తి రాజ్యమును స్వీకరించెను. యామునునకు శ్రీరంగనాథ దర్శనమున నట్టి సిద్ధి లభించినది.

భిన్న కాలసంఘటితములయ్యును నియ్యతి వృత్తములనెల్ల నొక్కచోఁగూర్చి నామాదులచే నవియెంత భిన్నములో వస్తుస్థితినిబట్టి యంత యభిన్నములనియు నట్టి జ్ఞానసంపత్తి నిత్యమనియు నిందు నిరూపించుటలో రాయలు సర్వతోముఖముగాఁ దాన విరాజిల్లుచున్నాడు.

బహుముఖములగు నిందలి వర్ణనములన్నియు నుభయ విషయమునకు సాధకములేయగుచు శ్రీకృష్ణ రాయల సకలానుభూతులం దుపనిబద్ధములయి పరమేశ్వరార్పణమునఁ జరితార్థత నందుచున్నవి. మఱియు గోదాదేవి భూదేవి యంశయగుటచే నిందలి వర్ణనములన్నియు నామె సౌందర్యగుణవృద్ధి సూచకములయి కృతార్థత నందుచున్నవి.

సోమసుందర్

# సోమరసం-సుందరకాండ

[ అ ష్ట మి ]

ఏమిటి 'సో. సూ', సతతం లోలోపలి లోచనాల
తెరచి, వెరపులేకుండా తరలించెద వాలోచన-
లనవరతం నీ నయనాల్ లలితమసృణ దృక్కులల
బరపి, మరపులేకుండా లోకపు చీకట్ల-
కట్ల కంటకాల కాల్చనేల ?

భయాల పోకార్చి పుడమినయాలు మొలిపించునటుల
నీ తప మ్మదేలనోయి ? దుర్దశతుహినాలపైన
నీ తపమ్ము లేలనోయి ?
కవిగా శితాంశుదయ్యు
నీవుకూడ రోషార్చుల క్రక్కుటేల ?
ఏలనోయి సోసూ ? మరి తెల్పుము నీదుజాడ !

చక్కని చల్లని వసుమతి గుండెలపై తలను వ్రాల్చి
మక్కువ చూడ్కుల నిగిడ్చి, ధ్యానముద్రఁగాయమార్చి
ఏదో చూస్తూ వింటూ విశాంత భక్తిభావనతో-
అధోజగతి అడుగుపొరల బాధల గాధల వినెదవు ?

అక్రమాల విక్రమాల-సంక్రమణం వీక్షిస్తూ-
కనుకొలకుల క్రమ్ముకునే చెమ్మతుడిచి శ్రవణిస్తూ,
యోచిస్తూ, క్షణాలు ఘడియలు దినాలు ఆయనాలు
దొర్లిస్తావేలనయా సోసూ ?- నీ తలపుల
మరలిస్తా వెందులకో నఱకెలకుల .. ?

* * *

పృథ్వీ సంగీతము నేననవరతము వింటున్నా ;
వింటున్నా శ్రవః పేయ మహాజ్ఞాన ప్రణవధ్వని
ఎల్లలోక మెల్లగ వ్యాపించి, మెల్లమెల్లగ నా
హృద్విపంచి సోకి, శోకరసము ఢుంచి,
కాలవ్యవధులడంచిన-పూతగీతికారవమ్ము ;
అమర మాధురీస్వనమ్ము-వింటున్నా నిరంతరము
నిరంజనము, నిరాపేక్ష నిరామేయ సుస్వరమ్ము !
పంచేంద్రియ పమాశ్లిష్ట పరాశక్తి శాబ్దికమై-
నా తనువున వలుగడలను మొరసిమొరసి తరగలిడును;
కమకనె నాసర్వస్వము సంగీతము ప్రసరించును.

కంటున్నా సతతము వాసంతసమాగమ హాసము,
కాలయోష కబరీ సంపుల్ల మల్లికాజాలము ;
నీల గగన దేహములో పొడము పులకలను కందును ;
మహావేగమై పారే కాలవాహినీ తటమున
ధ్యానమగ్న మానసమున ఆసీనుడనై విందును ;
నా శిరోజముల జడలను చిక్కిన అశ్వత్థపత్ర
సముచయమ్ము
సుందర సురుచిర శోభాస్నిగ్ధరవము లురలించును !

వసుధ నాల్గు చెరగులలో చెలరేగే మానవ సం
గీత లసత్తరంగాల నొకేధారగా, లహరిగ
ప్రవాహముగ నొనరించును ! వినిపించును-
భూతకాల జీవిత మధుస్వప్న రవళి....
వినుచుందును వర్తమాన మానవోజ్వలోద్గీథను....
వినిపించెను భావినరావేశ రవము,
భావనోత్సవానందము !

ఇపుడే, ఈక్షణమందే, సన్నివేశస్ఫూర్తిలోనె-
నీరవ నిశ్శబ్దత మోరాశిలోనె-ఈ ముహూర్త
మస్మదీయ ఆర్తహృది కనుగ్రహించు-
దివ్యగీతికాశీధువు, నీరవరవశీధునిగా
నెడద నెదో గీతి కెరలు; కదలి కెరటమేదో కదలు !

వసుంధరా లలామ మొక సుందర సంగీత రసము
పుంజిత కాంతిసింధువు, నైశ్శబ్దిక లయాన్విత
సముచ్ఛ్వాసము ; సముత్సాహ భువనోత్సవ
మయూఖమ్ము !

జీవితమున కొకే ఒక్క దివ్యదివస సాక్షాత్కృతి !
నరుని పవిత్రాంతరంగలోచనమున కొకే
వీక్షణమ్ము సుమా ! ఒకే సత్యసంవేద్యము !
సద్దులేని నడిరాతిరి వినగలిగే దొకే ఒక్క విశ్వగీతి !
జనతావిర్భూతగీతి ! కరుణా సంపూర్ణద్యుతి !
జన్మాంతర హృదయోద్భవ రాగోజ్జ్వల రహస్యమ్ము !
స్వయం ప్రకాశమ్ము-సత్యసార సంగీతము !

జగజ్జనత గళన్మధుర వికచభాషణ మ్మొకటే-
జీవన ధాతువుల భాష, సంగీత కుసుమలాస్యహాస ।
పుడమి ఉద్భవించిన తొలినాటి చరమ సంధ్యలోన
సుప్త జీవజాలములో నిశ్చేతనమైన భాష ।
ఒక వేకువ, ఒక్క వెలుగు, ఒక మేలుకువ-రంగరించి
చైత్రద్రుమసుమశాఖల నవజాగృతి సంతరించి
శుకపికశారికల కలల కిచురింతల నిచ్చగించి
ఒకేఒక్క కదలికగా, వెలువడు చైతన్య
మహో త్తేజముగా
రూపొందిన మానవ సముపార్జిత సంపదల మూస ।
నరజాతికి మహాశక్తి ప్రదాతగా వర్ధిల్లిన దమరభాష ॥

ఎడద లదరు కదలికగా, చగలప్రిదులు నలజడిగా
కడలి మెడలు రిక్కించిన ఉప్పెన కెరటమ్ములుగా,
అహరహయాత్రావలంబి దివాకరుని కిరణముగా,
చీకటి ప్రాకులను కూల్చి హఠాత్తుగా విజృంభించు
ఉషోబాల దీప్తులుగా, హృద్దవానలార్చులుగా,
వార్షుకాభ్ర మెల్లెడలను కప్పిన మబ్బులగమిగా,
వడివడిగా పుడమిపడిన కుండపోత జడివానల,
మెరపుల, పురుముల, పిడుగుల, విలయ
తాండవోద్ధృతిగా,
గ్రీష్మతపతప్తమైన క్షేత్రలక్ష్మి యొడలు తడిసి
విడిచిన గోర్వెచ్చనైన సుఖోచ్ఛ్వాసహాసముగా,
పయఃపూర్ణ నదీనదాల్ పరుగువారు వరదలుగా,
విశ్వ మహాచైతన్యము భాసమాన కోశముగా,
ఉద్భవించి, మానవ సంభాషణమై, మారుత
సంగీతమవగ,
నా హృదంతరమ్మనిశము కర్ణపుటాల్ విచ్చి గ్రోలు ।

జాజ్వల్యమానమైన సజీవాగ్ని శిఖల పరుగులవలె
భూవదనపు హాసరేఖకై వడి వడిగా నడిచే
మానవు డొక మహాశక్తి । అతని జీవసంగీతమె
అద్భుత కావ్యోత్సవమ్ము । వసుమతి యొడిలో దాగిన
మానవమాత్రుని హాసము-సమస్తావకాశాలకు
దిద్దిన తిలకమ్మె యగును । ...

నదీతీర భూములలో, కొండచరియ లోయలలో
మరకత మాణిక్య ఖచిత శాద్వల సీమలలోనో-
నగరోద్యానవనాలనో, సితసైకత తటాలనో-
పాదచారియైన నరుడో, గజారూఢుడైనవాడో,
దిసమొలతోనో, లేదా-రత్నాంబరధారిగానో,
నేటివాడో, నిన్నటివాడో, రాగల కాలపు నరుడో-
ఎవడైనా-మానవు డాలాపించే సుందరమోహన గీతులు
కాల దూరపరిధుల కడతేరి నాకు వినిపించును ।
సుమమరంద విష్యందపు తొలకరి జల్లులమాదిరి,
వానకారు మొయిళ్ళ పూయెలల రీతి,
ఆర్ద్రకపోలాల మెరయు యువతీ కోమల హృదయపు
కరుణామయ భావ మటుల, రాగతరంగముల భాతి,
పృథ్వీ సంగీత మ్మనవరతము నే వినుచుందును.

* * *

తరునికుంజ సుమ శీతల ఛాయా సైకతములందు
మరపు బరువు దుకూలాల సవరిస్తూ వాహ్యాళికి
ఆసీనుడనైన శుభ్ర సాయంసమయాన విందు-
శత సహస్ర కంఠ రవా లొక్కటిగా మేళవించి
సువర్లోక సంగీ తోత్సవ స్వనా లీనుచుండ ।

మహా ప్రళయ వీచీ సంభృత క్రీడ గవిసినటుల
అమర మానవోత్సవ మొక యింద్రజాలమై తోచును

మానసికానంద మధుర భావనలూరే తరిలో
అవ్యక్తానందము పెంపెసలారగ, హ్లాదమనోభావనలే
బుసబుస పొంగించు నెవో విషాద భావాలు మదిని ।
నేను వినే సంగీతము నేత్రయుగళి ప్రమోల నిలుపు
మహా మానవాత్మను, నిర్మల రమణీయాకృతి....
ప్రకృతి మాత తన సృజనల, ప్రతిభామయ స్వరూపాల
మానవాత్మ తేజముతో మేళవించు నెందులకో ।
పచ్చని యౌవన కాంతుల పరగు లతా గుల్మములో

కెంపుల పూగుత్తు లసంఖ్యాకముగా ప్రేలవేసి
మురిసె వలపు చిరునవ్వుల రాధికా మనోహరమ్ము ।
మాలతీ లతా వధువదె సురభిళ స్తబకాల దాల్చె॥
ప్రకృతి మాత ప్రసవించిన ప్రసూనాలు సమస్తమూ
సాయం పవనాంకురాల మెసవి హాయిగొన్నవాహో ।
స్మేరవదన జగజ్జనని వినిపించే పవిత్ర సంగీతరవము
నా వలెనే ననలుకూడ గ్రోలి కైత మత్తుగొనెనా ?

అగణిత ఖగసంతతి నా చుట్టూ గుమికూడుచు
ఎగసిఎగసి తూలుచు, గెంతుచు, సుకుమారనాట్యమాడుచు
మాటల పాటల సుస్వర పుంజాలను విసరుటేల ?
ఈ విశుద్ధ భావనా విశేష మెరుకబడ దదేల ?
కాని విహగ సముచయ విన్యాస భంగిమల తోచును
ఆనందాబ్ధిస్ఫూర్జిత నవోత్తుంగ తరంగాళి ।

నా వలెనే జగద్గీత కీ భాగాలు కూడ మురిసి
కరగి పారుతున్నవేమొ! ఓలలాడుతున్నవేమొ!
నేలతల్లి రొమ్ములలో తీపుల గ్రోలగ మరగిన
చిన్ని మొక్క లెన్నొ చిగురుటాకు లెత్తు సురటీలుగ;
మారుతాల నాలింగన మొనరించగ యత్నించును.
ఈనుతార చెయిదాలకు - అస్మదమలహృదికివలెనె
పృథ్వీ సంగీత కల్పతరు సమీర మిచ్చెనటో
తీరని పిపాస, సుహృద్దివ్య శక్తి, సదారక్తి!!

నాకలోక రహస్తీర భూముల నుం డరుదెంచిన
సదమల విశ్వాసమొందు పుడమి జీవులకు కలిగే
ఉత్తమ ప్రయత్నమ్మును ప్రకృతిమాత తలపెట్టెనా!
కాక, ప్రతి జీవశక్తి ప్రకృతి సంబద్ధమగుట-
కాల చక్రధార యగుట - కేది మూలకారణమో?

జగజ్జీవ చైతన్యము, విశ్వాంతః ప్రాణ రవము-
భూహృదయం ప్రసవించిన లసత్గీత
శరత్ కాంతిలో సతతము - మురియుచేల?
మహాకాల భాస్వత్ కోమల రేఖల
నహరహమ్ము సోలుచేల? సొగయుచేల-
సృజనోత్సవ విజయ దుందుభీ స్వనాల?

* * *

# శ్రావణ భాద్రపదాలు | పి. శ్రీదేవి

దట్టంగా మబ్బువేసిన ఆకాశంలో ఉండుండి తళుక్కున మెరుస్తూంది. చీకట్లు పెనవేసుకున్న హృదయంలో మెరపులాంటి ఆలోచన వచ్చింది. వెంటనే టేబిలులైటు వేసి సొరుగులోంచి కలం కాగితం తీశాను.

"నా జీవితం ఏనాడో ప్రారంభమయింది. అంతం సమీపంలోనే ఉందనిపిస్తూంది. ఈ ఆద్యంతాలమధ్య జీవిత పరమార్థమనేది ఒకటుందా అసలు? ఉంటే దానిని నేనందుకోగలిగానా?" కలం ముందుకు సాగలేదు. ఇదేమిటి? కథ వ్రాయబోతే జీవితకథగా మారుతూంది!

అప్రయత్నంగా అనసూయ ముఖంలోకిచూశాను. ఆమె నవ్వింది. ఆమె ఎప్పుడూ నవ్వుతుంది. నవ్వు తూనే ఉంటుంది. నవ్వదామరి! పండిపోయిన జీవిత వృక్షం ఎండుటాకులు రాలుస్తూంటే!

"జీవితకథ వ్రాస్తున్నాను." అన్నా నామెతో. "వ్రాయండి. ఒక్క మీ జీవితకథ వ్రాస్తే చాలదు. అందరి జీవిత కథలూ వ్రాయండి. మీకథ, నాకథ, శైలజకథ, సుదర్శనం కథ, ఇంద్రాణి కథ - అందరి వీనూ" అనసూయ వట్టి వెర్రిబాగులది. అందరి కథలూ వ్రాయటానికి మధ్య నేనెవడిని? ఎవరి కథలు వారివి. ఎవరి జీవితం వారిది.

ఏమని వ్రాయాలి? ఏమేమిటి వ్రాయాలి?

వర్షం వచ్చేసింది. గాలి జోరు ఎక్కువయింది. కిటికీ గడియలు ఊడిపోయి కిటికీలు తెరుచుకున్నాయి. కిటికీలో పెట్టిన పెద్ద పూలదండ గాలి ఊపుకు దొర్లి వచ్చి నాముందర పడింది. అప్పుడే విరిసిన మల్లెలు, ఎప్పుడో విచ్చుకున్న గులాబీలు, మెరుస్తున్న చెమికీల మధ్య చిక్కుకుపోయి వాసనలు గుబాళించేస్తున్నాయి. నాకావాసనలు అదేమిటోలా ఉన్నాయి. సువాసనలు బాధ కల్గిస్తున్నాయి. ఆ దండ సాయంత్రం సభలో, ముప్ఫయి సంవత్సరాల ఉద్యోగధర్మానికి నన్ను సన్మానితునిచేసిన చిహ్నం. సభలోని సన్మాన పత్రాలు, విద్యార్థులు చూపిన వినయసౌశీల్యం, పూల దండలో గుబాళింపులు అన్నీ నన్నుక్కిరి బిక్కిరి చేశాయి. నాకు బాధనే కలిగించాయి. ఆ బాధే నన్నెక్కడికో తీసుకు పోతూంది. ఎన్నెన్నో మైలు రాళ్ళు. అన్నిటినీ దాటివస్తే నాకేం మిగిలింది?

"ఎందుకలా దిగులు పడతారు? లోకం మిమ్మ ల్నెంత గౌరవిస్తూంది! మీమీద వాళ్ళకెంత భక్తి లేకపోతే ఈదినం మిమ్మల్నంతగా సన్మానిస్తారు? మీదగ్గర చదివిన విద్యార్థులందరికీ మీరంటే ఎంత ఆపేక్ష! మీ పుస్తకాలు చదివి ఆనందించని వాళ్ళెవరు? దేశమంతటా మీపేరు చెప్పుకోనివా రున్నారా, సత్కీర్తి కంటె గొప్ప అదృష్టమేముంది చెప్పండి?" ఎక్కడి నుండో గుండెల్లోకి దూసుకు వెళుతున్నా యీ మాటలు. అనసూయ ఇలాగే మాట్లాడుతుంది. ఇవాళ ఆమె నావక్కనే ఉంటే సరిగ్గా ఇలాగే మాట్లాడేది.

అనసూయ ఉంటే నేనిలా ఎందుకుంటానూ! ఆ పిచ్చిపిల్లకి, ఇప్పుడు నాకు కావలసింది సత్కీర్తీ, సన్మానాలూ, కావు - బహుజనాదరణ, బహుళవ్యాప్తమైన పేరు ప్రతిష్ఠలు, కావని తెలియదు పాపం. అవును మరి! అప్పట్లో కీర్తి కండూతి నన్నావేశించింది. ఒక పక్క ఉద్యోగంలో మంచిపేరు తెచ్చుకోవాలని, కాలేజీలో నేనే గొప్ప లెక్చరర్‌ని అనిపించుకోవాలని; త్వరలో ప్రమోషన్ సంపాదించి ప్రిన్సిపాల్ హోదా తెచ్చుకుంటే ఫలానా ప్రిన్సిపాల్

ఇంతకృషి చేశాడు, ఆయన కాబట్టే ఈ కాలేజీ ఇంత వృద్ధిలోకి వచ్చింది అనిపించుకోవాలనీ; మరొక పక్క సాహిత్యమంటే తగని అభిమతం, రచనా వ్యాసంగంలో తలమునకలై సర్వం మరిచిపోగల్గే పిచ్చితనం - ఒక గంట విశ్రాంతి దొరికితే ఒక కథ వ్రాసి తీరాలి. కాలేజీకి సెలవిస్తే నవల వ్రాసితీరాలి. ఇవే ఆనాటి ఆదర్శాలు. ఇవే అప్పటి జీవితధర్మాలు.

అందుకే అనసూయ అంటుంది. అవన్నీ మీకు లభించాయిగా - ఇంకెందుకూ దుఃఖం !

అవన్నీ లభించాయి. చాలా రచనలే చేశాను. లోకంలో ఉత్తమ రచయితగా ముద్రపొందాను. లెక్కలలో ఇంత గొప్ప లెక్చరరు మరి లేడనిపించుకున్నాను. ప్రిన్సిపాల్ హోదా చాలామందికంటె తక్కువ వయస్సులోనే సంపాదించాను. కాలేజీ విద్యార్థుల విషయంలో నేను తీసికున్నశ్రద్ధ, చేసిన కృషి ఈ దినం నాకిచ్చిన సన్మానపత్రాలు ఋజువు చేస్తున్నాయి. నా దగ్గరే చదువుకుని ఉన్నత విద్యాభ్యాసం చేస్తున్న ఒక పూర్వ విద్యార్థి నా గురించి అనర్గళంగా మాట్లాడుతూ "లెక్కలలో అద్భుతమైన ప్రావీణ్యంగల మన ప్రిన్సిపాల్‌గారు సాహిత్యంలో కూడా అంతకంటె ఘనులవటం ఒక విశిష్టత" అన్నాడు. అవును నేను లెక్కలవాడిని. అందుకే కాబోలు నాబతుకు సరళరేఖలా పొడవేకాని వెడల్పు లేకుండా సాగిపోతూంది.

రిటైరైన నన్ను ఘనంగా సన్మానించింది విద్యార్థి లోకం. ఒకానొకప్పుడు ఇలాంటి దినంకోసం ఎంతగానో ఆశించాను. కాని యిప్పుడు — ఇప్పుడంతా విస్సారంగా ఉంది.

కిటికీ రెక్కలు టపటపా కొట్టుకుంటున్నాయి. లేచి తలుపు వెయ్యబోయాను. కాలికి పూలదండ తగిలింది. మల్లెలు మరింత విచ్చుకుని ఉన్నాయి. గులాబీ రెక్కలు విడిపోతున్నాయి. సువాసనలు నాకు బాధాకరంగానే ఉన్నాయి. అయినా ఆ దండను తీసి అనసూయ చుట్టూ అందంగా అమర్చిపెట్టాను. అద్దం వెనుకనుంచి, అందమైన ప్రేములోనుండి, నవ్వుతూన్న అనసూయ. అనసూయకు మల్లెలంటే తగని ప్రీతి. గులాబీ మొక్కలను పిల్లలకంటె ముద్దుగా పెంచేది.

వేయబోయిన కిటికీ తలుపులు వెయ్యనేలేదు. పెద్ద వానజల్లు వచ్చి కాగితాలను తడిపేసింది. లేచి తలుపులు వేశాను. వర్షం ధోరున కురుస్తూంది. శ్రావణం వెళ్ళి భాద్రపదం వచ్చింది. భాద్రపదమంటే ఎన్నో బరువైన జ్ఞాపకాలు. జ్ఞాపకాలలోనుండి అనుభవాలు — అనుభవాలలోనుండి ఆలోచనలు.

ఒకనొక శ్రావణంలోనే అనసూయ నా జీవితంలోకి తొంగిచూసింది. అవి చిన్నప్పటి రోజులు. ఇంకా నేను చదువుకుంటున్నాను. అనసూయకపుడు పదహారేళ్లు నిండలేదు. ఏదో తగుమాత్రం చదువుకుంది. చదువువల్ల ఏర్పడిన సంస్కారం ఆమెలో లేదు. ఒక సాధారణపు మనిషిగానే నా జీవితంలో ప్రవేశించింది. ఆమె కాపురానికి వచ్చిన రెండేండ్లకే నేను ఉద్యోగంలో చేరాను. మరి రెండేండ్లకే నా మొదటి సంతానం. తరువాత అయిదేళ్ళకి కాని ఇంద్రాణి పుట్టలేదు. పుట్టిన పసిగుడ్డునీ అయిదేళ్ళ సుదర్శనాన్నీ నాకప్పగించి "వీళ్ళను గొప్పవాళ్ళను చెయ్యండి. అంతే నేను కోరేది" అంటూ కన్ను మూసింది అనసూయ.

భాస్వరం చీకటిలో మెరుస్తుంది. చీకట్లు గుమురుకున్న నా హృదయంలో అనసూయ భాస్వరంలా మెరుస్తూ ఉండిపోయింది. ఆ మెరుపు హరించిపోకుండా కాపాడుకుంటున్నాను. వెల్తురుండగా అనసూయను పోల్చుకోలేకపోయాను. ఆముదందీపంలాంటి చల్లని కాంతిని గుర్తించలేకపోయాను. అనసూయకు చదువు చెప్పిస్తేనో ! అనుకుని ఇంకేం చదువు అని నిస్పృహజెందేవాడిని. తెలిసీతెలియని రోజుల్లో పెళ్ళిచేసేశారు. లేకపోతే చదువూసంస్కారమూ గల స్త్రీ దొరకకపోయేదా అనికూడా అనుకున్నా నొక్కొక్కసారి.

అనసూయంటే నాకేం ద్వేషంలేదు — అప్పుడు కూడా—విముఖతాలేదు. కాని నా ఆశయాలావిడకి

అర్థంకావాలి, నా రచనల నావిడ ఆస్వాదించాలి, అనే కోరిక నన్ను బాధపెట్టేది. నేనేం వ్రాసినా వెంటనే ఒకసారి చదివేసేది. "ఎంతబాగుందండీ" అనేది. కాని ఆ చదవడంలో ఆసక్తి లేదు. ఆ అనడంలో అర్థంలేదు. నేను వ్రాసింది కనుక అది బాగుంది— అంతే! ఆవిడ నా గురించి అట్టే తెలిసినట్టుండేది కాదు. అయినా నాయందు అమూల్యమైన అనురాగం చూపేది. నా దస్తూరీతో ఏ కాగితం కనిపించినా తీసి జాగ్రత్తచేసేది. నా పుస్తకాలనెంతో జాగ్రత్తతో సర్దిపెట్టేది. నా భోజనం, నా నిద్ర, నా అవసరాలు ఇవే ఆవిడ జీవితం.

అంత విలువైన మనిషినీ నా తెలివితక్కువచేతే పోగొట్టుకున్నాను. నా అవసరాల మధ్య ఆవిడ అవసరాలు గుర్తించలేకపోయాను. తెల్లగులాబీల లాంటి ఆమె చెక్కిళ్లు మరింత తెలుపెక్కినపుడు అవి పాలిపోవటమని తెలుసుకోలేదు. తనబాధ లన్నిటినీ కప్పిపుచ్చి నా కోసం అంకితమైపోతూంది అని గ్రహించలేదు. అందుకే — ఆమెపట్ల జరిగిన అపచారానికి నిష్కృతిగా పిల్లలపట్ల అత్యధికమైన శ్రద్ధ తీసికోవాలనుకున్నాను.

సరిగ్గా ఇలాంటి భాద్రపదంలోనే ఇలా భోరున వర్షం కురుస్తున్నప్పుడే అనసూయ నాకు శాశ్వతంగా దూరమైంది. ఆ దుఃఖ మలా ఉండగా పసిపిల్లలను పెంచటమెలా అనేది నాకొక తీరనిసమస్యయి కూర్చుంది. అనసూయ నటు బూడిదచేసి వచ్చానో లేదో బంధువులు, హితైషులు, మళ్ళీపెళ్ళి చేసుకో. పిల్లల మొహం చూసయినా—" అంటూ నయబోధ మొదలుపెట్టారు. "నీ కేమంతవయస్సువచ్చేసిందని! బతుకంతా వంటరివాడివై అంపటిస్తావా" అనికూడా అన్నారు. నిజమే నాకేమంతవయస్సు వచ్చేయలేదు. పిల్లల మొహం చూసి నేను తిరిగి గృహస్థుడనవాలి. కాని ఆ గృహిణి పిల్లల మొహం చూస్తుందా! లోకంలో ఎన్నని వినటంలేదు! చూడటంలేదు. సవతితల్లి ప్రేమ ఎవరెరుగనిది? తల్లిలేని పిల్లలకు ఏ తల్లి అయినా తల్లి కాగలదేమో కాని సవతితల్లి మాత్రం కాదు అనిపించింది నామట్టుకు. పిల్లలకోసం దాదిని పెట్టాను. బంధుత్వం కలుపుకుని ఎక్కడో ఉన్నముసలమ్మను పిల్చుకొచ్చి ఇంటి నప్పగించాను. అంతకంటె నాకెవరూలేరు మరి.

చంటిదానికి రెండేళ్ళు వచ్చాయి. పిల్ల ఏడిస్తే కందిపోతుందేమోనని భయం. సముదాయించటం చేతగాదు. ఆటవస్తువులూ, తినుబండారాలూ కొల్లలుగా తెచ్చి పడేసేవాడిని. ఆదాది, ఏడ్చినప్పుడల్లా ఏదో తినిపించేసేది. చిదిమితే పాలుకారే పిల్ల చిక్కిపోవడం మొదలెట్టింది. ఎప్పుడూ ఏడుపు. ఎంత బుజ్జగించినా ఊరుకోదు. ఒక్కొక్కప్పుడు చిరాకే వేసేది. అనసూయ గుర్తుకొచ్చి ప్రాణాలు బిగబట్టుకునేవాడిని. సుదర్శనాన్ని బడిలో వేశాను. వాడుమాత్రం ఆరోగ్యంగా ఉన్నాడు. బుద్ధిగా చదువుకునేవాడు. పిల్లమాత్రం రోజు రోజుకూ ఎండిపోతూంది. డాక్టరుకు చూపించాను. కడుపులో బల్ల పెరుగుతూందన్నాడు. ఆహారం విషయమై చాలా జాగ్రత్త తీసికోవాలన్నాడు. ఇంజక్షనులూ మందులూ- అవన్నీ సవ్యంగా జరగవేమోనని కొన్నాళ్ళు సెలవు పెట్టి ఇంటిదగ్గరే ఉన్నాను. ఇంద్రాణికి కొంచెం నయమౌతోంది. ఇంతలో ముసలమ్మకు హఠాత్తుగా జబ్బుచేసి పరమపదించింది.

గృహిణిలేని జీవితంలోని న్యూనత అంతకంతకూ బాధాకరంగాతయారైంది. పిల్ల విషయంలో ఏమాత్రం అశ్రద్ధ జరిగినా మరి నాకది దక్కదు. అంతపనే జరిగితే అనసూయ నన్ను క్షమించదు. అప్పుడప్పుడే తిరిగి వివాహం చేసుకుంటేనో అనే చిన్న తలంపు నాలో రేకెత్తుతూంది. మళ్ళీ భయం. నాగురించికాదు. పిల్లల గురించి. వాళ్ళ భవిష్యత్తు?

కాగితం కలంతీసి ఎప్పుడు కూర్చున్నాను? ఎంతసేపయిందో గమనించలేదు. ఒక్కవాక్యం ముందుకు సాగలేదు. సాయంత్రం సభనుండి తిరిగి వచ్చినప్పటినుండి ఏదో వేదన. పాత కథల జ్ఞాపకాలేకాని కొత్తకథ స్ఫురించటలేదు. ఇంతకీ ఎవరికోసం వారీ కథలు? నేను వ్రాయకపోతే ఎవరికిబాధ!

అనసూయ బ్రతికుంటే బాధపడేది. మీరు చక్కగా వ్రాయగలరు, వ్రాయాలసిందే అని ఉండేది. కాని శైలజ అలాకాదు. ఆమెకు నా వ్రాతలు చూస్తే చిరాకు. ఎప్పుడూ కాగితాలు ముందర వేసుకుని కలం చేతపట్టుకుని అదేపనిగా వ్రాతపనిలో ఉండే నన్ను చూసే ఆవిడ అసహ్యించుకుంది.

శైలజ నా దగ్గర చదువుకుంది. మా కాలేజీలోనే బి. ఎ. పాసయింది. లెక్కలలో ఫస్టుమార్కు రావాలని నాచేత ట్యూషన్ చెప్పించుకునేది. నేను ఒంటరి గాడినైనా మాయింటికివచ్చి పాఠం చెప్పించుకునేది. అప్పుడే కాలేజీలో చిన్న దుమారం లేచింది. మా యిద్దరికీ లోకమే ఒక బంధం వేసింది. కాలేజీల్లో ఇలాంటి వొక విడ్డూరంకాదు. నేనెప్పుడూ ఆ విషయమే పట్టించుకోలేదు. ఆవిడా బాధపడినట్టనిపించలేదు. పరీక్షలయిపోయి రిజల్ట్సు వచ్చేసేక ఒకనాడు శైలజ వాళ్ళన్నగారిని కూడా తీసుకుని మా యింటికి వచ్చింది. నాకేదో ముట్టచెప్పాలని వచ్చారు కాబోలనుకున్నాను. ఆహ్వానించి కూర్చోబెట్టాను. టూకీగా వాళ్ళన్నయ్య చెప్పారు. శైలజను నేను వివాహం చేసుకోవాలని వాళ్ల కోరిక అని, శైలజ యిష్టంమీదనే అప్రస్తావన చేస్తున్నాడని. నేనెంత ఆశ్చర్యపోయానో వర్ణించలేను. వెంటనే ఏమీ అనలేక పోయాను. "కొంచెం టైమివ్వండి. ఆలోచించి చెబుతాను." అనిమాత్రం అనగల్గాను.

వాళ్ళు వెళ్ళాక ఆలోచనలు పరిపరి విధాల పోయాయి. ఆ అమ్మాయి తనకుతానై ఇలా వరించటంలో అర్థమేమిటి? అని ఎంత ఆలోచించినా నాకేం బోధపడలేదు. అవివాహితుడిని కానే - ఇది వరకే ఒక ఘట్టం ముగిసిపోయిన వాడిని. ఇద్దరు పిల్లలున్నారు. ఈ యిల్లు, పిల్లలు నాబాధలు అన్నీ తానెరుగును. నన్నే వివాహం చేసుకోవాలని ఆమె నాకర్షించిన దేమిటి? నన్నుద్ధరిద్దామనా! పిల్లలను చూసి జాలిపడా! ఏమో అంత ఔదార్యవంతురాలా!

శైలజ చాలా చక్కనిది. అనసూయకంటె చక్కనిది. మంచి సంస్కారం ఉట్టిపడే ప్రవర్తన. తండ్రి లేడుకాని అన్నలున్నారు. అంతా పెద్దచదువులు చదివారు. పెద్దపెద్ద ఉద్యోగాలు చేస్తున్నారు. ఈమె ఒక్కతే ఆడపిల్ల. చాలా ముద్దుగా పెరిగింది. అయినా బుద్ధిగానే మసలింది. ఇన్ని లక్షణాలున్న ఆ అమ్మాయి హాయిగా, నా కంటె యువకుడు ఏ బాదరబందీ లేనివాడిని, చూసుకోవచ్చుకదా! ఆ అమ్మాయి ఉద్దేశాలేమైతేనేం! నే నాలోచించవలసింది పిల్లలగురించి కదా. ముద్దుగా మురిపెంగా పెరిగింది. చదువుతప్ప మరొక జీవితమే ఎరుగదు. ఈమె ఉన్నట్టుండి ఇద్దరు పిల్లలకి మాతృస్థాన మెలా నిర్వహిస్తుంది. వట్టిది - అనుకున్నాను.

నా సందేహాలలోంచి నేనింకా తేరుకోనేలేదు. నేనింకా ఏ నిశ్చయానికీ రానేలేదు. మరినాల్గు రోజుల నాడు మళ్ళీ వాళ్ళన్నయ్య వచ్చాడు. శైలజ మీకీ ఉత్తరం ఇమ్మంది. జవాబిస్తే సంతోషం అని కూర్చున్నా డాయన.

చాలా పెద్ద ఉత్తరం వ్రాసింది. చదవటానికి ముచ్చటగా ఉన్న శైలిలో అందమైన ఇంగ్లీషు అక్షరాలలో వ్రాసిన సుదీర్ఘమైన ఉత్తరం. దీక్షగా చదివాను. సారాంశం యిప్పటికీ గుర్తుంది. ఆమె నా పుస్తకాలు చాలా చదివిందట. నా రచనలలోని నావ్యక్తిత్వం ఆమెను చాలా ఆకర్షించిందట. ఆ తరువాత మా యిద్దరిమధ్యా గురుశిష్య సంబంధంలోని పరిచయం ఆ వ్యక్తిత్వాన్నే ఋజువు చేసిందట. కేవలం నా రచనలు చూసి తాను పొరపడలేదు అని గ్రహించిందట. ఆ ఆకర్షణే నన్నిలా అర్థించటానికి కారణంట. ఇక ఇది ద్వితీయమనీ, నాకు పిల్లలున్నారనీ తనకేం చింత లేదన్నది. పిల్లల విషయంలో ఆమెనుండి నేనాశించిన కంటే ఎక్కువే శ్రద్ధ తీసికోగలనని హామీనిచ్చింది. చివరికిలా ముగించింది."లోకాన్నర్థం చేసుకుని చిత్రవిచిత్రమైన పాత్రలను సృష్టించేమీరు నా పాత్ర నర్థంచేసికోవటం కష్టమేం కాదు" అని.

ఉత్తరం చదివేక నాకింక సందేహాలే మిగలలేదు. వెంటనే "సరేనని చెప్పండి" అనేశాను.

మళ్ళీ చాలా కాలానికి చీకటిలోంచి మెరుపుమెరిసినట్లయింది. ఇంక ఫరవాలేదు. వెలుగుబాటలో సాగిపోవచ్చు. అనుకున్నాను. "అనసూయా, అంతా విన్నావు కదూ! పిల్లలకేం అన్యాయం జరగదు" అని చెప్పుకున్నాను.

అంతా సలక్షణంగా జరిగిపోయింది. శైలజ నాయింటికి వెలుగై వచ్చింది. ఎక్కువ కష్టం లేకుండానే పిల్లలు ఆమెకు చనువయారు. నా కాశ్చర్యమే వేసింది. ఆమె అంత చక్కగా వాళ్ళ నెలా చూడగల్గుతూందా అని. ఏమైతేనేం. మళ్ళీ జీవితంలో ప్రశాంతత ఏర్పడింది. మధ్యమధ్య అనసూయ గుర్తుకొస్తున్నా శైలజ పిల్లల విషయంలో తీసుకునే శ్రద్ధ నాకు చిత్తశాంతి నిచ్చింది.

అనసూయచనిపోయేక నేను బొత్తిగా వ్రాయటం మానుకున్నాను. శైలజ ప్రవేశంతో మళ్లీ నాలో ఉత్సుకత వచ్చింది. కొత్తకథలు వ్రాయటం మొదలు పెట్టాను. ఈ మధ్యలో జరిగిన అనుభవాలతో నాలో కాల్పనిక శక్తి ఎక్కువయింది. ఉత్సాహంతో ఆనందంగా రచనలు సాగిస్తున్నాను. కాని చిత్రమేమిటంటే అన్నిటా అనసూయ ప్రతిబింబించేది. ఎందుకో చెప్పలేను.

పగలల్లా కాలేజీ, అర్ధరాత్రిదాకా రచనావ్యాసంగం. తరువాత నిద్ర. ఇలా సాగిపోయే నా జీవితం శైలజకు విరక్తిని కల్గించింది. ఆమె నా సాన్నిహిత్యాన్ని కోరుకునేది. సాయంత్రమలా షికారుకువెళదామనేది. లేకపోతే సినిమాకుపోదామనేది. చక్కగా ముస్తాబై నా ముందు వచ్చి కూర్చుని "అస్తమానం ఆపిచ్చేనా! మీకు మరొక ప్రపంచమే లేదా!" అని సాధించేది. అప్పుడప్పుడు విసుగుకునేదికూడా. కేవలం ఆమెను సంతృప్తిపరచటానికి ఆమె కోరినట్లు చేసేవాడినికాని ఎందుకో గాని ఆమెతో సరదాగా గడపలేకపోయేవాడిని. ఆమెలో ఏ లోపమూ లేదు - అయినా నేనామెకు దగ్గరగా పోలేకపోయాను. ఎప్పుడయినా మానవసహజమైన ఉద్రేకం నాలో కలిగినా వెనువెంటనే ఒక దౌర్బల్యం - ఒక స్వార్థం - ఒక భయం - నన్నావేశించి నీరసపెట్టేది. అదే–శైలజకు కొన్నాళ్లపాటు సంతానం కలుగకూడదు. ఇంద్రాణి కొంచెం పెద్దదయితే ఆ తరువాత ఫరవాలేదు—నాకు తెలుసు. ఈ స్వార్థం ఆమెపట్ల నాచేత చాలా అన్యాయం చేయిస్తూందని. ఆమె ఔదార్యంలో నాకెంత నమ్మకమున్నా ఆమెకే సంతానం కల్గితే మరొక తల్లి కన్నబిడ్డలను సరిగా చూడదని నా భయం. ఆ స్వార్థం నన్ను భయపెట్టింది. ఆమెను నాకు దూరంచేసింది. అదే ఆమెకు నావట్ల విముఖతకల్గించింది. నా భయాలని కప్పిపెట్టుకుందుకు, ఆమెనుండి తప్పించుకుందుకు, నా వ్రాతపనిని అడ్డుగా పెట్టుకున్నాను.

జీవితం ఎంతోకాలం అలాసాగలేదు. జీవితంలో సమస్యలు ఉత్పన్నం కాకనేపోవాలి కాని అవి ఉత్పన్నమయితే పరిష్కారంకోసం వెతుకులాడుతాయి. ఎక్కడో ఎలాగో పరిష్కరింపబడతాయి. నాల్గురోజులు పుట్టింటికి వెళ్ళివస్తాను అని వెళ్ళిన శైలజ మరి తిరిగిరాలేదు. ఒక ఉత్తరం మాత్రం వచ్చింది.

"మీ కథలూ, పుస్తకాలూ చదివి మీ వ్యక్తిత్వాన్ని వలచి మీతో జీవితంపంచుకోవాలని ప్రయత్నించాను. మీకేదో కావాలనీ, మీరు చీకట్లో తడుములాడుకుంటున్నారనీ, అనిపించి మీరన్వేషించేదానిని నే నివ్వగలనని భ్రమపడ్డాను. బ్రతుకుకొక ఆలంబన, ఒక నిండుతనం లేక, కాలాన్ని హరించటానికి, మనస్సును మళ్లించుకుందుకు, మీరు రచనలు సాగిస్తున్నారనుకున్నాను. మీ పూర్వజీవితం అనసూయ కంకితమైపోయిందని తెలుసు. శేషజీవితం కథలకీ కావ్యాలకీ అంకితమైపోతుందని ఇప్పుడు తెలుసుకున్నాను. తల్లి లేని పిల్లల కొక అనువైన దాదిగా మాత్రమే నన్నాహ్వానించేరు మీరు. ఇంతవరకూ ఆ కర్తవ్య నిర్వహణ సరిగానే చేశాననుకుంటాను. నిరానందమయమైన జీవితంలో ఇరుక్కుని అలానే హరించిపోవటంలో అర్థంలేదు. శైలజ మీ జీవితంలోనుండి తప్పుకుంది."

శైలజకు తెలిసితెలిసి అన్యాయం చేశాను. దాని కాహూతై పోయే తెలివితక్కువ ఆమెలో లేదు. కాని నాకొకటే అర్థంకాని విషయం. మీరే కావాలని వచ్చిన శైలజ అంత సులభంగా నాతోడి బంధనాన్ని ఎలా తెంపేసుకుంది. తెలివైనదే ! చదువుకున్నదే ! ఆమాత్రం ఒడిదుడుకులకు అంతలో తప్పుకుపోవాలా ! ఏమీతెలియని అనసూయ అన్నాళ్లు నన్నెలా భరించింది ? అదే కాబోలు తెచ్చిపెట్టుకున్న సంస్కారానికీ ఆత్మసంస్కారానికీ భేదం !

అర్ధరాత్రి దాటినట్లుంది. వర్షం వెలిసింది. బయట గాఢాంధకారం. వీధిదీపా లారిపోయాయి కాబోలు.

ఇంక నేనేం వ్రాయలేను. వ్రాసేశక్తి నశించింది. నాకథకూడా నేను వ్రాయలేనేమో ! లైటార్పేసి పక్కమీద వాలాను. మనస్సుకు బుద్ధిలేదు మెదడు పని చేయటం మానదు. శరీరంమాత్రం అలిసిపోయింది. వంటి కసలే వర్షపుగాలి పడదు. ఒకటే దగ్గుతెరలు. ఆయాసం. ఈ రుగ్మత ఈనాటిది కనుకనా. పదేళ్ళ నుండి నన్నంటిపెట్టుకున్నది. అప్పుడు సుదర్శనం ఉండేవాడు కనుక అర్ధరాత్రయినా అపరరాత్రయినా చూసేవాడు. కాస్త నలతగా ఉంటే వెంటనే తగ్గేందుకు ఇంజక్షను ఇచ్చేవాడు. తెల్లవార్లూ నాపక్క కూర్చుని ఉపచారం చేసేవాడు. నాన్నంటే పంచప్రాణాలూకామా సుదర్శనానికి. కాని ఏమైందా అభిమానం. ఈ ముసలినాన్నను సుదర్శనం ఎలా మరచిపోగల్గాడు ? వృద్ధతరానికి యువకతరం అర్థంకాదు.

నాపిల్లలు నాకంటె అధికులు కావాలి. వాళ్ళు నాకంటె ఉన్నతంగా బతికి సుఖంగా ఉంటే అదే నాకు కావలసింది అనే కదూ వాళ్ళ నంతవాళ్ళను చేశాను. సుదర్శనం చురుకుగా చదువుకున్నాడు. ప్రతి తరగతిలోనూ వాడిదే పైచెయ్యి. బుద్ధిమంతుడనిపించుకున్నాడు. యం. బి. బి. యస్. ప్యాసయాడు. ఇంకా పైకి చదువుతానన్నాడు. చదవమనే నేనూ ప్రోత్సహించాను. ఇంతలోనే ఫారిన్ స్కాలర్‌షిప్ సంపాదించాడు. అమెరికా వెళ్ళాలన్నాడు. ఇంత కాలం విడిచి ఉండనివాడిని అంతదూరం పంపించటం నాకెంత బాధగా ఉన్నా వాడి భవిష్యత్తును నాకోసం పాడుచేయటం ఇష్టంలేక పంపేనన్నాను. సంవత్సరంలో తిరిగి రానూ అని నన్ను సముదాయించాడు. ఇంద్రాణి పెద్దదయింది మీకు అండగా ఉంటుంది. ఏముంది యిట్టే తిరిగి వస్తాను అన్నాడు. వెళ్ళేటప్పుడు వాడి కనుకొలకుల్లోకూడా నీళ్లు నిల్చాయి.

అమెరికా వెళ్ళిన కొత్తల్లో వారానికి రెండుత్తరాలు వచ్చేవి. అక్కడి జీవితం చాలా ఆహ్లాదంగా ఉందనీ, గుండె జబ్బులనుగురించి ప్రత్యేక పరిశోధన చేస్తున్నాననీ వ్రాశేవాడు. "నాన్నా ! ఇన్నివేలమైళ్ళ దూరంలో ఇలా ఉండాలిసివస్తుందని ఎప్పుడూ అనుకోలేదు సుమా ! అయినా దిగులు పడకండి" అని ఉత్తరాలలో ఓదార్చేవాడు. రెండుమూడు నెలలు గడిచేసరికి ఉత్తరాలసంఖ్య తగ్గింది. ఆరునెలలు పూర్తవకముందే వాడి నిశ్చయాలే మారిపోయాయి. వాడు తిరిగి వస్తాడని ఆశించిననాటికి తానక్కడే ఉండిపోతున్నాననీ అక్కడే ఉండి గుండెజబ్బులను గురించి తాను నేర్చుకోవలసినది చాలా ఉన్నదనీ అక్కడే ఉంటే తనకి అమోఘమైన భవిష్యత్తు ఉన్నదనీ. నేను గోలపెడుతూ ఉత్తరం వ్రాశాను. "నువ్వు వ్రాసినదంతా నిజమే కావచ్చు. పెద్దచదువులు చదివావు. పెద్దవాడవయావు. ఇంతకాలం నేనే ఆశతో ఏ ఆసరా చూసుకుని బతికాను ? నువ్వు తిరిగి వచ్చి ఈ ముసలి నాన్నను దగ్గరకు తీసుకుంటావనే కదూ బాబూ ! ఇక్కడమాత్రం నీకు గొప్ప భవిష్యత్తులేదా ! యోగ్యతలున్నవాడికి ఎక్కడైనా ఉజ్వలమైన భవిష్యత్తుంటుంది. నీ సుఖాన్ని నేను కాదనను. కాని నాన్నసంగతి ఆలోచించు. మీనాన్న ఎన్ని కష్టాల నుభవించేదో నీకు తెలియదా సుదర్శనం ?" అంటూ తిరిగి రమ్మని ఎంతైనా ప్రాధేయపడ్డాను. మళ్ళీమళ్ళీ బతిమాలుతూ వ్రాశాను.

అమెరికాలోని ఆహ్లాదకరమైన వాతావరణంలో సుదర్శనానికి నాన్న ఆక్రోశించేది వినబడలేదు. గుండె జబ్బులగురించి తీవ్రంగా పరిశోధించే సుదర్శనానికి హృదయావేదన అంటే ఏమిటో బోధపడ

లేదు. వాడికేం. వాడు బాగానే ఉన్నాడు. ఈమధ్యనే పేపర్లో చదివాను. వాడేదో కొత్తవిషయం కనిపెట్టాడట. అందుకు నేను గర్వపడాలి. సంతోషించాలి. అలా అయితే అందరూ హర్షిస్తారు. కాని నేనలా చేయలేకపోతున్నాను. సుదర్శనం నన్ను దగా చేశాడు అని ఉస్సురనకుండా ఉండలేకపోతున్నాను. మానవ దౌర్బల్యం - ఎవరిస్వార్థం వారిది.

బతుకులో ఎన్నిటికని ఏడ్చేది. ఎన్నిటికోఏశ్చాను. అయినా ఇప్పటికీ కన్నీరింకిపోలేదు. ఛా! ఏడపడమేమిటి? అనుకుని కన్నీళ్లు తుడుచుకున్నాను. ఇద్దరు పిల్లలనీ రెండుకళ్ళలా చూసుకున్నాను. ఇద్దరూ ఎవరితోపన వాళ్లుజారిపోయారు. మమతలూమానవత్వమూ అన్నమాట కర్థమేముంది?

సుదర్శనం దగ్గరనుండి ఆ ఉత్తరం వచ్చిననాడు ఇంద్రాణి కూడా వాపోయింది. "అన్నయ్య యింక తిరిగిరాడా! అక్కడే ఉండిపోతాడా!" అని విలవిలలాడింది. "ఇదంతా నా అదృష్టం తల్లీ! నేననేవాడిని ఒకడున్నాడనే మరిచిపోయాడు మీ అన్నయ్య" అన్నాను. అంతవరకూ చిలిపిచిలిపిగా చిన్నపిల్లలా తిరిగే ఇంద్రాణి సుదర్శనం వెళ్లాక నన్నంటిపెట్టుకునే ఉండేది. నా ఆలనా పాలనా చూసేది. నేను రాత్రి నిద్రపోయేదాకా నా పక్కనే కూర్చుని చదువుకునేది. ఒకటి పట్టుతప్పిపోతే మరొకటి ఊతగా తీసుకుని బతకడమే మానవధర్మం. "ఇందూ! నువ్వెక్కడికీ పారిపోకు. నీకేం కావలిస్తే అది చేస్తాను. నేను బతికుండగా నీ కే కొరతా రానియ్యను. నన్నొంటరివాడిని చేసి పారిపోకూ!" అనేవాడిని. పెరిగి పెద్దదయాక ఇందును చూసినప్పుడల్లా అనసూయ బతికి వచ్చినట్లనిపించేది. అచ్చూ అదేపోలిక. అదేనవ్వు. అదే నడక. కాని ఏం లాభం. ఉన్న రెక్క కూడా ఊడిపోయింది.

నా పిల్లల్ని బుద్ధిమంతుల్నిచేయాలి. యుక్తాయుక్త జ్ఞానంకలిగేలా వాళ్ళని పెంచాలి. గొప్ప ఆదర్శాలతో బతికేలా పెంచాలి. వాళ్ళ కే లోపం కలుగనివ్వకూడదు. ఇలాంటి మహదాశయాలతో వాళ్ళను పెంచాను. వాళ్ళ గురించి కలలు కన్నాను. మరీ ముద్దుచేస్తేపాడయిపోతారు అని భయంలోపెట్టాను. మరీ భయపెడితే అసలే చెడిపోతారు అని ముద్దుగానూ చూశాను. అడుగడుగునా వాళ్లెక్కడ పెడదారి తొక్కుతారో అని వాళ్ళని అదుపులో పెటాను. ఈ కట్టుదిట్టాలన్నీ వృథా అయినాయి. నేను తీసికున్న జాగ్రతలన్నీ మట్టిలో కలిశాయి. ఇందు నా కళ్లు కప్పేసి నాకే మచ్చతెచ్చింది. కాలేజీలో దానిప్రవర్తన అసభ్యంగా ఉంటూందని వింటూవచ్చాను లోలోపల మధనపడ్డాను. పిలిచి నయానా భయానా చెప్పాను. "ఈ కాలేజీకి నేను ప్రిన్సిపాల్‌ని. నువ్వే అల్లర చిల్లరగా ప్రవర్తిస్తే నాకెంత బాధో ఆలోచించు" అన్నాను. జవాబులు ఎప్పుడూ సూక్ష్మంగా వచ్చాయి. "కిట్టనివాళ్లెవరో మీకేదో చెప్పారు" అన్నది. నా పిల్ల గురించి కప్పిపెట్టుకుని ప్రయోజనంలేదు. ఇద్దరి ముగ్గురు అబ్బాయిలతో స్నేహాలు. విలాసంగా తిరగటాలు. క్రమక్రమంగా రాత్రి తొమ్మిదిదాకా ఊళ్లో షికార్లు. "ప్రిన్సిపాల్‌గారమ్మాయి ఇలా చేస్తూందిట" అనేవాదు నా చెవులలో పడుతూనే ఉంది. లోకుల ననాలిసిన పనేముంది? నేనూ గమనించాను.

ఇంద్రాణి ప్రవర్తన ఏమీ బాగులేదు. యువతీ యువకుల మధ్య ఉండవలసిన మామూలుస్నేహాలు కావవి. అమ్మాయి దిగజారిపోతూంది. ఎలా అరికట్టాలో తెలియలేదు. కుమిలికుమిలి ఏడ్చాను. "అనసూయా, అమ్మాయి చెడిపోతూంది చూశావా!" అన్నాను. ఆ అమాయకురాలికీ పోకడలేం తెలుసు!

అనుకున్నట్టూ పరీక్షలో ఫెయిలయింది. నేను తన ప్రవర్తన నిరసిస్తున్నానని తెలిసినప్పటినుండీ నన్ను పూర్వంలా ఆదరంతో చూడటం మానేసింది. వేసింగి సెలవుల్లో చక్కగా ముస్తాబై "నేను కారు తీసుకుపోతున్నాను" అని క్లుప్తంగా చెప్పేసి బయలుదేరేది. "ఎక్కడికి - ఎప్పుడొస్తావు" అనేలాంటి ప్రశ్నలు వేస్తే చీత్కారంతో బజారుకి అనో ఒక ఫ్రెండు యింటికి అనో జవాబు.

సహించగల్గినంత సహించాను. చెప్పవలసినంత చెప్పాను. అర్ధ నగ్నంగా అలంకరణలు, అందమైన శరీరాన్ని అసహ్యంగా తయారుచేసే జిలుగులు మెలుగులు; వెకిలిగా నవ్వటం; విలాసంగా శరీరాన్ని వొంపులు తిప్పుతూ నడవడం; నాకెంతో జుగుప్స కలిగించాయి. ఒకనాడు ఇంటినుంచి సాయంత్రం వెళ్ళి రాత్రి పదకొండు దాటాక యింటికి వచ్చింది. ఒంటరిగా కారు తనే డ్రైవు చేసుకుని వచ్చింది. నేను సహనంకోల్పోయాను. పట్టరానికోపం వచ్చింది. ఆ ఉద్రేకంలో ఎన్నో తిట్టేశాను. "నువ్వు నాకూతురువు కావు. నువ్వు నాదగ్గర ఉండక్కరలేదు. నీయిష్టం వచ్చినట్లు ఫో!" అని కసిరేను. మాటలు నేర్చిన ఆడది మాటపడి ఎందుకూరుకుంటుంది? "అలాగే వెళతాను. ఈ క్షణంలోనే వెళతాను. ఈ యింట్లో నాకు సుఖంలేదు" అనేసి ఆ అర్ధరాత్రి చరచరా యిల్లుదాటి ఎక్కడికో వెళ్లిపోయింది. ఇరవైనాలుగు గంటలలో ప్రిన్సిపాలు కూతురు ఫలానా అబ్బాయితో లేచిపోయింది అనేవార్త గప్పుమంది. ఎరిగినవాళ్లు చెప్పగా విన్నాను. మద్రాసులో ఉందని. సుఖమే అనుభవిస్తూందో దుఃఖమే అనుభవిస్తూంధో ఎవరు చెప్పగలరు?

ఏం తప్పు చేశానని బతుకు నన్నిలా శిక్షించింది? లోకం నన్ను గౌరవిస్తుంది. నన్ను ఘనంగా సన్మానిస్తుంది. కాని బతుకు నన్ను దగాచేసింది.

నాదొక గొప్ప వ్యక్తిత్వం. నా కీర్తి ఘనమైనది. మంచి హోదాలో బతికాను. నా పిల్లల నాదర్శవంతంగా పెంచాను. వాళ్లు పెద్ద చదువులు చదివారు. శ్రమించి ఆర్జించాను. శేష జీవితం బాధ లేకుండా గడిచిపోయింది. ఇంత జరిగినా ఎంత వెలితి? ఈ వెలితి నెవరు పూడ్చగలరు?

సుఖమంటే ఏమిటి? దుఃఖమంటే ఏమిటి? అసలు జీవితపు విలువలనేవి ఎక్కడున్నాయి?

ఇదొక జవాబులేని ప్రశ్న. ఎన్ని శ్రావణాలు గడిచినా మరెన్ని భాద్రపదాలు గడిచినా ఈ ప్రశ్నకు నాకు జవాబే దొరుకలేదు.

# కొన్ని సామెతలఁ గన్న చిన్న కథలు

"శండిల"

మనం చెప్పదలచుకున్న విషయాన్ని సులువుగా, సూక్ష్మంగా, సూటిగా, హృదయానికి తగిలేటట్టు ధ్వనియుతంగా, రసవత్తరంగా వ్యక్తం చెయ్యడానికి మిక్కిలిగా ఉపకరించే శక్తిమంతమైన సాధనాలలో సామెత ఒకటి. వీటిలో మనకు వినబడే అతి సాధారణమైన మాటలే వినబడినా చమత్కారంగా మెలత వేయబడిన కారణంగా వీటికూర్పు చిత్రవిచిత్రమైన రుచుల పుట్టిస్తుంది. ఏళ్ళతరబడి అనుభవం వీటి వెనుక ఉండడంవల్లను, పదేపదే నలిగిపోయినా వాడిపోనీకుండా ప్రజలు ప్రయోగిస్తుండడంచేతను వీటికి శాశ్వతత్వం అబ్బింది. సాహిత్య ప్రకర్ష, పాండితి లేకపోయినా కించిదుపజ్ఞ, కొద్ది చమత్కారం వీటిని పుట్టించడానికి దోహదం కాగలవేమో అనిపిస్తుంది.

సాహిత్యం జీవితానికి ప్రతిబింబమే గనుక వివిధ శాఖలలోవలె సామెతలలోగూడ ప్రజాజీవితంలోని వివిధ రంగాలు ప్రతిబింబితమౌతుంటాయి. కుటుంబ సంబంధ బాంధవ్యాలు, యుక్తి ప్రయుక్తులు, వివిధ వృత్తి వ్యాపారాదులు, నయబోధలు, దూషణ భూషణలు, ఒక సందర్భంలో నన్నమాటేమిటి. సర్వే సర్వత్ర ఇవి తమవిగా చేసుకున్నాయి. మచ్చుకు- *"కోడలు కంటానంటే అత్త వద్దంటుందా?", "అత్తకాలం కొన్నాళ్ళు కోడలుకాలం కొన్నాళ్లు", "ఇనుక తక్కెడ పేడ తక్కెడ", "దొంగకుదొంగే కొందప్పా", "ఆరుద్ర కురిస్తే దరిద్రనాశనం", "చిత్తజల్లు స్వాతివాన", "మరుకు అమ్మనివ్వదు మందం కొననివ్వదు", "లాభంలేనిదే శెట్టి యేట బడడు", "అడుసు త్రొక్కనేల కాలు గడుగనేల?" "ఓర్చినమ్మకు తేటనీరు", "తన్ను మాలిన ధర్మము మొదలుచెడ్డ బేరము", "జగడాలాడుకుంటే జాతులు బయటబడతాయి", "అంబలిదాగే నాయాలా అంటే అదీలేదు నాయాలా"*—

ఇట్లాంటివే కొన్ని నానుడుల్ని పరిశీలిస్తే ఇది కొన్ని ఉదంతాలను, సంఘటనలను, చిన్న కథలను బట్టి పుట్టినట్లు తెలుస్తుంది. ఆ కథలకు కారకులెవరో తెలియదుగాని వాటివల్ల జనించిన సామెతలవల్ల వాటికీ చిరంతనత్వం గలిగింది. *పుల్లాయి వేమవరానికి పోయి రావడము* (దీనినే గుంటూరు మండలంలో *"సింగన్న అద్దంకి పోనూపోయాడు రానూవచ్చాడు"* అనిన్నీ. భద్రాచలం ప్రాంతంలో *"తిప్పడు కొండపర్తి పోవడము"* అనిన్నీ అంటారు.) లోను; *"అత్తనైతే పెళ్ళికొడుకేగాని చెవుల పోగులమాట మాత్రం తెలియ"*దనడములోను; *"నామాట అబద్ధమైతే అదిగో ఆ డొంకలో షరాబు నడగండి"* అని పరమానందయ్యగారి శిష్యులనడములోను ఇమిడివున్న హాస్య సంఘటనలు లోకప్రతీతి నందినవే గదా! మనకు కొంచెం మారుమూల నున్నట్లు మెరిసే సామెతల్ని రెండు, మూడింటి నుటంకించి వాటిఁ గన్న చిన్న కథలు వివరిస్తాను.

నే నొదిలినా అది వదల్లేదు

ఏటి యొడ్డున ఇద్దరు దంపతులు కాపురం చేస్తున్నారు. భర్త ఏటబడి కొట్టుకవచ్చే కలపను సేకరించి విక్రయించి సంసారం గడుపుతున్నాడు. అతని మొలకు పగ్గంగట్టి భార్య ఒడ్డునవుండి కనుచూపు మేరవరకు అతన్ని ఉత్సాహపరుస్తుండేది. ఒకనాటి వేకువజామున ఏటిలో కొట్టుకవచ్చే ఎలుగుబంటి పెద్ద దుంగవలె కనుపించింది. భార్య భర్తను వేగిరపెట్టింది. అతడు అంగలపై వేగంగా ఈదుకుంటూ

పోయి దాన్ని బలంగా పట్టుకున్నాడు. పాపం ! అదీ ప్రాణరక్షణకై అతన్ని మరీ బలంగా పట్టుకున్నది. ఇద్దరినీ ఏరు లాక్కెడుతోంది. భార్య చేతనున్న పగ్గం పట్టుతప్పి పోతోంది. "త్వరగా వచ్చెయ్" అని భార్య అన్నది. "ఉండవే ఉండవే" అంటాడు భర్త. తుదకు ప్రమాద మొచ్చేలాగున్నదని భార్య "పోనీ-దాన్ని వదిలేసిరా" అన్నది. "అబ్బే నేను వదిలేసి చాలాసేపైందే- *నేను దాని నొదిలినా అది వన్నొదల్లేదు*" అంటాడు భర్త. ఒక వ్యవహారంలో మనం తగుల్కొని, అది నష్టదాయకమని గుర్తెరింగి బయట పడదామని విశ్వప్రయత్నం చేస్తున్నా మనం తరించే దారిలేని సందర్భాలకు ఈ సామెత వర్తిస్తుంది.

ఏనుగును బేరమాడినవా డెళ్లిపోయాడు

మావటీడు రాజుగారి ఏనుగను తోలుకువస్తున్నాడు. దారిలో ఒక త్రాగుబోతు మావటితో అన్నాడు "ఏనుగ నెంతకైతే ఇస్తావ ?" ని. మావటి కోపించి ఈ సంగతి రాజుగారితో చెప్పాడు. "ఎవడురా— మన గజాన్ని కొనేవాడ" ని రాజుగారు వాడికి హవేశీకి రమ్మని కబురుపెట్టారు. వాడు వెళ్లి చేతులు జోడించి "*ఏనుగను బేరమాడినవా డెళ్లిపోయాడు* మారాజా !" అన్నాడు. అనగా ఆ సమయానికి వాడికి త్రాగుడు మైకం వదలి ప్రస్తుతంలోకి వచ్చాడు. కోపంలో గాని లేదా ఆవేశంలో గాని మరేమత్తువల్లనైనా వొళ్లు తెలియక ఏదో ప్రేలుతూ, వాస్తవానికి వచ్చేక మనలనుమనం సముదాయించుకుంటూంటాం. అట్లాంటిసమయాలలో ఈ సామెత నుపయోగిస్తారు.

అందరకు దెత్తునా కొందరకు దెత్తునా ?

ఈ సామెతకు కర్తలు ఎవరో తెలియదు గాని సాధారణంగా రామలింగనికి దీన్ని అంటగట్టడం కద్దు. కొందరు మిత్రులతో రామలింగడు పొరుగూరి కెడుతున్నాడు. దవ్వు ప్రయాణం కావడంచేత కూళ్లు మూటగట్టుకుపోతున్నారు. మధ్యాహ్నం భోజనసమయానికొక తావుకు చేరుకున్నారు. అన్నంపెట్టుకోవ డానికి ఆకుల్లేవు. అల్లంతదూరాన అరటితోటకెళ్లి ఆకులు కోసుకురావాలి. "నువ్వెళ్లు అంటే నువ్వెళ్లు" అని వంతులాట మొదలైంది. తుదకు అంతా రామ లింగని పొమ్మన్నారు. "సరేలెండి మీవని" అనుకొని "*ఐతే అందరకు దెత్తునా కొందరకు దెత్తునా ?*" అని అడిగాడు. "అందరికీ దెమ్మ" న్నారు. రామలింగడు తోటకెళ్లి కట్ట ఆకుల కోసమని తోటంతా పాడుచేసి వస్తూవస్తూ దారిలో ఒక్కొక్క ఆకుముక్కను చించి పడవేసుకుంటూ తమ నెలవుదాకా వచ్చాడు. అందరూ ఆకుల్లో అన్నంపెట్టుకుని తింటున్నారు. రామలింగడు మటుకు తనకు ఆకు వద్దని చెరగువరమకొని అందు లోనే అన్నం వడ్డించుకొన్నాడు. "ఓరి నిర్భాగ్యుడా ! నీ ఖర్మ" అని చీదరించుకొన్నారు అందరూ. మరి కొంతసేపటికి తోట యజమానులు వచ్చి పాడుచేయ బడ్డ తోటను చూసి దారిపొడుగునా రామలింగడు పడవేసుకుంటూ వచ్చిన ఆకుముక్కల జాడనుబట్టి వీళ్లున్నచోటికివచ్చారు. గద్దించగా రామలింగడన్నాడు "నేనేమీ ఎరుగనండి. కొంగులోనేతింటున్నానన్నం" అని. వాణ్ణి తప్పించి మిగతా అందరినీ బాగా బడితె పూజ చేశారు కాపులు. వాళ్లు తమను చితకబాదు తూంటే అంతా అనుకున్నారు "అందుకేరా బాబూ ! అందరకు దెత్తునా కొందరకు దెత్తునా ? అన్నాడు వీడు" అని ఒక్కొక్కప్పుడు కొంటెవాడి కొకపని చెప్పినప్పుడు వాడు దాన్ని సరిగా చేసుకురాకపోగా మనందరకు ప్రమాదం వచ్చేట్లు పరిణమింపచేస్తున్న ప్పుడు ఈ సామెత గుర్తుకు వస్తుంది.

దొందుకుదొందే కొందప్పా !

ఇరుపక్షాలవారు ఒకరినొకరు అతితెలివిగా మోస గించుకొని ఒక పెళ్ళి చేశారు. దంపతుల్ని శోభనం నాటి రాత్రి గదిలోకి నెట్టి బయట తలుపు గొళ్ళెం పెట్టారు. పెళ్ళికొడుకు పెళ్ళికుమార్తెను హేళనచేస్తూ 'చూశావా ! నీకు ఎలాగ టోపీ వేశానో' అన్నట్లు పొడుగుచేతుల చొక్కాలో కప్పిన పొట్టిచెయ్యి

అడించాడు. అందుకా పడుచు బిడియపడడం మాని వళ్ళగిలించి 'అహా!' అన్నట్లు చెంపమీదుగాగప్పిన వాలుజడను తప్పించింది. ఆమెకొక చెవిలేదు. ఒకరి నొకరిలా వంచనచేసుకుని తామే మోసగింపబడినట్లు గుర్తించి తెల్లమొగాలేసినవాళ్ళను తలుపుసందులోంచి బయటనుంచి చూసిన ఒక నత్తివాడు అన్నాడు నవ్వుతూ *"దొందుకుదొందే కొందప్పా"* అని. తమ్మతామే వంచించుకొన్న ఇద్దరు తెలివైనవారిని ఈ లోకోక్తి ఎత్తిపొడుస్తుంది.

తుమ్మలగుంట శేరీకి నీవు వెళ్లేవా బసవన్నా?

ఈ "శాస్త్రం" ఒక రైతు కుటుంబంనుంచి వచ్చినట్లు తెలుస్తోంది. కుటుంబంలోవున్న సభ్యులు ముగ్గురే. తండ్రి, కొడుకు, కోడలు. ఆ పడుచు క్రొత్తగా కాపురానికి వచ్చింది. కొడుకు వ్యవసాయం పని చూసుకునేవాడు. తండ్రి, ఆయన దార్ఢ్యంగల వాడే అయినా పైపెత్తనం చేస్తుండేడు. వారిది దవ్వు పొలం. కొడుకు పొలానికి చేరుకునేసరికి మట్ట మధ్యాహ్న మయ్యేది. దుక్కి గట్రా పూర్తిచేసుకునే వేళకు ప్రొద్దు గ్రుంకేది. అంతదూరం నడిచి రాత్రి భోజనాని కిల్లుచేరుకునేవాడు, ప్రతిరోజూ ఇదేవరస. పగలల్లా మిక్కిలిగా అలసి పొట్టు పొట్టై పోవడంచేత రాత్రి మంచంయెక్కి ఓపికరేక పడిపోతుండేవాడు పసివాడు. ఇదంతా చూసిన చిన్నదాని మనస్సు బిక్కపోయేది. తానైతే ఇంటికోడలు- మామగారి యెదుట బడి సిగ్గువిడిచి ఈ సంగతి ఎలాగ చెబుతుందీ? ఒకనాడు మామగారు పశువుల పాకలో కోడెలను పరీక్షిస్తున్నాడు. అదేసమయంలో కోడలు కుడితి గలుపుకు వచ్చింది పాడియావుకు. ఇంతలో దైవికంగా ఓ సంఘటన జరిగింది. పెద్ద యెద్దొకటి అబెయ్యను దాటబోయి చటుక్కున క్రిందబడిపోయింది: ఆలేత యిల్లాలికి అవకాశం దొరికింది— వెంటనే అంది అయ్యో "*తుమ్మలగుంట శేరీకి* (వాళ్ల జిరాయితీ పేరుగాని అదేమో!) *నీవూ వెళ్ళేవా బసవన్నా*" అని. అంతే. ఆమాట వింటూ లేచి పోయాడు మామగారు. మర్నాడు ప్రొద్దున్నే కావడి బుజానవేసుకు పొలంపోయే కొడుకును ఆజ్ఞాపించాడు. "ఇవాళనుంచి నువ్వు పొలం వెళ్ళవద్దు. ఆ వ్యవసాయం నేనే చూస్కుంటాను." దీన్నే పల్లె భాషలో *"ఎద్దా! నువ్వూ వెళ్ళేవా మద్దేలపొలం?"* అనడం కద్దు.

ఈ చివరి చిన్న కథతో వ్యాసం ముగిస్తాను. ప్రసక్తానుప్రసక్తంగా వీనిలో మూడు సామెతలు వస్తాయి. ఒక యూరిలో గొల్లవాడొకడు సంజవేళ మేకలను దొడ్డిబెట్టి చీకటి పడినాక ఇంటికెడుతూ కొడుకును జాగ్రత్తగా మేకలను కాపాడమని "నాయనా! జాగ్రత్త! పులీ పుట్రా వచ్చేను" అని హెచ్చరించాడు. ఆ సరికే చేరువనున్న అడవినుంచి మేకలకై వచ్చిన పెద్దపులి చల్లగా మందలోకి ప్రవేశించి దాగుకున్నది. ఈ తండ్రిమాటలువిని "నాకన్న దొడ్డదేమో- ఆ పుట్ర అనేది ఎంతటిదో!" అనుకొంది. తండ్రి ఇంటికెళ్ళిపోయాడు. చీకటి దట్టంగా నలుమూలలా అలుముకొంది.

ఆ చీకటిలోనే దొంగ యొకడు మేకనెత్తుకపోవడానికి వచ్చి మేకలన్నిటిని తడిమి తడిమి వాటిమధ్యనున్న పులిని తాకి "ఇది పెద్ద మేక" అనుకొని దాన్ని వొడిసి పట్టుకున్నాడు. పులి "ఓహో! ఇది పుట్ర కాబోలు. నేనేమైనాచేస్తే ఏమౌతుందో" అనుకొని కిమ్మనకుండా వూరుకొంది పులి. బరువుగా వున్న పులిని కొంతదూరం మోసుకొనిపోయి గోళ్లు అవీ తగిలి ఇదేదో క్రూరజంతువని పసికట్టిన ఆ తుంటరి దాన్ని నేలపైవైచి ముందుగా ఒక తాపు తన్నిచూసేసరికి అది పెద్దపులి అని తెలిసింది. ఇంకేముందీ? ప్రాణాలు పైకెగసినట్లయిపోయి భీతితో అక్కడనే వున్న చెట్టెక్కాడు. తెల్లవారిన తర్వాత నేనా దిగకపోతాడా అని కాచుకొనివుంది క్రింద పులి.

ప్రొద్దుటనే ఆ దారిన ఒక ఎలుగుగొడ్డు పోతూ పెద్దపులిని "ఏమి సోదరా! ఇక్కడున్నావు?" అని అడిగింది. ఒక తుంటరి నన్ను మోసగించాడు "*పులిమీదపుట్ర*" అంటే కాబోలనుకున్నాను, అదిగో!

వాడు ఆ చెట్టుమీద వున్నాడు" అని చూపించింది. "ఓ ఇదా! నేనిప్పుడే చెట్టెక్కి వాణ్ణి క్రిందకు పడే టట్లు చేస్తాను" అని ఎక్కబోతుంటే "వాడు ముందు తాపుడుగాడు సుమా! తమ్ముడూ! జాగ్రత్త!!" అని పులి అనగా "ఫర్వాలేదు" అని ఎలుగుబంటి చెట్టె క్కింది. వాడు దాన్ని పైదాకా రానిచ్చి ఫెడేలున తన్నాడు. అది పల్లటీలుకొట్టి క్రిందకు పడింది. పులి ఓదార్చబోయి "నేచెప్పలేదూ! వాడు ముందుతాపుడు గాడని" అంది. అప్పుడు ఎలుగుబంటి అన్నది "కాదన్నయ్యా! *వాడు వెనకతాపుడుగాడే*" అని. (ఎలుగుబంటి వెనుక కాళ్ళతో చెట్టెక్కింది.) పదే అని తాము విరాళ చేసుకున్నట్లు నటించి పులీ, ఎలుగుబంటి దూరంగా నడచాయి.

ఇంక ఫర్వాలేదనుకుని మనిషి చెట్టు దిగాడో లేదో అల్లంత దూరాన్నుంచే గాండ్రుమంటూ పెద్ద పులి అతడిమీదికి బయలుదేరింది. మనిషి కాలుకొద్దీ పలాయనం చిత్తగిస్తున్నాడు. ముందు అతడు వెనుక పెద్దపులి, ఎలుగుగొడ్డు పోగాపోగా ఒక విష్ణ్వా లయం కనబడింది. బ్రతుకు జీవుడా అనుకొని వాడు తటాలున ఆలయంలోకిపోయి తలుపులు మూసుకుని గడియవేశాడు. పెద్దపులి, ఎలుగు చాలాసేపటి వరకు తలుపులుబాది విఫలయత్నం చేశాయి. చేసేదేమీ ఇకలేక గ్రుడ్లు మిటకరించి ఊటలు మ్రింగుతూ కల ద్రొక్కుకుంటూంది పెద్దపులి.

కథ ఇలాగుండగా ప్రవేశించారు నక్కబావగారు. బెబ్బులిని సమీపించి "ఏమిటింత ఆగ్రహం బావ గారూ? అని ప్రశ్నించింది. "*పులిమీద పుట్ర*" లగా యతు "*ముందుతాపుడుగాడుగాదు వెనకతాపుడుగా*" డనేవరకు కథ వినిపించాయి ఎలుగూ, పులీని. "అదా సంగతి! మీకు బుర్ర పనిచెయ్యలేదు. చూడండి క్షణంలో ఈ తలుపు తాళందీసి మీకు ఆ దొంగను భోజనంగా యిచ్చినా తడాఖా చూపిస్తా" నని నక్క తలుపు సందులోంచి తోకను దోపి గడియ మెట్టడం ప్రారంభించింది. ఆ తుంటరిమాత్రం సామాన్యుడా? వాడొక వెయ్యిమాయలవాడు. రెండు చేతులతోను తలుపు సందుగుండా లోనికి చొనుప బడ్డ నక్కతోక బలంగా పట్టుకున్నాడు. ఆ బాధ కోర్వలేక నక్క పళ్ళు ఇకిలించడం ప్రారంభించింది.

"అరే! బావా! అలాగ పళ్ళిగిలిస్తున్నావు?" అని పులి అడిగింది. "*ఇకిలించకుండా సకిలించకుండా వస్తాయా నంబివారి తాళాలు?*" అని తిరిగి ప్రగ ల్భమే పలికింది జంబుకం. లోపలినుంచి వాడు తోక లాగ్గా లాగ్గా అదికాస్తా ఊడి చక్కాబోయింది. నక్క పరాభవం పొందీగూడా గాంభీర్యాన్నే ప్రక టిస్తూ పులిదగ్గరకురాగా "ఏమైందేమిటి" అని అడి గింది పులి. భేషజాన్ని కనబరుస్తూ నక్క అంది "పదండిపోదాం. మీరిద్దరు భ్రమపడ్డారు. పులిమీద పుట్రాలేదు గిట్రాలేదు. మీకేం తెలియదు. నాకిపు డసలు రహస్యం తెలిసింది. వాడు *వెనకతాపుడు గాడూగాదు; ముందు తాపుడుగాడూగాదు. తోక పీకుడుగాడు*" అని.

తాము వంచితులయ్యీ ఒకరినిమించి మరొకరు తమ భంగపాటును దాచిపుచ్చి పైగా దాన్ని తమ ప్రకర్షగా చిత్రవిచిత్రంగా సమర్థించుకొనజూచే వాళ్ళనుచూస్తే ఈ కథ గుర్తుకు వస్తుంది.

ఇల్లాగ్గా పేర్కొంటూపోతే గ్రంథం విస్తరిస్తుంది. ఈ దిగువ సామెతల వివరణ, వీటి వెనుకనున్న కథలు, సంఘటనలు స్థలాభావంవల్లను, అవి ఎంత రసవత్తరములైనా వాటిని ఇక్కడ పేర్కొనగూడదు గనుకను వీనియందలి గూఢార్థాలు తెలియని పాఠ కులు అవి తెలిసిన పెద్దలనుండి గ్రహిస్తారని ఆశిస్తున్నాను. "*సగంబెట్టి మేనత్తేమిటి:*" "*ఏనుగకు నక్క రాయబారమా?*" "*ఆ అనేదేదో త్వరగా అనండి మామగారూ?*" "*కోడలిని వెనుదవిలిన మామగారివలె అలా చూస్తావే:*" అంటే "*నీకెప్పుడు చెప్పిందిరా?*" అన్నాడట—మొదలగునవి.

# విరోధులు

ఆంటన్ చెఖోవ్

సెప్టెంబర్ మాసంలో ఒకనాటి చీకటి రాత్రి తొమ్మిది గంటలు దాటిన తరువాత, డాక్టర్ కిరిలోవ్ ఏకైక పుత్రుడు ఆరేండ్లవాడు డిప్తీరియా రోగంతో చనిపోయాడు. దుఃఖోద్వేగానికి తట్టుకోలేక డాక్టర్ భార్య మంచం ప్రక్కన కూలబడింది. ఇంతలో బయటి గంట కర్కశంగా మ్రోగింది.

డిప్తీరియా కారణంగా నౌకర్లంతా ప్రొద్దున్నే ఎక్కడి వాళ్లక్కడ వెళ్లిపోయారు. అందుచేత డాక్టర్ ఉన్నవాడున్నట్టుగానే తలుపు తీయటానికి వెళ్లాడు. వేస్ట్‌కోటు గుండీలు పెట్టుకోలేదు, తడి ముఖం తుడుచుకోలేదు, చేతుల కంటిన కార్బాలిక్ కడుగుకోలేదు. హాల్‌లో చీకటి మూలంగా ఆవచ్చిన మనిషి సాధారణమైన ఎత్తుగలవాడనీ, తెల్లని మఫ్లర్ చుట్టుకొన్నాడనీ, ఆయన విశాలమైన ముఖం విపరీతంగా పాలిపోయిందనీ మాత్రమే డాక్టర్ గుర్తుపట్టగలిగాడు.

"డాక్టర్ గారింట్లో ఉన్నారా?" ఆగంతుకుడు తొందరలో అడిగాడు.

"నేనే. ఏం కావాలి మీకు?"

"అమ్మయ్య! బ్రతికాను." ఆయన కంఠంలో పెద్ద బరువు దిగిపోయిన లక్షణం ధ్వనించింది. చీకటిలో డాక్టరు చేతికోసం వెదకుతూ ఆ చేయి దొరకిన వెంటనే దానిని తన రెండు చేతులతో అదుముతూ ఆయన ఇలా అన్నాడు. "ఇంతకుముందు మనం కలిసికొన్నాం. నా పేరు ఆబోగిన్. పోయిన వేసగిలో మీ దర్శనభాగ్యం నాకు కలిగింది. మీరింట్లో ఉండటం వల్ల నాకెంత సంతోషం కలిగిందో చెప్పలేను. దయచేసి తొందరగా నాతో రండి. నా భార్య చాలా అనారోగ్యంగా ఉన్నది. నాతోరండి. పోవటానికి నా బండి సిద్ధంగా ఉన్నది."

ఆగంతుకుని మనస్సు పరమ వ్యాకులంగా ఉన్నదని ఆయన కంఠధ్వని, అంగచలనమూ చెప్పుతున్నవి. మహాగ్నిభయం నుంచి అప్పుడే తప్పించుకొనివచ్చిన వానివలె పెట్టికుక్క తరుమగా వేగంగా పరుగెత్తుకొని వచ్చిన వానివలె ఆయన ఉచ్ఛ్వాస నిశ్వాసాల్లో వేగము, మాటల్లో తొందరా, కంపమూ గోచరిస్తున్నవి. మహా భయంలో ఉన్నవానికి కంఠం పెగులక మాటలు సరిగా బయటకురానట్లు ఆయన మాటలుకూడా ఆగుతూ ఆగుతూ బయటికి వస్తున్నవి. అసలు విషయంతో సంబంధంలేని ఎన్నో మాటలు ఆయన మాట్లాడుతున్నాడు.

"మీరు ఇంట్లో ఉండరేమో అని నేను భయపడ్డాను. త్రోవంతా ఇలా భయపడుతూనే వచ్చాను. దయచేసి కోటు తొడుక్కొని తొందరగా రండి. పాషిన్స్కీ ఇవ్వాళ నన్ను చూడటానికి వచ్చాడు. మీకాయన తెలుసుననుకొంటాను. కొంతసేపు మేము మాట్లాడుతూ కూచున్నాం. తరువాత టేబుల్ దగ్గరికి వెళ్ళి టీ త్రాగుతున్నాము. నా భార్య అకస్మాత్తుగా కేకపెట్టి గుండె చేత్తో అదుముకొని కుర్చీలో కూలబడ్డది. మేమామెను మంచం దగ్గఱకు ఎత్తుకపోయాము. అమోనియాతో నేనామె కణతలను బాగా నలిచాను. నీళ్లు చల్లాను. కాని ఆమె అల్లాగే

---

ఆంటన్ చెఖోవ్ (౧౮౬౦-౧౯౦౪) రష్యన్ నాటకకర్త. కథానికా రచయిత. విప్లవమునకుపూర్వము రష్యాలో పుట్టిన ప్రసిద్ధ రచయితలలో నొకడు. ఆనాటి రష్యన్ జీవితముయొక్క నిరర్థకతను, దాని యెడ తన విసుగును చెఖోవ్ తన రచనలలో సూచించెను. చెరీ ఆర్చర్డ్ అతని ప్రశస్తమైన నాటకము. సీగల్, త్రీ సిస్టర్స్ అతని ఇతర ప్రసిద్ధనాటకములు.

చచ్చినట్టు పడిఉన్నది. అది అనూరిజం (Aneurism) ఏమో అని నాకు భయంగాఉన్నది. ఆమె తండ్రి కూడా అదేరోగంతో చచ్చిపోయాడు డాక్టరుగారూ!"

డాక్టరు చడీచప్పుడూ లేకుండా నిలబడ్డాడు, ఆ గంతుకుడు మాట్లాడే భాష తన కర్థంకానట్టు.

అబోగిణ మళ్లీ పాషిన్స్కి పేరు చెప్పాడు. తన మామగారి పేరు కూడా చెప్పాడు. డాక్టర్ చేతికోసం మళ్లీ ఆ చీకట్లో తడుమటం మొదలుపెట్టాడు. అప్పుడు డాక్టరు తల పైకెత్తి ఉదాసీనంగా ఈ మాటలు జారవిడిచాడు.

"క్షమించండి. మీ యింటి కిప్పుడు రాలేను. అయిదు నిమిషాలు కూడా కాలేదు — నా కొడుకు పోయినాడు."

అబోగిణ ఒక్కడుగు వెనుకకు వేశాడు. గొంతు లోంచి మాట పెకలుస్తూ ఇల్లా అన్నాడు. "అయ్యో! నిజమా? ఓయి భగవంతుడా! ఎట్లాంటి దుర్వేళ నన్నిక్కడకు తీసుకవచ్చావు? ఎంత దుర్దినం! ఎవడనుకున్నాడు ఈ రెండు సంఘటన లిట్లా ఒక దానికొకటి అనురూపంగా జరుగుతాయని?"

అబోగిణ ఏదో ఆలోచనలో మునిగినవానివలె తలవంచుకొని తలుపుపట్టుకొని నిలబడ్డాడు. వెళ్ళిపోవటమా లేక ఇంకా డాక్టర్‌ను రమ్మనిఅడగటమా-ఈ అనిశ్చితస్థితి ఆయన్ను వదలలేదు. డాక్టరుగారి అంగిచేతిని పట్టుకొని ఆయన మళ్ళీ ఇట్లాఅన్నాడు. "మీ పరిస్థితి నాకు బాగా అర్థమైంది. ఈ స్థితిలో మిమ్ము తీసుకుపోవటానికి ప్రయత్నం చేయడం నాకెంత సిగ్గుగా ఉందో భగవంతుడికి తెలుసు. కాని నన్నేం చేయమంటారు? మీరే చెప్పండి. నేనెక్కడికి పోవాలి? ఈ చుట్టుపక్కల మీరుతప్ప వేరే డాక్టరు లేడు. భగవంతుని పేరుమీద ఒక్కసారి రండి. నేను నాకోసం మిమ్మల్ని రమ్మని అడగటంలేదు. నేనుకాదు రోగిని."

కొంతసేపు నిశ్శబ్దము. డాక్టర్ అబోగిణ వైపు వెన్ను త్రిప్పి ఒకటి రెండు నిముషాలు మౌనంగా నిలబడ్డాడు. తరువాత హాల్లోనుంచి వేరే గదిలోకి వెళ్లాడు. గదిలో దీపం ముట్టించలేదు. ఆయన దీపపు బుగ్గమీది షేడ్ అంచులను చక్కజేస్తూ టేబుల్‌మీద ఉన్న ఒక పెద్దపుస్తకంలోనికి ఊరకే చూస్తున్నాడు. ఆ క్షణంలో ఆయనకు దేన్నిగురించిన ఆలోచనా లేదు. ఏ భావమూ లేదు. ఏ కోరికా లేదు. ఎవరో క్రొత్త మనిషి హాల్లో నిలబడిఉన్నాడన్న సంగతి కూడా ఆయన సంపూర్ణంగా మఱచిపోయిఉంటాడు. ఆ గదిలోని నిశ్శబ్దత ఆయన జడత్వాన్ని ఇంకా వృద్ధిపొందించటానికే తోడ్పడ్డది.

ఆ గదిలోంచి డాక్టరు తన పుస్తకాల గదిలోనికి వెళ్లుతూ కుడికాలు బాగా పైకెత్తి తలుపుకోసం వెదకసాగాడు. తానొక క్రొత్తఇంట్లో ఉన్నట్లు. జీవితంలో మొట్టమొదటిసారిగా తప్ప త్రాగి అది తెచ్చిన క్రొత్త అనుభవానికి తాళుకోలేక దిమ్మెక్కిపోయినట్లు, ఆయన మూర్తిలో ఏదో చెప్పరాని వ్యాకులత వ్యక్తమౌతున్నది. ఆ గదిలో గోడకు అడ్డంగా పుస్తకాల షెల్ఫులకు పైభాగంలో కొంత వెలుగు పడుతున్నది. ఆ వెలుగు బారుగా తెరువబడిన పడకగది తలుపులో నుంచి వచ్చింది. వెలుగుతోబాటే ఊపిరి బిగించేసే కార్బాలిక్ వాసనకూడా వచ్చింది. డాక్టర్ టేబుల్ దగ్గఱ కుర్చీలో కూలబడ్డాడు. మళ్ళీలేచి పడకగదిలోకి వెళ్ళాడు.

కరాళమై మృత్యుసంబంధమైన నైశ్చల్యం ఆ పడకగదిని ఆవరించి యున్నది. అక్కడ నున్న ప్రతి చిన్నవస్తువూ అప్పుడప్పుడే ఉపశమించిన ఒక బీభత్సమైన తుపానును సూచిస్తున్నది. టేబుల్‌మీద ఒక పెద్దదీపం, సీసాలనడుమ చిన్నస్టూల్‌పై ఉన్న ఒక కాండిల్ గదినిండా వెలుగుజిమ్ముతున్నవి. కిటికీ ప్రక్కన మంచంలో ఒక పిల్లవాడు పడి ఉన్నాడు. కన్నులు కొంత తెఱచి యున్నవి. ముఖమేదో ఆశ్చర్యభావాన్ని సూచిస్తున్నది. పిల్లవానిలో కదలికలేదు కాని తెరచి ఉన్నకండ్లు క్షణక్షణమూ నల్లబడుతున్నవి. లోపలికి గుంజుక పోతున్నవి. చేతులు పిల్లవాని కళేబరంమీద పెట్టి ముఖాన్ని పెజ్జలో దాచుకొని పిల్లవాని తల్లి మంచం ప్రక్కన మోకరించి పడియున్నది.

పిల్లవానివలెనే ఆమెలోకూడా కదలికలేదు. దుఃఖ పరిశ్రాంతమైన ఆమెశరీరం అలసి అలసి తుదకు ఈ భంగిమను తనంతతానే ఏర్పరచుకొన్నట్లు దానిని కదల్చుట కామె భయపడుతున్నట్లు ఏదో ఉత్కటమైన వాంఛాబలంచేత ఆమె తన సమస్తశరీరాన్ని శయ్యకు గాఢంగా అదుముకున్నది. బ్లాంకెట్లు, పీలికలు, చేతులు కడుగుకొనే బేసిన్‌లు, గుంటలుగుంటలుగా భూమిపై నిలిచిననీరు, అక్కడక్కడ పడి ఉన్న బ్రష్‌లు, చమ్చాలు, నిమ్మకాయరసం సీసా, బరువెక్కినగాలి అన్నీ ఎక్కడివక్కడ నిశ్చలములై ప్రగాఢమైన శాంతియందు మునిగినట్లున్నవి.

చేతులు పంట్లాం జేబుల్లో పెట్టుకొని డాక్టర్ తన ప్రక్కన నిలబడ్డాడు. తల ఒకవైపునకు వంచి కొంతసేపు తన కొడుకువైపు చూచాడు. ముఖంలో ఉదాసీనత, ఉపేక్ష, గోచరిస్తున్నవి. గడ్డంలో అక్కడక్కడ కనబడుతున్న అశ్రుబిందువులు మాత్రం ఆయన అంతకుముందేడ్చినట్లు స్పష్టపరుస్తున్నవి.

మృత్యుభావంవల్ల గలిగే భయంకానీ, జుగుప్స కానీ, ఆ గదిలో ఉన్నట్లు లేవు. అక్కడి సమస్త మునం దావరించిన నైశ్చల్యంలో, తల్లి శరీరభంగిమలో తండ్రి ముఖరేఖలపై ముద్రితమైన ఉదాసీన భావంలో హృదయస్పందియైన ఒక ఆకర్షణ కనపడుతున్నది. మానవుని ఈ దుఃఖంలో సూక్ష్మాతిసూక్ష్మమై కృచ్ఛ్రానుభావ్యమైన ఒక అంద మిమిడియున్నది. లోకులు దీనిని తొందరగా అర్థం చేసికోలేరు. వర్ణన చేయనేలేరు. ఈ అందాన్ని బహుశః సంగీత మొక్కటే వ్యక్తపరచ గల్గుతుంది.

భార్యాభర్త లిద్దరూ ఏమీ అనటంలేదు. ఏడ్వటం లేదు. కాలంతో వారి యౌవనం గతించినట్లు ఈ పిల్లవానితో పిల్లలకనేశక్తిగూడా ఎల్లప్పటికొఱకు మాయమైపోయింది. డాక్టరు వయస్సు ౪౪ ఏండ్లు. ఇప్పటికే వెంట్రుకలు తెల్లబడి ఆయన ముసలివాడుగా కన్పిస్తున్నాడు. ఆయన భార్య వయస్సు ౩౫ ఏండ్లు. ఆంద్రీ వారి ఏకైక పుత్రుడే కాదు, చివరి పుత్రుడు కూడా.

మనస్సు తీవ్రంగా బాధపడుతున్న సమయంలో కూడా ఏదో పని చేయనిదే ఉండలేని ప్రకృతులు కొందరుంటారు. డాక్టరు అటువంటిప్రకృతిగలవాడు. ఆయన భార్య కాదు. కొంతసేపు భార్యప్రక్కన నిలబడ్డ తరువాత డాక్టర్ పడకగదిలోనుంచి ఒక చిన్న గదిలోనికి వెళ్ళాడు. అక్కడనుండి వంటగదిలోనికి వెళ్ళాడు. ప్రొయ్యి దగ్గఱ కొంతసేపు ఇటూఅటూ తిరిగి మళ్ళీ హాలులోనికి వచ్చిచేరాడు.

పాలిపోయిన ముఖంగల ఆ తెల్లని మఫ్లర్ మనిషి అక్కడ మళ్ళీ ఆయన వెంట పడ్డాడు.

"అమ్మయ్య" అబోగిన్ నిట్టూర్చాడు. "రండి పోదాం" తలపుతీస్తూ అన్నాడామనిషి.

డాక్టర్ ఉలికిపడి ఆ మనిషివైపు చూచాడు. ఆయనకు జ్ఞాపకం వచ్చింది.

"నేను రాలేనని చెప్పానుకదా? ఇంకా...."

"డాక్టర్‌గారూ, నేను రాతిబొమ్మను కాను. మీ పరిస్థితి నాకు తెలుసు. మీరంటే నాకు సానుభూతి కూడా ఉన్నది. కాని నేను మిమ్మల్ని నా కోసం రమ్మనటంలేదు. నా భార్య చస్తున్నది. మీరు ఆమె కేక విన్నట్టయితే, ఆమె ముఖం చూచినట్టయితే మీకు నా ఆవేగం అర్థమయ్యేది. మీరు లోపలికిపోతే బట్టలు వేసుకోటానికి వెళ్ళారనుకొన్నాను. డాక్టర్, ఎక్కువసమయం లేదు. దయచేసి రండి. మిమ్మల్ని వేడుకొంటున్నాను" మఫ్లర్ సర్దుకుంటూ ప్రార్థనా దీనమైన కంఠస్వరంతో ఈమాటలన్నాడు అబోగిన్.

"నేను మీతో రాలేను" ఒక్కొక్కశబ్దం స్పష్టంగా వేర్వేరుగా ఉచ్చరిస్తూ అన్నాడు డాక్టర్ సిటింగ్ రూంలో అడుగుపెట్టుతూ.

అబోగిన్ వెంటవచ్చి ఆయన చేతులు పట్టుకున్నాడు.

"మీరు మహాపదలో ఉన్నారని నాకు తెలుసు. కాని నేను మిమ్మల్ని పంటినొప్పి తక్కువ చేయడానికి కానీ రోగమేమిటో చూడటానికి కానీ రమ్మనటం లేదు. ఒక మనిషి ప్రాణం కాపాడటానికి రమ్మంటున్నాను."

యాచ్ఞాదీనమైన కంఠంతో ఆయన మళ్ళీ ఇలా అన్నాడు. "ఈ ప్రాణరక్షణ మీ దుఃఖంకంటె గొప్పది. రండి, కొంత ధైర్యం చూపించండి. మానవత్వం పేరుమీద...."

"మానవత్వం ?... అది రెండువాదరలు గల కత్తి. మీరు నన్ను తీసుకపోవద్దని ఆ మానవత్వం పేరుమీదనే మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను. సరిగ్గా నిలబడే శక్తికూడా నాలోలేదు. మీరు నన్ను మానవత్వం పేరు చెప్పి భయపెట్టే ప్రయత్నం చేస్తున్నారు. ఇంతకంటె వేరే చిత్రమేముంటుంది? కాని నేనేవిధంగా కూడా మీతో రావటానికి సిద్ధంగాలేను. ఈ స్థితిలో నా భార్యదగ్గఱ ఉండటానిక్కూడా ఎవ్వరూలేరు. నేను రాను...రాను..."

అబోగిన్‌ను రెండు చేతులతో దూరం జరుపుతూ డాక్టర్ ఒకడుగు వెనుకకు తగ్గాడు. ఏదోభయం ఆయనను హఠాత్తుగా ఆవరించింది. ఆ భయంతో ఇట్లా అనసాగాడు.

"దయచేసి నన్ను రమ్మని అడగకండి. క్షమించండి. చట్టప్రకారమైతే నేను విధిగా మీతో రావలసిందే. నన్ను చెవి పట్టుకొని గుంజుకపోయే అధికారంకూడా మీకుంది. సరే మీరట్లా చేయవచ్చును. కాని నేనిప్పుడేమీ చేయలేను. నేను మాటాడే పరిస్థితిలోకూడా లేను. క్షమించండి..."

"నాతో అట్లా మాట్లాడతారేమిటి డాక్టర్" డాక్టర్ చేయి మళ్ళీ పట్టుకుంటూ అన్నాడు అబోగిన్. "చట్టంలో ఏముంటె నాకేమిటి ? మీ ఇష్టానికి వ్యతిరేకంగా మిమ్మల్ని బలవంత పెట్టే అధికారం నాకు లేదు. మీరు దయతలచి వస్తే రండి. లేకపోతే నేను నిస్సహాయుడను. ఒక స్త్రీ చచ్చిపోతున్నది. మీ కుమారుడు ఇప్పుడే చనిపోయాడని మీ రంటున్నారు. అందరికంటె ఎక్కువగా మీకు నాబాధ అర్థం కావలసింది."

మితిమీరిన మనోవైకల్యంచేత అబోగిన్ కంఠం కంపిస్తున్నది. రావలసిందన్న ప్రార్థన ఆయన మాటల్లోకన్న ఆయన కంపనస్వరంలో ఎక్కువ ధ్వనిస్తున్నది. ఆ స్వరంలో ఎదుటివాన్ని ఆకర్షించే శక్తి ఉన్నది. అబోగిన్ నిష్కపటంగానే మాటాడుతున్నాడు కాని ఆయన మాటలు కుంటుపడుతున్నవి. ఒకప్పుడు కఠినంగానూ, మరొకప్పుడు ఆవేశపూరితంగానూ ఉన్నవి. డాక్టర్ ఇంట్లో అప్పుడున్న వాతావరణానికి అయోగ్యంగా ఉన్నవి. ఈ సంగతి అతనిక్కూడా అర్థమైనది. మాటలచేత ఎదుటివానికి తన బాధ అర్థమగుటలేదేమో అన్న భయంచేత తన స్వరాన్ని ప్రార్థనాదీనంగానూ మెత్తగానూ ఉంచటానికి సాధ్యమైనంత ప్రయత్నం చేస్తున్నాడు. మాటలచేత తాను సఫలుడు కాకపోయినా కనీసం ధ్వనియొక్క నిష్కపటతవల్లనైనా సఫలుడు కావాలని వాంఛిస్తున్నాడు. కేవలం మాటల్లోని గాంభీర్యం, వాటిలోని సౌందర్యం, మనస్సులో ఏ భావం లేనివాన్ని కదలించ గలవు కాని, బాగా సంతోషంలో ఉన్నవాన్నికానీ అతిదుఃఖితున్నికానీ తృప్తి పరచలేవు. అందుచేత ఉచ్చకోటి నందుకొన్న సుఖదుఃఖాల ప్రకటన చాలాసార్లు నిశ్శబ్దంగానే జరుగుతుంది. ప్రేయసీప్రియులు నిశ్శబ్దంగా ఉన్నప్పుడే ఒకరినొకరు బాగా అర్థంచేసుకొంటారు. ఒకని మృతిమీద ఇచ్చిన గంభీరోపన్యాసం చచ్చినవానితో సంబంధం లేనివాన్ని కదలించగలదుకాని విధవకూ చచ్చినవాని పిల్లలకూ చప్పగా నిరర్థకంగా గోచరిస్తుంది.

డాక్టర్ మాటాడకుండానిలబడ్డాడు. డాక్టర్‌యొక్క విధులనూ, ఆత్మత్యాగాదులనూ గురించి, అబోగిన్ కొన్ని మాటలు చెప్పిన తరువాత డాక్టర్ రూక్ష స్వరంతో అడిగాడు "ఇక్కడికి దూరమా" అని.

"ఎక్కువదూరం లేదు. నా గుఱ్ఱాలు బలం కలవి. డాక్టర్ ! నేను మీకు ప్రతిజ్ఞచేసి చెబుతున్నాను. ఒక గంటలో పోయిరావచ్చును. ఒక్కటేగంట."

డాక్టరు విధులనూ, మానవత్వాన్ని గురించి ఇదివరకు చెప్పిన మాటలన్నిటికన్నా ఈ తుది మాటలు డాక్టర్‌కు ఎక్కువ బరువుగలవిగా కనిపించినవి. ఒక క్షణం ఆలోచించి నిట్టూరుస్తూ ఆయన ఇలా అన్నాడు.

"సరే పదండి."

త్వరగమనంతో తన పుస్తకాల గదిలోనికి వెళ్ళి ఒక క్షణం తరువాత ఒక పొడుగాటి ఫ్రాక్ కోటు వేసుకొని బయటపడ్డాడు డాక్టర్. ఆబోగిజా సంతోషంతో చిన్న చిన్న అడుగులు వేసుకుంటూ ఆయన ప్రక్కనే నడుస్తున్నాడు. ఇద్దరూ హాల్లోంచి బయట పడ్డారు.

బయటంతా అంధకారం. కాని వాతావరణం హాలులోకంటె తేలికగా ఉన్నది. కొంచెము ముందుకు వంగిన పొడుగాటి డాక్టర్ మూర్తి, ఆయన కోస దేరిన గడ్డం, గరుడనాసిక రేఖలు రేఖలుగా చీకటిలో కనబడుతున్నవి. తన పాలిపోయిన ముఖంతో పాటు పెద్ద తలకాయ, దానికి సరిపడని టోపీతో ఆబోగిజా కనబడుతున్నాడు. ఆ చీకటిలో ఆయన మఫ్లర్ ముందుభాగం మాత్రమే తెల్లగా కనబడుతున్నది. వెనుక అది అతని పొడుగాటి వెంట్రుకలచే కప్పుక పోయింది.

"మీ ఔదార్యాన్ని ఎట్లు మెచ్చుకోవాలో నాకు తెలియడంలేదంటే నమ్మండి" డాక్టర్‌ను బగ్గీలో కూర్చోబెట్టుతూ అన్నాడు ఆబోగిజా. "ఉన్నదున్నట్లుగానే అక్కడ చేరుకుంటాం. లూకా! బండి ఎంత తొందరగా పోనివ్వగలిగితే అంత తొందరగా పోనివ్వు ఊ! కానీ!"

బగ్గీ వేగంగా పరుగెత్తటం మొదలుపెట్టింది. హాస్పిటల్ పై అంతస్తులోని మూడు కిటికీల్లోంచి కనబడుతున్న వెలుగు తప్ప అంతా చీకటి. కొంత దూరం పోయిన తరువాత ఆ వెలుగు కూడా లుప్తమై బగ్గీ గాఢాంధకారంలో మునిగిపోయింది. నలిగిపోయిన కుక్కగొడుగుల వాసన. ఆకులు కదులుతున్న ధ్వని. చెట్లకొమ్మల్లో అణగియున్న కాకులు చక్రధ్వనులకు ఉలికిపడిలేచి విలాపధ్వనులు చేయుట మొదలుపెట్టినవి. డాక్టరు కొడుకు మరణించాడనీ, ఆబోగిజా భార్య రోగగ్రస్తయనీ వానికి కూడా తెలిసి నట్లున్నది. చెట్లూ, పొదలు ఒకటొకటిగా వెనుకబడుతున్నవి. కట్టమీద నల్లనల్లని పెద్దపెద్ద పీడలు గల ఒక చెరువు మ్లానంగా కనబడుతున్నది. బగ్గీ ఊరి బయట పరుగెత్తుతున్నది.

త్రోవలో వాళ్ళిద్దరూ మాటాడనేలేదు. ఆబోగిజా మాత్రం ఒక్కసారి ఇల్లా గొణుగుతూ నిట్టూర్చాడు.

"ఎంత బాధాకరమైన పరిస్థితి! పోతారేమో అని భయంకలిగినప్పుడు ప్రేమించినంతగా దగ్గరివాళ్ళను మరెప్పుడూ ప్రేమించం."

నది దాటుతున్నప్పుడు బగ్గీవేగం తగ్గింది. డాక్టరు ఉలికిపడి తన సీటులో అటూ ఇటూ కదలి దుఃఖంతో ఇలా అన్నాడు.

"నన్ను పోనివ్వండి. నేను మీవద్దకు తరువాత వస్తాను. నేను నా అసిస్టెంట్‌ను నాభార్యదగ్గఱకు పంపదలచుకొన్నాను. ఆమె ఇంట్లో ఒక్కతే ఉంది."

ఆబోగిన్ మాటాడలేదు. చక్రాలు రాళ్ళకు కొట్టుకోవటం మూలంగా అటూ ఇటూ ఊగి, ఒడ్డుకుచేరి బగ్గీముందుకు పరుగెత్తింది. ఏమీతోచక చుట్టూ చూస్తూ డాక్టర్ కూర్చున్నాడు. చుక్కల మసకమసక కాంతిలో రోడ్డు కనపడుతున్నది. వెనుక నదీతీరం-దానిపై మెల్ల మెల్లగా మాయమౌతున్న చెట్లూ, పొదలూ - కుడివైపు ఆకాశంవలెనే అనంతమై స్నిగ్ధమైన ఒక పెద్దమైదానం. ఆ మైదానంలో ఎక్కడో దూరాన దీపాలు మిణుకు మిణుకుమని మెరుస్తున్నవి. రోడ్డు ప్రక్కగా ఎడమవైపున అడ్డదిడ్డంగా పెరిగిన చెట్ల పొదలుగల పర్వతమున్నది. దానిమీద పొగ క్రమ్మిన చంద్రబింబం నిశ్చలంగా వ్రేలాడుతున్నది. చిన్నచిన్న మేఘాలు అన్నివైపులనుండీ చంద్రబింబాన్ని చూస్తూ అది పారిపోకుండా కావలికాస్తున్నట్లున్నవి.

ప్రకృతి అంతా రోగగ్రస్తమైనట్టు కనిపించింది. చీకటి గదిలో ఏకాకినిగా కూర్చొని గతకాల స్మృతులతో బాధపడుతూ వాటిని అరికట్టటానికి ప్రయత్నం చేస్తున్న పతితవలె, భూదేవి, తప్పించుకోరాని శిశిరాగమనంకోసం శూన్యభావంతో ఎదురుచూస్తూ వసంత గ్రీష్మాదుల స్మృతులను త్రవ్వుకొంటున్నది. ప్రకృతిలో ఏవైపుచూచినా, అగాధమై అంధకారమయమై

గుండెల లోతుల్లోకూడా చల్లని వణుకులు పుట్టించే గోతులు. ఆ గోతులలోంచి బయటపడటం డాక్టరుకు గానీ, ఆబొగిన్‌కు గానీ, ఆ ఎబ్బని చంద్రబింబానికి గానీ, ఎప్పుడూ సాధ్యంకాదు.

బండి గమ్యస్థానానికి దగ్గఱకు వస్తున్నకొద్దీ ఆబొగిన్‌కు ఓపిక తగ్గుతూ వచ్చింది. ఆయన ఇటూ అటూ కదిలాడు. లేచి నిలబడ్డాడు. బండితోలే వాని భుజంమీదినుండి బయటికి చూచాడు. తుదకు బగ్గీ వచ్చి ఇంటిముందు నిలబడినప్పుడు రెండవ అంతస్తుపై వెలుగు కన్పిస్తున్న కిటికీలవైపు చూచాడు. శ్వాస వేగంగానూ, బరువుగానూ వస్తున్నది.

"ఏ వైపరీత్యమైనా జరిగితే ఇక నేనెప్పుడూ తేరుకోలేను." వ్యాకులత్వంతో చేతులు నలుపుకొంటూ డాక్టరు వెంట హాల్లోకి వస్తూ అన్నాడు ఆబోగిన్. "కాని బాధపడుతున్న ధ్వనులేమీ వినిపించటం లేదు. అంతా సరిగ్గానే ఉండి ఉంటుంది" ఆ నిశ్శబ్దతలో చెవులకు పని కల్పిస్తూ అన్నాడు.

హాల్‌లో ఏధ్వనీ లేదు. అడుగుల చప్పుడు కూడా వినిపించటంలేదు. కాంతిమంతమైన దీపములు వెలుగుతున్నప్పటికీ ఇల్లంతా నిద్రబోతున్నట్లు కనిపిస్తున్నది. ఇదివరదాకా చీకట్లో ఉన్న ఆబోగిన్, డాక్టర్లు ఇప్పు దొకరినొకరు బాగా చూచుకోగలిగారు. డాక్టర్ పొడుగ్గా ఉన్నాడు. భుజాలు కొంచెం వంగి ఉన్నవి. బట్టలు మలినమైనవి. మనిషి అందంగా లేదు. నీగ్రోలకువలె లావు పెదవులు, పొడుగు ముక్కు, ఖిన్నమూ, శూన్యమూ ఐన దృష్టి—ఇవన్నీ కలిసి ఆయనలోని ఏదో తీక్ష్ణతను, చల్లదనమును, కాఠిన్యమును సూచిస్తున్నవి. దువ్వుకోని వెంట్రుకలు, ఈడ్చుకపోయిన కణతలు, వయస్సు రాకముందే తెల్లబడిపోయిన పొడుగాటి సన్నని గడ్డం, ఆ గడ్డపు వెంట్రుకల్లోంచి అక్కడక్కడ కనబడుతున్న చిటుకము, దుమ్ముకొట్టుకొని పాలిపోయిన చర్మం, ఎదుటివానిని మర్యాదచేయుటయందశ్రద్ధ, ఇవన్నీ అతని దారిద్ర్యాన్నీ, బ్రతుకులోని విధురతనూ, జనులయందతని మనస్సు పొందిన విసుగునూ వేనోళ్ళ చాటుతున్నవి. శూన్యతాముద్రగల ఆ మూర్తిని చూచి ఇతనికొక భార్య ఉన్నదని కానీ, ఇతడొక పిల్లవాని కోసం దుఃఖపడగలడని కానీ అనుకోటానికి వీల్లేదు. ఆబోగిన్ భిన్నలక్షణములుకలవాడు. తెల్లనిమాంసల దేహం, పెద్ద తల, లావైన ముఖరేఖలు, సరిక్రొత్త ఫేషన్ ప్రకారం డ్రెస్. శరీరమున కత్తుకొనునట్లు గుండీలు పెట్టుకొనుటలో, వెంట్రుకలు దిద్దుటలో, అతని ముఖములో, సమస్తమూర్తిలో ఏదో అధికార రేఖయున్నది. తలయెత్తి, రొమ్మువిరిచి నడుస్తాడు. సంతోషజనకమైన కమ్మని స్వరంతో మాట్లాడుతాడు. వెంట్రుకలు సర్దుకొనుటలో, మఫ్లర్ మెడపైనుండి తీయుటలో స్త్రీజనయోగ్యమైన నాజూకుతనం కనబడుతుంది.

"ఎవ్వరూ లేరు. ఏ చప్పుడూలేదు. ఏమీ గడబిడలేనట్టుంది" అనుకుంటూ మెట్లెక్కుతున్నాడు ఆబోగిన్.

ఆయన డాక్టర్‌ను హాల్లోంచి ఒక పెద్ద గదిలోకి తీసుకపోయాడు. అందులో ఒక పెద్ద పియానో ఉంది. ఆ గదిలోంచి ఇంకొక చిన్న డ్రాయింగు రూములోనికి ప్రవేశించారు. మసకమసక గులాబీ కాంతులు గది నిండా తారాడుతున్నవి. గది చాలా సుఖప్రదంగా సంతోషజనకంగా ఉన్నది

"డాక్టర్‌గారూ, ఇక్కడ కొంతసేపు కూచోండి, మీరువచ్చారని వాళ్లతోచెప్పి ఒక్కనిముషంలో తిరిగి వస్తాను" అన్నాడు ఆబోగిన్.

డాక్టర్ ఒక్కడే కూర్చున్నాడు. ఆ గదియొక్క సుఖప్రద వాతావరణం, చక్కని గులాబీవెలుగు, అట్లాంటి పరిస్థితుల్లో తానొక క్రొత్తవాని ఇంట్లో ఉండుట, ఈ దేనివల్లా, ఏ విధంగానూ ఆయన కదలినట్లు కనబడదు. కార్బాలిక్ అంటిన తన వ్రేళ్ళు మాత్రం ఆయన చూచుకొంటున్నాడు.

అంతా నిశ్శబ్దం.... దూరంగా ఒకగదిలో ఎవరో పెద్దగా ఒక ఆశ్చర్యసూచక స్వరం వెలార్చారు. ద్వారబంధాలు విడలిన శబ్దం. మళ్లీ అంతా నిశ్శబ్దం. ఐదు నిముషాల తరువాత డాక్టర్ తన వ్రేళ్ళు చూచు

కోవటం మాని ఆబోగిన్ వెళ్ళిన ద్వారం వైపు చూడసాగాడు.

ఆబోగిన్ తలుపుదగ్గఱ నిలబడ్డాడు. కాని ఇంతకు ముందు గదిలోనుంచి వెళ్ళిన ఆబోగిన్‌కీ ఇప్పు డక్కడ నిలబడ్డవానికీ ఏమీ సంబంధంలేదు. ఆయన మూర్తిలో ఆవిశిష్టతలేదు. ఆయన ముఖము, చేతుల కదలిక, నిలుచున్న భంగిమ అంతా ఒకవిధమైన జుగుప్సాభావాన్ని వెలార్చుతున్నవి. అది దేహం పడుతున్న బాధకాదు. మనస్సుపడుతున్న భయం కాదు. ఆయన ముక్కు, పెదవులు, మీసము, సమస్త ముఖ రేఖలు అన్నీ మెలికలు తిరిగిపోతూ ఆముఖం నుంచి ఊడిపడదలచుకొన్న వేమో అన్నట్లున్నవి. కన్నుల్లో బాధారేఖ కనపడుతున్నది.

బరువుగా పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ ఆబోగిన్ గదిమధ్యకు వచ్చాడు. ముందుకు వంగి ఒకసారి మూర్ఖి ముష్టి బిగించాడు.

"అది నన్ను మోసగించింది. వదిలేసింది. ఆ వెధవతో పారిపోవటానికే రోగం వచ్చిందని చెప్పి డాక్టరు దగ్గఱకు పంపించింది." ఆబోగిన్ అరుస్తున్నాడు.

ఆబోగిన్ డాక్టరుదగ్గఱవాకా నడచాడు కష్టంగా. తన ముష్టిని డాక్టరు ముఖందగ్గఱ పెట్టి మళ్ళీ ఇలా అరచాడు.

"వదలేసింది. మోసగించింది. ఎందుకీ అబద్ధాలు ఎందుకీ దొంగవేషాలు, ఏమిటీ ద్రోహం? నే నామె కేమపకారం చేశాను నన్ను వదలటానికి?"

కన్నీళ్లు ఆబోగిన్ బుగ్గలపైనుంచి జారినవి. ఆగది ఒక కొననుంచి ఇంకొక కొనకు ఆయన పచారుచేయుట మొదలుపెట్టాడు. చిన్న ఫ్రాక్‌కోటూ, కాళ్ల కత్తుకొన్న ఫేషనబుల్ లాగూ, పెద్ద తలా, పొడుగు వెంట్రుకలూ - వీటన్నిటివల్ల ఆబోగిన్ ఇప్పుడొక సింహంవలె కనబడుతున్నాడు. డాక్టరుగారి ఉదాసీన దృష్టిలో కొంత కౌతూహలం గోచరించింది. ఆయన లేచి ఆబోగిన్ వైపు చూస్తూ "సరే కాని, రోగి యెక్కడ?" అని అడిగాడు.

"అది రోగికాదు. పతిత. ఛీ ఛీ ఎంతనీచం. సైతాను కూడా ఇంతకంటె జుగుప్సాకరమైన ఉపాయం వెదకి ఉండేదికాదు. ఆ దౌర్భాగ్యపు కుంచెనకానితో పరుగెత్తటానికి నన్నది బయటికి పంపింది. అయ్యో! దేవుడా! అది చచ్చినా బాగుండేది. ఇప్పుడేది గతి? ఏమిదారి? దీన్నుంచి బయట పడటం ఎట్లా?" వేళ్లు బిగిస్తూ అన్నాడు ఆబోగిన్.

డాక్టరులో కొంత చలనం కలిగింది. ఆయన అప్రమత్తుడైనాడు. అరమోడ్చిన కన్నుల్లో అశ్రువులు నిండినవి. మాట్లాడుతున్నప్పుడు ఆయన దవడలు కదిలిన కొద్దీ ఆయన సన్నని గడ్డంకూడ ఎడమనుంచి కుడికి కదలుతున్నది.

"క్షమించండి. ఏమిటిదంతా?" అదే కౌతూహలంతో చుట్టూ చూస్తూ అంటున్నాడు. "నాకొడుకు చచ్చిపోయాడు. నా భార్య మహా దుఃఖంతో ఇంట్లో పడి ఏడుస్తూ ఉన్నది. మూడు రాత్రులనుంచి నేనొక్క క్షణం కూడా నిదురపోలేదు. సరిగ్గా నిలబడటంకూడా నాకు చేతకావటంలేదు. ఈపరిస్థితుల్లో మీరు నన్నిక్కడికి తీసుకవచ్చి నాకేంచూపిస్తున్నారు? ఈ అసభ్య నాటకంలో నాక్కూడా కొంతభాగం కల్పింపదలచారా ఏమి? నా కర్థంకావటం లేదు."

ఆబోగిన్ ముడచిన వేళ్లు విప్పాడు. నలిగిపోయిన ఒక కాగితం ముక్కను భూమిమీద పడేసి తాను నాశనం చేయదలచుకొన్న పురుగును కాలరాచినట్టు, దాన్ని కసిదీరా త్రొక్కాడు. పండ్లు బిగించి ఇలా అన్నాడు.

"నేనే అర్థంచేసికోలేదు. వాడు రోజూ కాలినడకన వచ్చేవాడు. ఇవ్వాళ బండీ ఎందుకు తెచ్చాడో గ్రహించలేకపోయాను. అంధుడను, మూర్ఖుడను."

డాక్టరు గొణిగాడు "నాకేమీ తెలియటంలేదు. ఇదంతా ఏమిటి? బాధపడుతున్నవాన్ని వెక్కిరించటం తప్ప, ఎదుటివాన్ని కించపరచటంతప్ప ఇంకేమీ కాదు. మీరన్నీ అసంభవమైన విషయాలు మాటాడుతున్నారు. నా జీవితంలో నే నిట్లాటి దెన్నడూ వినలేదు."

బాగా అవమానింపబడిన మనిషి అప్పుడప్పుడే తాను పొందిన అవమానాన్ని గ్రహించి ఏమీచేయక చేతులు నలుపుకొన్నట్లు నలుపుకొని, అవిశ్వాసంతో రెండుచేతులూ వెల్లకిల చాపి, మాట్లాడటానికేమీ తోచక, చేయుటకంతకన్నా తోచక కుర్చీలో కూల బడ్డారు డాక్టర్.

"నీవు నన్ను ప్రేమించటం లేదా? నీకింకొకని మీద ప్రేమ ఉన్నదా? సరేకాని ఈ మోసమెందుకు? ఇంత నీచమైన ఉపాయం పన్నటం దేనికి?" ఆబోగిన్ కన్నీళ్లతో అనుకుంటున్నాడు. "దీనివల్ల నీకు వచ్చే దేమిటి? ఎందుకు చేశావిట్లా? నీకు నేనేంనష్టం చేశాను?" తరువాత డాక్టర్ దగ్గఱకు పోతూ ఇలా అన్నాడు. "డాక్టర్, అనుకోకుండానే నా దురదృష్టాన్ని మీరు కళ్ళారా చూశారు. మీతో అసత్యమాడను. నే నొట్టుపెట్టుకొని చెబుతున్నాను. ఆమెను నేను ప్రేమిం చాను, ఆమె నారాధించాను. ఆమెకు దాసుడనై పోయాను. ఆమెకోసం సర్వం త్యాగంచేశాను. మా వాళ్ళతో పోట్లాడాను. పనివదలుకొన్నాను. సంగీతాన్ని విడచిపెట్టాను. ఏ పని చేస్తే నా తల్లినికానీ, చెల్లెలిని కానీ క్షమించేవాణ్ణి కాదో ఆ పనులు ఆమె చేస్తే సహించాను. ఒకప్పుడైనా ఆమెవైపు నేను కఠినంగా చూడలేదు. ఆమె ఇట్లా చేయటానికి కించిత్కారణం కూడా నేను కలిగించలేదు. ఈ అబద్ధాలన్నీ ఎందుకు? ఇంత నీచంగా మోసగించటం దేనికి? నీవు నన్ను ప్రేమించకపోతే అట్లని స్పష్టంగా ఎందుకు చెప్ప లేదు. ఇట్లాంటి విషయాలపై నా అభిప్రాయాలేమిటో నీకు తెలుసుకదా?"

కన్నీళ్ళతో, సర్వావయవాల్లో కంపిస్తూ ఆబోగిన్ విస్కృష్టంగా తన హృదయాన్నంతా వెళ్ళగ్రక్కు తున్నాడు. ఆయన తన ఇంటి రహస్యాలు ఏమాత్రం సంకోచంలేకుండా బయటపెట్టుతూ చేతులు హృద యాని కదుముకొని ఉద్వేగంతో మాట్లాడుతున్నాడు. తుదకెట్లోఒకట్లు ఈ రహస్యం బయటపడటం ఆబోగిన్‌కు సంతోషప్రదంగానేఉన్నట్టున్నది. ఇట్లా ఒక గంటసేపు తన హృదయం వెళ్ళగ్రక్కే అవ కాశం అతనికి దొరకితే అతడు కొంతకు కొంతైనా తేరుకునేవాడనటంలో సందేహంలేదు. డాక్టరు ఇంకో గంటసేపు మైత్రీసహజమైన సానుభూతితో ఆయన మాటలు విన్నట్టయితే 'నా అదృష్టం ఇంతే' అను కొని ఎక్కువ విచారపడకుండా ఆబోగిన్ ఊరడిల్లే వాడేమో! కాని అట్లా కాలేదు. ఆబోగిన్ మాట్లాడు తుండగా డాక్టర్ ముఖం మారిపోయింది. ఆయన ముఖంలో కనబడుతున్న ఉదాసీనత, ఆశ్చర్యం మాయమైపోయి వానిస్థానాన్ని విసుగూ, క్రోధ ద్వేషాలూ ఆక్రమించాయి. ఆయన ముఖరేఖలు మెల్ల మెల్లగా బిగువుతేరి, మరీ కఠినమై, అప్రియంగా మారి నవి. తుదకు ఆబోగిన్ ఒకఅందమైన యువతి బొమ్మ తెచ్చి డాక్టర్ కండ్లముందు పెట్టి 'ఈ ముఖం గల ఆడది అబద్ధమాడుతుందని విశ్వసించటానికైనా వీలున్నదా" అని అడిగినప్పుడు డాక్టర్ కోపం పట్ట లేక అకస్మాత్తుగా లేచి నిలబడ్డాడు. కన్నుల్లో ఒక ఆటవికమైనకాంతితాండవమాడుతుండగా ఒక్కొక్క పదాన్నే కఠోరంగా ఉచ్చరిస్తూ ఇలా అన్నాడు.

"ఇదంతా నాకెందుకు చెప్పుతున్నారు? మీ కథ వినే కుతూహలం నాకు లేదు. నేను వినను." ఇక నుంచి టేబుల్‌మీద గ్రుద్దుతూ అరవటం మొదలు పెట్టాడు. "నీ వెధవ రహస్యాలు నా కక్కఱలేదు. అవి గంగలో కలువనీ. ఇల్లాంటి వ్యర్థపుమాటలు నాకు చెప్పకు. ఇదివరకు నన్ను చేసిన అవమానం చాలదా? నీ యిష్టం వచ్చినట్లుగా, బుద్ధిలేకుండా అవ మానం చేయటానికి నీ నౌకర్ననుకుంటున్నావా?"

ఈ మాటలకు వెనక్కు తగ్గి ఆబోగిన్ ఆశ్చ ర్యంతో డాక్టర్‌వైపు చూడటం మొదలుపెట్టాడు.

"ఎందుకు తీసుకవచ్చావు నన్నిక్కడకు? ఏం చేయటం తోచక నీవు దాన్ని పెండ్లి చేసుకొన్నావు. ఏమీ పని లేకపోతే నీవలాంటి ఆటలే ఆడుకో వచ్చును. కాని వాటితో నాకేం పని? నీ ప్రేమకలా పంతో నాకు సంబంధమేమిటి? నీకేమీ పనిలేకపోతే పోయి ఎవనితోనైనా గ్రుద్దులాడుకో. తూటుకొమ్ములు వాయిస్తూ కాలం గడుపు. పంది బలిసినట్లు బలువు.

కాని ఇట్లా మనుష్యులతో వాళ్ళ హృదయాలతో ఆట లాడటం దేనికి? వాళ్ళని నీవు గౌరవించకపోతేమానె వాళ్ళచోట వాళ్ళను బ్రతుకనివ్వు."

"క్షమించండి. మీరు మాటాడే మాటల అర్థ మేమిటి ?"

"అర్థమేమిటంటే మనుష్యుల నవమానించటం, వాళ్ళ హృదయాలతో ఆటలాడటం అధమమూ నీచమూ అంటాను. డాక్టర్లనైనా, ఇంకే పనిచేసే వాళ్ళనైనా, వాళ్ల సెంటుతో ఘుమఘుమలాడకపోతే వాళ్ళలో వ్యభిచారం వాసన లేకపోతే మీ దాసులని మీరనుకొంటారు. అనుకుంటే అనుకున్నారుగాక కాని ఒక బాధపడుతున్న వ్యక్తితో ఇంత నీచంగా ఇంత లెక్కలేకుండా ప్రవర్తించే అధికారం మీ కెవ రిచ్చారంటాను ?"

ఈసారికి ఆబోగిన్ ముఖం కోపంతో ముడుతలు పడిపోయింది. "నన్నలాఅనే గుండెలు మీకున్నవా" అన్నాడాయన.

"నా దుఃఖం తెలిసికూడ నన్నిక్కడికి తీసుక వచ్చి నీ వెధవకథలు వినిపించే గుండెలు నీకు లేవూ ? ఒక దుఃఖపడుతున్న వ్యక్తిని వేలుపెట్టి చూపించటమే కాకుండా వాన్నింత హీనంగా వెక్కిరించే అధికారం నీ కెక్కడిది ?" టేబుల్‌మీద చేత్తో బలంగా చరుస్తూ అన్నాడు డాక్టర్.

"మీకేమన్నా పిచ్చెక్కిందా? ఎంత ఔదార్యం లేనివాడవు? నేనిదివరకే చాలా బాధపడుతున్నాను... ఇంకా......"

"బాధపడుతున్నావా?..." ద్వేషంతో వెక్కిరిస్తునట్లుగా అన్నాడు డాక్టర్. "ఆ బాధ అనే పదాన్ని నీవు వాడకు. నీకూ దానికీ ఏసంబంధమూ లేదు. దానికేం! కొవ్వెక్కువైన కోడిపుంజు కూడ బాధ పడుతుంది."

"మిస్టర్! మిమ్మల్ని మీరు మఱచిపోతున్నారు. అట్లాంటి మాటలంటే తన్నులు తగులుతవి తెలుసా ?"

ఆబోగిన్ జేబులో చేతులు దూర్చాడు. ఒక కాగితాల కట్టతీసి అందులోంచి రెండు నోట్లుతీసి టేబుల్ కేసి కొట్టుతూ ఇలా అన్నాడు.

"ఇది నీ విజిటింగ్ ఫీస్. నీడబ్బు నీకు దొరికింది." ఆయన నాసారంధ్రాలు వణుకుతున్నవి.

నోట్లను క్రింద విసరికొడుతూ అన్నాడు డాక్టర్. "పైగా డబ్బుకూడా ఇస్తున్నావా ? అవమానం డబ్బు చేత హరింపబడదు."

వాళ్ళిద్దరూ ఒకరినొకరు అవమానించే మాటలు మాట్లాడుతూనే ఉన్నారు. వాళ్ళెన్నడూ, బహుశః పైత్యపు రెమ్మలో కూడా ఇల్లాంటి కఠినమూ అనుచితమూ అయిన మూర్ఖపు మాటలు మాటాడి ఉండరు. సామాన్యంగా దుఃఖితునిలో పొడచూపే అహంకారం, ఇరువురిలో బాగా రెచ్చిపోయింది. అతి దుఃఖపడిన వాళ్లలో అహంకారం, కోపం, కాఠిన్యం, అనౌచిత్యమూ పొడసూపుతవి. ఇతరుల నర్థం చేసికొనటంలో వాళ్ళకన్నా పరమ మూర్ఖులు నయం. తమ దురదృష్టం వలన లోకులు ఐక్యమౌతారనటం కల్ల. పైగా ఆ దురదృష్టం మనుష్యలను ఒకరితో ఒకర్ని దూరంచేస్తుంది. బాధలోని సాదృశ్యం మనుష్యలను దగ్గఱకు తీసుకవచ్చి తీరుతుంది - అని వాదించ వచ్చు కాని అసలు సంగతేమంటే అట్లాంటివాళ్లు వాళ్ళకన్న తృప్తిగా బ్రతికిన వాళ్ళకంటె ఎక్కువ అన్యాయంగా, దయలేకుండా ప్రవర్తిస్తారు.

"దయచేసి నన్నింటికి పంపించండి" అన్నాడు డాక్టర్. ఆయనకు తన శ్వాస అవరోధింప బడుతున్నట్టనిపించింది.

ఆబోగిన్ పెద్దగా బెల్ మ్రోగించాడు. ఎవ్వరూ రాకపోయే అప్పటికి మళ్ళీ మ్రోగించి బెల్‌ను నేలకేసి కొట్టాడు. అప్పుడొక నౌకర్ వచ్చాడు.

"ఎక్కడ దాగున్నావు ఇదివరదాకా ? ఎక్కడ చచ్చావు ?" ముష్టి బిగించి నౌకరువైపు నడుస్తూ అన్నాడు. "పోయి ఈ పెద్దమనిషి కోసం బగ్గీ తయారుచేయించు. ఒంటి గుఱ్ఱపు బండీ నాకోసం

తయారుచేయించు." నౌకరు వెనుదిరగగానే క్రోధంతో మళ్లీ ఇలా అన్నాడు. "నాకు ద్రోహం చేసిన వెధవల్లో ఒక్కడు కూడా రేపిక్కడ కనబడ కూడదు. అందరూ వెళ్లిపొండి. నేను కొత్తనౌకర్లను పెట్టుకుంటాను."

బండ్లకోసం ఎదురుచూస్తున్నంతసేపూ వాళ్ళిద్దరూ మౌనంగా కూర్చున్నారు. అటోగిణ ముఖంలోనికి మామూలుగా ఉండే పెద్దమనిషితనం తిరిగివచ్చింది. ఆయన గదిలో అటూఇటూతిరుగుతూ తలఊపుతూ, ఏదో పథకం వేసికొంటున్నట్లున్నాడు. ఆయనలోని రోషం ఇంకా తగ్గినట్లు లేదు. కాని తనవిరోధి తన ముందున్నవిషయం తాను గమనించటంలేదన్నట్లుగా కనిపించటానికి ప్రయత్నం చేస్తున్నాడు. డాక్టర్ ఒక చేయి టేబుల్‌మీదఆనుకొని కదలకుండా నిలబడ్డాడు. అటోగిణ వైపు చూస్తున్న ఆయన కన్నుల్లో దర్ప పహం కాని ద్వేషభావం గోచరిస్తున్నది. పరమదుఃఖితులూ, అతిదరిద్రులూ అయినవాళ్ళు మాత్రమే సంతుష్టులూ, శిష్టులూ అయినవాళ్ళవైపు అట్లా చూడ గలరు.

కొంచెంసేపటి తరువాత బగ్గీలో ఇంటికి పోతున్నప్పుడు కూడా డాక్టరు కన్నుల్లో ఆ ద్వేషభావం గోచరిస్తూనే ఉంది. చీకటి గంటకిందికన్న గాఢమైంది. చంద్రబింబం పర్వతం వెనుకకు పోయి దాక్కున్నది. కావలిఉన్న మేఘాలు చెదరిపోయి నల్లనితునుకలై చుక్కలచుట్టూచేరి ఉన్నవి. వెనుక నుండి బండిచక్రాలధ్వని వినవచ్చింది. కొంతసేపటికి ఎఱ్ఱని దీపాలతో ఒంటి గుఱ్ఱపుబండీ ఒకటి డాక్టరు బగ్గీనిదాటి ముందుకు పోయింది.

ఇంటికి పోతున్నంతసేపూ డాక్టరు తనభార్యను గురించి ఆలోచించలేదు. చచ్చిన కొడుకును గురించి ఆలోచించలేదు. తానిప్పుడే వదలివచ్చిన ఇంటిలోని మనుష్యులను గురించి ఆలోచించాడు — క్రూరంగా అనుచితంగా. త్రోవపొడుగునా ఆయన అటోగిణనూ, ఆయన భార్యనూ, పాపిన్స్కీనీ అల్లాంటి రంగు రంగుల వాతావరణంలో బ్రతికే ఇతరులనూ దూషిస్తూనే ఉన్నాడు. తన హృదయం ఎంత ద్వేషాన్ని భరించగలుగుతుందో వాళ్ళమీద అంత ద్వేషాన్ని డాక్టర్ పెంచుకొన్నాడు. వాళ్ళను గురించి అనుచితమైనభావమొకటి ఆయనలో దృఢంగా నాటుకొన్నది.

కాలం గడచిపోతుంది. డాక్టరు దుఃఖం కూడా మాయమైపోతుంది. కాని మానవ హృదయానికే అయోగ్యమైన ఈ క్రూరభావం ఆయనలోనుండి పోదు. డాక్టరు మరణం వరకూ అది ఆయనలోనే స్థిరపడిఉంటుంది.

# అన్యాపదేశములు | భల్లటుడు

౧

అన్యాపదేశ రచనా
విన్యాసములన్ గ్రహించువేడుక యున్నన్
మాన్యుడు 'భల్లట' కవి మూ
ర్ధన్యుని ప్రౌఢోక్తి కావ్యరంగము గనుడీ!

౨

దినజన నోత్సవమ్ములను
  దిగ్వనితా వదనంబు సిందు రా
రుణ ఘనకాంతి సంపద మె
  రుంగులు దిద్దు నవోదయ ప్రభా
ఢ్య నిరుపమో జ్జ్వలమ్ములు వి
  యన్మణి దివ్య మరీచి మాలికల్
మనములరార మీ కెపుడు
  మంగళముల్ దయసేయు గావుతన్.

౩

గాజునే మణిగా ; మణి గాజుగాను
తలచు వారలు ప్రాణిమాత్రులు జగాన ;
గాజు గాజుగా, మణి మణిగానె చూడ
కలుగువారలే బుద్ధిమంతులు తలంప.

౪

అవసర వేళలన్ ధనము
  నౌదువు. పండుగలందు భూషణ
మ్మవుదువు. భీతి నొందినపు
  డాదరు వౌదువు. గాఢ రాత్రులన్
ప్రవిమల దీపమౌదు. వది
  రా! మణిరాజమ! నీ వలెన్ సదా
వివిధ మహోపకార పద
  వీ భరణక్షము లన్యు లెవ్వరే?

౫

ఓసి చింతామణీ! "భువి నొక్క నృపుడు
నన్ను తలదాల్ప"డంచు సంతాప పడకు
ఇంతకును నిన్ ధరించు అదృష్టమున్న
ఉత్తమాంగంబె లేదులే ఒక్కనికిని.

౬

చిట్టి చిటారు కొమ్మపయి
  జేరి, ప్రజల్ పయనించు బాటలో
గట్టిగ కీచురాలు చిర
  కాలము పెన్రొద బెట్టుగా కహో!
నెట్టన దిగ్దిగంతముల
  నిండి ప్రతిధ్వనులన్ జగమ్మునే
అట్టిటు లూపు శబ్ద గుణ
  మందున శంఖమునే గణింపనౌ.

౭

లోని తూట్లు లెక్కలేనన్ని - మరి పైన
కంటకాళి విషయ మంటరాదు -
ఇంక కమలనాళ మేరీతి చంచల
గుణముతోడ తాను కూడకుండు ?

అనువాదం : ధనకుధరం

# పుస్తక సమీక్ష

## రక్తాక్షి

రచయిత : సోమసుందర్ వెల :

కళాకేళి ప్రచురణలు, సామర్లకోట. ౬౨ న. పై.

అభ్యుదయ కవితోద్యమంలో ఆరుద్ర రచించిన "త్వమేవాహం" ప్రత్యేకస్థానం గడించింది. కాని దానిలో ఈ కవితా మార్గంలో ప్రదర్శిత మయ్యే టెక్నిక్ ప్రాధాన్యం వహించి కావ్యంగా దాని విలువను పూర్తిగా తగ్గించింది. శ్రీ సోమసుందర్ యీ కవితోద్యమంలో ప్రముఖపాత్ర వహించినవారు. ఆయన పూర్వ కావ్యాలలో ఇతరులలో కానరాని ప్రసాదగుణం కానవచ్చేది. ఈ కావ్యంలో ఆ గుణం అప్రధానమై చమత్కారకారి శిల్పం ప్రదర్శితమైంది. అది విచిత్రచ్ఛందో మార్గాల ద్వారా.

భావానుకూలమైన ఛందః ప్రయోగం పూర్వం నుంచీ వస్తున్నదే. అయినా ఛందో వైవిధ్యమే ప్రధానం కానక్కరలేదు కావ్యానికి. ఒకభావం అనుస్యూతంగా ఉన్నప్పుడు దానిలోనుంచి ఎప్పుడో కొట్టవచ్చే నిమ్నోన్నతాలను చిత్రించేప్పుడు విశేష చ్ఛందం ఉపయోగిస్తుంది. కాని మొదలంట వాడిన చమత్కారకారి శిల్పం కావ్య రసాను భావనలో వసుచరిత్రలోలాగ అడ్డు తగులుతుంది. ఈ కావ్యం మహాధ్వని పూర్ణమని కావ్య ప్రశంసకులలో ఒకరన్నారు. ఈ ధ్వని స్ఫూర్తి కల శబ్దం (సంకేతం) ఉంటేనేకాని కలుగదు. ఆ సంకేతం కావ్యంలో స్ఫూర్తిమంతం కాకపోవడంచేత ఈ కావ్యంలో ధ్వని కలుగడం లేదు.

అభ్యుదయ కవులు పూర్వచ్ఛందస్సులలోని విశేష వృత్తాలు వాడుకోవడం ఆహ్వానింపదగిందే. దండకం, ఏకాక్షర, ద్వ్యక్షర వృత్తాలు కూడా దీనిలో వాడబడ్డవి. కాని వ్యావహారిక భాష కీ వృత్తాలు లొంగడం లేదు. అంచేత గ్రాంథిక రూపాలు వాడవలసి వస్తున్నది. వాడిన నూతన ఛందస్సుల్లో అక్కడక్కడ గణభంగాలు గోచరిస్తవి. ఇది ప్రశంసార్హం కాదు.

కావ్యంలో మూడు భాగాలు ఉన్నై. అవి భూత, భవిష్యద్వర్తమాన కాలాలు. భవిష్యత్కాల భాగంలో సంకేతికాలయిన పంచభూతాలు శక్తిమంతములు, స్ఫూర్తిమంతములు కూడా. మూడు కాలాల్లోనూ ఒకే సంకేతాలను వాడివుంటే వాటిల్లోని తేడాను పోల్చుకో వీలుండేదేమో సులభంగా.

కావ్యమంతా స్వాదువుగా వున్నది. క్రొత్త వృత్తాలలో కొన్ని కవి చేతిలో మలగిపోయినై. కావ్యానికి పూర్వం వున్న గీతాలలో "కావ్యాలు రాసుకుంటానుతేరా" అన్న గీతం చాల బావున్నది.

ఈ కావ్యం అభ్యుదయ కవిత్వంలో స్వరూపం (Form) లో వచ్చిన మార్పు తెలుసుకో నుపకరిస్తుంది. కావ్యంలోని భావోన్మీలనకోసం యీ కావ్యం కొత్త మార్గాలను వేసింది.

—సుప్రసన్న

## మా అమ్మ
### (రాజరాజేశ్వరీ శతకము)

రచయిత : వెల :

తుమ్మపూడి కోటేశ్వరరావు ౩౭ న. పై.

ఈ శతకం ప్రౌఢంగా వున్నది. పరమేశ్వరిమీది పరమమైన భక్తి ప్రతి పద్యంలోనూ గోచరిస్తున్నది. పద్యాలు చిత్ర చిత్రములైన గతుల్లో సంచరిస్తవి. అక్కడక్కడ వ్యాకరణ దోషాలు ఉన్నవికూడా.

"తలపై చల్లని వెల్గురేక
కనువిందై యందముల్ చింద మి
న్నుల వాకన్ వికసించు
చెంగలువ చెన్నున్ నవ్వు నెట్టెందన
మ్ముల నిగ్గుల్ తొలుకాడు
నంగములఁ గర్పూర ద్రవామోద పి
చ్ఛిల మౌ తావక మూర్తిఁ
జూచు టెపుడో శ్రీ రాజరాజేశ్వరీ"

ఇలా సాగుతుంది శతకము. ముందు ముందు మంచి కావ్యాలు వ్రాసే ఆశ గోచరిస్తున్నది.

—సుప్రసన్న

## వచ్చే సంచికలో

విశ్వనాథ సత్యనారాయణ

మాదిరాజు దేవీప్రసాద్

కేతవరపు రామకోటిశాస్త్రి

సుప్రసన్న

మురయూ

నాగభూషణ్

దాశరథి

పోణంగి శ్రీరామ అప్పారావు

జమ్ములమడక మాధవరామశర్మ

ధూళిపాళ శ్రీరామమూర్తి

విశ్వనాథ వేంకటేశ్వర్లు

౩౧౬, సుల్తాన్ బజార్, హైదరాబాదునుండి జువ్వాది గౌతమరావుచే ప్రకటితము
అజంతా ప్రింటర్సు, సికింద్రాబాదు.